The Largest Circulated Telugu Monthly

# చతుర

ఏప్రిల్ 1997
రూ. 7/-



ఇచ్ఛాపురపు రామచంద్రం

ఆ కొండల వెనుక...

# జుట్టు రాలడం, చుండ్రు అనే సమస్యలు మీ దరి చేర కూడదనుకుంటే?

## అశ్విని హోమియో హెయిర్ ఆయిల్ ప్రతి రోజు వాడండి.

**వాడిన వారి అభిప్రాయము**

నాకు చుండ్రు ఎక్కువగా వుండి ఎన్నో తల నూనెలను వాడాను, ప్రయోజనము కనబడలేదు. తరువాత అశ్విని ఇంప్రూవ్డ్ హోమియో హెయిర్ ఆయిల్ వాడాను. నెలరోజులలో 90% తగ్గిపోయినది. చాలా ఆనందంగా వున్నది. నాలా బాధపడేవారికి ఎందరికో అశ్విని హోమియో హెయిర్ ఆయిల్ ఉపయోగపడాలని కోరుతూ....

డి. మల్లేశ్వరి B.Sc.,
గుంటూరు.

- జుట్టు ఒత్తుగా, మృదువుగా, ఆరోగ్యంగా పెరిగేందుకు సహకరిస్తుంది.
- చిన్న వయస్సులో జుట్టు తెల్లబడటాన్ని అరికడుతుంది.
- మాడు నొప్పిని తగ్గిస్తుంది.
- మెదడును చల్లబరిచేది.
- జిడ్డులేనిది.

IMPROVED TO CHECK DANDRUFF




For Healthy Hair



ASWINI

స్వచ్ఛమైన కొబ్బరినూనెతో తయారి

# చతుర ప్రపంచం

## నో వేకెన్సీ

1953లో ఎడ్మండ్ హిల్లరీ, షెర్పా టెన్సింగ్ ఎవరెస్ట్ పర్వతాన్ని మొట్టమొదటిసారిగా అధిరోహించిన విషయం అందరికీ తెలిసిందే. కిందికి దిగివచ్చాక వారిని కొన్ని ప్రశ్నలు వేశారు ఔత్సాహికులు.

"పర్వతాన్ని ఎక్కుతున్నప్పుడు, విజయాన్ని సాధించాక మీకేమనిపించింది?" అడిగారు ఒకరు.

"బాగున్నట్లూ, బాగుండనట్టూ కూడా అనిపించింది'' అన్నాడు హిల్లరీ.

బాగుండకపోవడం ఎందుకంటే మరో 10 సంవత్సరాల్లో ఎంతోమంది ఎవరెస్టును ఎక్కుతారు. దాంతో మా పేర్లు కూడా మీరు మర్చిపోతారు'' అన్నాడు.

అది కూడా ఒప్పుకోవలసిన విషయమే. 33 సంవత్సరాల సుదీర్ఘప్రయత్నం తరువాత ఎవరెస్ట్ అధిరోహణ విజయవంతమయింది. అటుపైన ఎంతోమంది దాన్ని అధిరోహించారు.

1953 నుంచి 1982 వరకు 63 జట్లు ఎవరెస్ట్ అధిరోహణకు ప్రయత్నించారు. అందులో కేవలం 27 జట్లు మాత్రం విజయాన్ని సాధించాయి. అందులో మొత్తం 136 మంది సభ్యులున్నారు. అప్పట్లో దక్షిణ, తూర్పు మార్గంనుంచి అధిరోహించడం తేలిక అని తెలిసింది. అయితే అంతకన్న కష్టతరమైన మార్గంగుండా అధిరోహించడమే గొప్ప అని మిగతావాళ్ల ప్రయత్నం. అన్నిటికన్న కష్టతరమయిన మార్గం టిబెట్ నార్త్‌రిడ్జ్ రూట్. ఈ మార్గంగుండా వెళ్లేటప్పుడు టన్నులకొద్దీ మంచుముక్కలు మీదపడే అవకాశముంది. అవి ఎంత బలంగా పడతాయంటే అప్పుడప్పుడు ఆ దెబ్బలకి ప్రాణాలు కూడా కోల్పోవచ్చును.






ఒక బ్రిటిష్ దంపతులు వారి టీమ్‌తో కలిసి ఈ మార్గంగుండా పోయినప్పుడు ఈ మంచుగడ్డల ప్రమాదంలో ఆ టీమ్‌లో ఎంతో మంది ప్రాణాలు కోల్పోయారు.

ఒక చైనా టీమ్, రెండు జపాన్ టీమ్‌లు ఈ మార్గంగుండా వెళ్లి విజయం సాధించారు. జపనీస్ మరొక ప్రమాదకరమయిన మార్గాన్ని కనుగొన్నారు. ఆ దారి నేపాల్‌లోని లాట్స్ అనే గ్రామాన్ని చుడుతూపోతుంది. అయితే అన్నిమార్గాలనుంచీ అధిరోహణ జరిగిపోయిందని చెప్పడానికి వీలులేదు. హిమాలయాల్లోని ఉత్తర తూర్పు శిఖరాన్ని ఎవరూ చేరలేకపోయారు. దీన్ని చేరుకోవడానికి నేపాల్‌లోని లాట్స్ గ్రామంగుండా పోయి తిరిగి నార్త్‌రూట్‌గుండా కిందకి దిగవచ్చని అంచనా వేశారు. ఇది అత్యంత ప్రమాదకరమైన మార్గం.

నేపాల్ ప్రభుత్వం ఈ మార్గం ద్వారా అధిరోహణ చెయ్యడానికి స్థానిక నేపాలీ కూలీలను నియమించింది. వీరివల్ల అది సాధ్యమయితే, నిజంగా అది ఎవరెస్ట్ ఎక్కవలసిన ఛాలెంజింగ్ రూట్ అని చెప్పవచ్చు. 29028 అడుగుల ఎత్తున వుంది ఈ పర్వతం.

ప్రపంచ నలుమూలలనుంచీ ఎంతో మంది పర్వతారోహకులని ఆకర్షించింది ఎవరెస్ట్. ఇప్పుడు పర్వతారోహణలో శిక్షణ పొందనివారు కూడా దీన్ని ఎక్కే ప్రయత్నంలో వున్నారు. దాంతో నేపాల్ ప్రభుత్వం కేవలం రిజిష్టర్ చేసుకున్న జట్లని మాత్రమే అధిరోహించడానికి అనుమతినిస్తోంది. ప్రస్తుతం ఈ అధిరోహణకు పెద్ద వెయిటింగ్ లిస్ట్ తయారయింది. 1999 వరకు 'నో వేకెన్సీ' బోర్డు పెట్టబడింది ఇప్పుడు.

ఇండియా కూడా ఇందులో ముందంజలోనే వుంది. మొట్టమొదటి అధిరోహణ 1960లో జరిగింది. గియాన్‌సింగ్ కమాండర్‌షిప్‌లో ఇది జరిగింది. కానీ అనుకూల వాతావరణం లేకపోవడంతో ఈ జట్టు కేవలం 28300 అడుగులు మాత్రం ఎక్కి తిరిగి వెనక్కివచ్చారు. తరువాతి అధిరోహణ 1962లో జరిగింది. ఇది కూడా విఫలమయింది. దాని తరువాత 1965లో ఈ అధిరోహణలో విజయం సాధించింది ఇండియా.

## వార్తలు చదవడం ఎలా?

రేడియోలోగానీ, దూరదర్శన్‌లోగానీ వార్తలను చదవడం ఆషామాషీ వ్యవహారం కాదు. అదో ఆకర్షణీయమైన ఉద్యోగం అని చెప్పవచ్చు. చదివేది కొద్దిసేపే అయినా ఏకకాలంలో ఎంతోమంది శ్రోతలను, ప్రేక్షకులను ఆకట్టుకోగలగాలి. ముఖ్యంగా ఉద్యోగానికి కనీస అర్హత డిగ్రీ. అటుపైన భాషపైన, వ్యాకరణంపైన అధికార పూర్వకమైన అవగాహన వుండాలి. చదవగానే శ్రోతలకు వెను వెంటనే విషయమర్థమయ్యేలా వుండాలి. పదాల విరుపులోను, వాక్యనిర్మాణంలోను క్రమబద్ధత అవసరం. వార్తలు అందగానే వార్తలను చదివే వారు ముందుగా వాటిని సంస్కరించి చక్కని శైలితో, సులువుగా అర్థమయ్యే పద్ధతిలో వాటిని తయారు చేసుకోవాలి. వార్తల్లో ఏవి ప్రముఖ పాత్ర వహిస్తాయన్నది పరిశీలించి, ప్రాముఖ్యతనుబట్టి క్రమబద్ధంగా వాటిని చదవాలి. అలా చేయకపోతే నిర్దేశించిన టైములో అనవసరమైన వార్తలను చదవడం, అవసరమైన ముఖ్య వార్తలను వదిలేయడం జరుగుతుంది.

ఇకపోతే వార్తల్లో అనేక రకాలుంటాయి. కొన్ని సంతోషాన్ని కలిగించేవి, కొన్ని విచారాన్ని కలిగించేవి. అయితే వేటికి తగిన మాడ్యులేషన్స్‌తో వాటిని చదవడం ఓ కళ. ఒక్కొక్కసారి సమయాభావం కూడా న్యూస్ రీడర్స్‌కి ఓ ఛాలెంజ్ లాంటిది. అలాంటప్పుడు వార్తలను త్వరగా చదవడంతోపాటు, శ్రోతలకు అర్థమయ్యేలా, విసుగు కలిగించకుండా వుండాలి.





దూరదర్శన్ వార్తలను చదివేవారు వస్త్రధారణ విషయంలో కూడా కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. మరీ అట్టహాసమైన, ఆకర్షణీయమైన వస్త్రాలు కాక సింపుల్‌గా, అందంగా వుంటూనే హుందాగా వుండేలా చూసుకోవాలి. ముఖ్యంగా సాంప్రదాయబద్ధంగా సంస్కృతిని ప్రతిబింబించేలా వుండాలి వస్త్రధారణ.

వాటికి సంబంధించిన చిత్రాలను కూడా చూపించడం జరుగుతుంది. అలాంటప్పుడు చిత్రం పూర్తయ్యేదాకా ఆగి మరో వార్తకు వెళ్ళాలి. అలా చెయ్యకపోతే చిత్రానికి, వార్తకి సంయమనం కుదరదు. చివరగా ముఖ్యాంశాలను జాగ్రత్తగా ఎన్నుకుని, వార్తలను ఆఖరున వినే వ్యక్తులను కూడా తృప్తిపరచేలా ప్లాన్ చేసుకోవాలి.




ఆవేశంగానీ, దుఃఖంగానీ, ఆనందంగానీ ఇలాంటి హావభావాలేవీ మొహంలో కనపడకుండా ప్రశాంతంగా వుండాలి. అటూ ఇటూ కదలడం, తలను, చేతులను తిప్పుకుండా కేవలం పెదాలను, కళ్ళనూ మాత్రం కదుల్చుతూ వార్తలను చదవాలి.

అప్పుడప్పుడు వార్తలను చదివేటప్పుడు గ్రాంధిక భాషను తగ్గించి, వ్యావహారిక భాషలోనే చక్కటి పదాల కూర్పుతో వాక్యాన్ని నిర్మించాలి. ఉచ్చారణలో స్పష్టత వుండి, తడబడకుండా చదవాలి. ఇలాంటి మెళకువలన్నీ పాటించినప్పుడు సదరు వ్యక్తి మంచి న్యూస్ రీడర్‌గా అందరి మన్ననలనూ పొందడం ఖాయం.

## చిత్రమైన ప్రయోగం

రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో ఖైదీలమీద ఓ విచిత్రమైన ప్రయోగం జరిగింది. దాని ముఖ్యోద్దేశం 'తక్కువ పరిమాణంలో తీసుకునే ఆహారం మానవ శరీరానికి నష్టాన్ని కలిగిస్తుందా? ఎంతవరకు?' అన్నది. ఈ ప్రయోగం 24 వారాలు కొనసాగింది. ఈ 24 వారాలూ ఖైదీలందరికీ రోజూ వారు తినే ఆహారంలో సగం మాత్రం ఇవ్వడం జరిగింది. అటుపైన ఫలితాలను సమీక్షిస్తే మొదట్లో వారి శరీరపు బరువు అతివేగంగా తగ్గడం ప్రారంభించింది. అలా తగ్గి తగ్గి ఒకచోట స్థిరపడింది.

ప్రయోగం పూర్తి అయిన తరవాత పరిశీలిస్తే వారి బేసల్ మెటబాలిజం 28.9 శాతం తగ్గింది. ఆహారం తక్కువే తీసుకున్నా శరీరంలోని అన్ని భాగాలు సక్రమంగానే పనిచేశాయి. శరీరంలో ఒక అంతర్గత యాంత్రికశక్తి వుంటుందని, అది ఆహారలోపాన్ని

పూరించి శరీరాన్ని యధాప్రకారంగానే వుంచుతుందనీ తేల్చారు పరిశోధకులు.

24 వారాల తరువాత వారికి పూర్తి ఆహారాన్నిచ్చి అటుపైన పరీక్షిస్తే వారి బేసల్ మెటబాలిజం శాతం కొద్దిగా మాత్రమే పెరిగింది.

అసలు బేసల్ మెటబాలిజం అంటే ఏమిటి? శరీరంలోని రసాయనిక చర్యలన్నిటినీ కలిపి మెటబాలిజం అంటాం. ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు, అరుగుదల వీటన్నిటివల్ల శరీరశక్తి సక్రమంగా వుంటుంది.




అందుకే నిద్రపోతున్నప్పుడూ ఈ శక్తి అలాగే వుంటుంది. ఇలా నిద్రపోతున్నప్పుడు శరీరాన్ని సక్రమంగా వుంచే శక్తినే రేట్ ఆఫ్ మెటబాలిజం అంటాం. నిద్రపోతున్నప్పుడు శరీరానికి చాలా తక్కువ శక్తి మాత్రమే అవసరమవుతుంది. అందుకే దీనిని బేసల్ మెటబాలిజం అంటారు.

మనం తినే ఆహారం ఎక్కువయినకొద్దీ బేసల్ మెటబాలిజం కూడా పెరుగుతుంది. 1500 కేలరీల ఆహారం సరిపోయేవ్యక్తి 500 కేలరీల ఆహారం ఎక్కువ తీసుకుంటే అది శరీరం బరువు పెరగడానికి దోహదం చేస్తుంది.

శారీరక వ్యాయామం మనలో మెటబాలిజం రేటును పెంచుతుంది. శరీరానికి ఆక్సిజన్ అవసరం పెరుగుతుంది. శరీరానికి అదనపు శక్తి కావాలంటే రెండే మార్గాలున్నాయి. 1. ఆకలి పెరగాలి. 2. శరీరంలో వున్న శక్తిని కరిగిపోకుండా చూసుకోవాలి. వ్యాయామం చేసి చేసి ఒక్కసారిగా మానేస్తే శరీరం పెరిగిపోయే ప్రమాదముంది. వ్యాయామం చేసేటప్పుడు ఆకలి ఎక్కువయి తినే ఆహార పరిమాణం కూడా పెరుగుతుంది. అది ఎలాంటి హానీ చేయదు. కానీ వ్యాయామం మానేసి, పెరిగిన సదరు పరిమాణంలో భుజిస్తే శరీరం బరువు తప్పనిసరిగా పెరుగుతుంది.

అయితే డైటింగ్, ఎక్సర్‌సైజు రెండూ ఒకేసారి చెయ్యకూడదు. డైటింగ్ అంటే తినే ఆహారాన్ని తగ్గించడం అనే అభిప్రాయం తప్పు. మన పొడవుకి, వయసుకి, బరువుకి సరిపోయే ఆహారాన్ని భుజించడం డైటింగ్. నిజానికి శరీర వ్యాయామం శరీరం బరువు తగ్గడానికి ఉద్దేశించినది కాదు. శారీరక, మానసిక శక్తుల్ని పటిష్టంగా వుంచుకునేందుకే వ్యాయామం. అది శరీరంలోని రోగనిరోధక శక్తిని కూడా పెంచుతుంది.

ప్రకటనలను చూసి లేదా స్వయం ప్రయోగాలతో డైటింగ్ పద్ధతులను ప్రారంభించకూడదు. అలా చేస్తే ప్రాణానికే ప్రమాదం రావచ్చు. అందుకే ఆ విషయంలో డాక్టర్ సలహా తీసుకోవడం అవసరం.

# 'పేదపిల్ల' పై సమీక్షలు

ఫిబ్రవరి 'చతుర'లో ప్రచురితమైన మొలకలపల్లి కోటేశ్వరరావు రచన 'పేదపిల్ల'పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## తప్పని కష్టాలు

*(ప్రథమ బహుమతి రు: 100/- పొందిన సమీక్ష)*

ఫిబ్రవరి నెల చతుర నవల 'పేదపిల్ల'లో వర్తమానకాలంలో ఆడపిల్ల పరిస్థితిని రచయిత చక్కగా చిత్రీకరించారు. ఈనాడు బీదా, గొప్పా తేడా లేకుండా అన్నివర్గాలలో ఆడపిల్ల పరిస్థితి దయనీయంగానే ఉందనేది నిజం. తన కడుపున పుట్టిన పిల్లలే అయినా ఆడపిల్ల అంటే చిన్నచూపు చూస్తూ మగపిల్లవాడు ఎక్కువ అని కొడుక్కి, కూతురికీ మధ్య తేడా చూపించే రాగమ్మలాంటి తల్లులూ కొడుకు తిట్టినా, కొట్టినా చివరిరోజులలో కొడుకువద్దే ఉండాలి తప్ప కూతురివద్ద ఉండటం నామోషీగా భావించే నాసరయ్యలాంటి తండ్రులూ కోకొల్లలు. ఆడపిల్ల అంటే 'ఆడ' పిల్ల అని భావించి కేవలం పెళ్ళిచేసి పంపిస్తే చాలు, ఆ తర్వాత ఆమె చచ్చినా, బతికినా తమకు సంబంధం లేదనుకునే తల్లితండ్రులున్నంతకాలం సుశీలలాంటి దురదృష్టవంతులు ఉంటూనే ఉంటారు. భర్తనుండి విడిపోయి వచ్చిన సుశీల తనను ఆదరించని కన్నవాళ్ళనుండి కూడా దూరంగా ఉండాలని తీసుకున్న నిర్ణయం హర్షణీయమే అయినా ఇది ఎంతవరకు ఆచరణ సాధ్యం? ఈ పరిష్కారం తాత్కాలిక పరిష్కారం మాత్రమే. ఎందుకంటే ఆమె వయసు కేవలం 20 సంవత్సరాలు. జీవితమంతా ముగ్గురు ఆడపిల్లలతో ఒంటరిగా బతకాలి. తప్పేమో ఆమె తల్లితండ్రులది, భర్తది. శిక్షేమో ఆమెకు. ఆమె పాత్ర మీద సానుభూతి కలగటంకోసం విపరీతమైన కష్టాలు కలిగించారు. మూడవసారి కూడా ఆడపిల్ల పుట్టటం, తల్లి రాగమ్మ పాత్రను చంపటం, ఆడపిల్ల పుట్టిందన్న అక్కసుతో మంచిగా ఉండే అత్త అంకమ్మ కూడా ఆమెతో పోట్లాడటం, వదిన గయ్యాళి అవటం అనవసరమనిపించాయి. మొదట సహజంగా ఉన్న నవల ఇలాంటి విపరీత కష్టాలవలన అసహజంగా తయారయ్యింది. శీర్షిక పేదపిల్ల అనేకంటే ఆడపిల్ల అంటే బావుండేది. ఎందుకంటే ఏ ఆడపిల్లకైనా తల్లితండ్రులలో మార్పు రానంతవరకు ఇలాంటి కష్టాలు తప్పవు. నేటి ఆడపిల్ల పరిస్థితిని చిత్రీకరించటంలో రచయిత కృతకృత్యులయ్యారు.

–సి. హెచ్. లక్ష్మీప్రసన్న
విజయవాడ-520010.

## సహజత్వం ఉట్టి పడిన నవల

*(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

'చతుర'లో ప్రచురితమైనా నా మనస్సుని ఆకర్షించిన నవలల్లో 'పేదపిల్ల' కూడా ఒకటి! అసలు నవల చదివినంతసేపు ఆ



పాత్రలు, అందులోని సహజత్వం ఉట్టిపడడంతో ఆ దృశ్యాలు కళ్ళముందు ప్రత్యక్షమయినట్టే ఉంది. నవల మా అమ్మా, అక్కయ్యల ముందు చదివి వినిపిస్తే కంటతడి పెట్టించింది. మనసున్న మనిషి ఎవరయినా సుశీల పాత్రకి జాలిపడాల్సిందే. ఇప్పటికీ పల్లెల్లో మూఢనమ్మకాలు విరివిగా కనుపిస్తూనే ఉన్నాయి. ఈ కంప్యూటర్ యుగంలో కూడా మారుమూల ప్రాంతాలలో జరిగే బాల్య వివాహాల్ని, ఆడవాళ్ళకన్నా మగవాళ్లే ఎక్కువన్న నమ్మకాన్ని, జనాభావల్ల ముందుముందు వచ్చే అనర్థాలని రచయిత చాలా బాగా వివరించారు. ఒక పేదపిల్లను ప్రధాన పాత్రగా తీసుకుని ఇరవయ్యేళ్ళదాకా ఆ పిల్ల జీవితంలోని ఒడిదుడుకులు, అవమానాలు, కష్టాలు, జీర్ణించుకోలేని అసమానతలను చాలా సహజంగా వివరించిన రచయిత అభినందనీయులు. ముఖ్యంగా కాలు విరిగే సంఘటన కళ్ళముందు ప్రత్యక్షమయినట్టే ఉంది. ఆ ఇరవయ్యేళ్ళ వయసులోనే ముగ్గురు ఆడపిల్లల తల్లిఅయి ఏ ఆసరా దొరకని ఆమె జీవితంలోని ముందు సంఘటనలను వర్ణించి వ్రాయడానికి మరెన్ని నవలలు కావాలో.

ముఖ్యంగా ఇలాగ పల్లెల్లో జీవించే మాలాంటివారికి ఈ నవలలోని ప్రతి పాత్రా చిరపరిచితమే, అయినప్పటికీ నవల మొత్తం చాలా ఆసక్తిగా చదివేలా రాశారు రచయిత. పల్లె ప్రజల్లోని ఆర్థిక ఇబ్బందులు వారి ప్రేమను, ఆప్యాయతలను ఏనాడో సమాధి చేశాయని రచయిత చెప్పకనే చెప్పారు. నవలలో సందర్భానుసారంగా మంచిమంచి వివరణలు కూడా జతచేయడంతో నవలకి పరిపూర్ణత లభించిందనడంలో అతిశయోక్తి లేదు.

–ఎం. చినవెంట్రావు,
మహాదేవపురం- 507203.

## అసహజ చిత్రణ!

*(మూడవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

ఈనవల మన సమాజంలో బలంగా పాతుకుపోయిన పురుషాధిక్యతను ఎత్తిచూపుతూ పాఠకులను చైతన్యపరచడంలో సఫలీకృతమైంది. వర్తమాన సాహిత్యంలో ప్రధాన భూమికను నిర్వహిస్తున్న ఫెమినిజమ్ ఆచరణలో మాత్రం శూన్యం అనడానికి 'పేదపిల్ల' నవల ఒక ఉదాహరణ.

చిన్న వయసులోనే ఎన్నో చేదు అనుభవాలను చవిచూసిన సుశీల పాత్రకు పాఠకుల సానుభూతి పుష్కలంగా లభించినప్పటికీ ఆదర్శవంతమైన పాత్ర మాత్రం కాదు. మొదట్నుండీ పురుషాధిక్యతను ప్రశ్నిస్తూ, పోరాడుతూ జీవితాన్ని కొనసాగించిన సుశీల వివాహం తరువాత అవధులు మీరిన సహనాన్ని, సర్దుబాటుధోరణినీ ప్రదర్శించినట్లుగా రచయిత చిత్రించడం అసహజంగా ఉందన్పించింది. ఎక్కడెక్కడి కష్టాలు, సమస్యలు ఎదుర్కొంటూ పోయి సుశీల నావరించినట్లుగా చూపడంవల్ల పాఠకులు వివాహం అంటే నరకమే అనే అభిప్రాయాన్ని ఏర్పరచుకునేందుకు మార్గం సుగమం చేసినట్లయింది. చిన్నప్పటినుండీ కొడుకు, కూతుళ్ళను తారతమ్య దృష్టితో చూసే తల్లిదండ్రుల లేకి ప్రవర్తనను ఎండగట్టిన తీరు బాగుంది. అలాగే బాల్యవివాహాలవల్ల వ్యక్తిగతంగా, సమాజపరంగా ఎన్ని అనర్థాలు సంభవిస్తున్నాయో స్పష్టం చేస్తూ పాఠకులను జాగృతపరచడం బాగన్పించింది.

ఈ నవలకు కథావస్తువుగా సీరియస్ అంశాన్ని తీసుకోవడంవల్ల, మధ్యమధ్యలో ఆహ్లాదకరమైన మజిలీలు, మలుపులు ఏవీ చేర్చకపోవడంవల్ల నవల మొత్తమంతా రొటీన్ జీవితాన్నే ప్రతిబింబించడంవల్ల





నవలా పఠనం కాస్త భారంగా అన్పించింది.

-ఎ. రాజిరెడ్డి,

గోదావరిఖని -505203.

## ఆ....డ పిల్ల

*(నాలుగవ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

'భారతదేశం పేద ప్రజలున్న సంపన్న దేశం' అనేందుకు 'పేదపిల్ల' నవల ఒక మచ్చుతునక. సహజత్వానికి దగ్గరగా, రెక్కాడితేకాని డొక్కాడని కుటుంబాలలో వున్న సమస్యలని ఇతివృత్తంగా తీసికొని కనులకు కట్టినట్లుగా రచయిత చిత్రీకరించారు. ఆ... డపిల్ల అనగానే ఎవరికో చెంద వలసిన ఆస్తి అనే తప్ప ప్రాణమున్న, మన సున్న మనిషిగా గుర్తించరు. పేద కుటుంబం కాబట్టి తిండి, బట్ట, వైద్యము దగ్గర కూడా వ్యత్యాసాన్ని చూపించారు. గుండెలమీద కుంపటిలా సుశీల బరువు దించుకున్నారేకాని ఆమె కష్టాల్లో ఆదుకోలేకపోయారు. రాగమ్మలోని మాతృత్వపు మమకారం అప్పుడప్పుడు బయటపడినా సంఘానికి భయపడింది. చిన్నప్పటినుంచి ఆడవాళ్ళ చేతిలో పెరిగి పెద్దయిన సింగయ్య పురుషాహంకారంతోనే దుర్వ్యసనాలకు లోనయ్యాడు. బాల్య వివాహాలు చేయకూడదనే చట్టముంది కాని రాగమ్మ, నాసరయ్య దంపతుల సమస్యలను పట్టించుకొనేదెవరు? వారికి రేడియో, టి. వి. వినే తీరికెక్కడిది? రోజు గడవడమే కష్టంగా వున్న వారు వాటిని కొనగలరా? తన బతుకు తను బతుకుతూ కూడా సుశీల అత్తింట్లో చీత్కారాలు పడవలసిన పనేమిటి? భర్త నిరాదరణకు గురైన స్త్రీని చులకనగా చూస్తారనేగా? పరిస్థితులే మనిషికి ధైర్యాన్ని, బలాన్ని యిస్తాయి అని సుశీల లోని తెగింపు తెలుపుతుంది.

నవల పట్టుకుంటె వదిలిపెట్టకుండా చదివింపచేసిన రచయితగారి శైలికి, చక్కని నవల అందించిన 'చతుర'కు నా ధన్యవాదములు.

-సి. హెచ్. సుబ్బరత్నము,

ఒంగోలు -523002.

## మరో 'కన్యాశుల్కం'

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

'కన్యాశుల్కం' నాటకం ఆనాటి సామాజిక రుగ్మతల్ని తూర్పారపడితే, 'పేదపిల్ల' నవల నేటి సామాజిక అసహజతల్ని బయటబెట్టి స్త్రీ ఔన్నత్యాన్ని చాటిచెప్పింది! గ్రామీణప్రాంతంలో పుట్టి, అంధవిశ్వాసాలలో పెరిగిన ఒక అమాయక పేదరాలి బాధామయ జీవితమే 'పేదపిల్ల'.

సూక్ష్మంగా చెప్పాలంటే బాల్య వివాహాల వల్ల కలిగే అనర్థాలను, పేదరికంవల్ల కలిగే నిస్సహాయతనూ, సమాజంలో మగపిల్లవాడికీ, ఆడపిల్లకూ మధ్య చూపబడే వివక్షతనూ, అత్తల ఆగడాలనూ, మొగుడి అహంకారాన్నీ బాధలను భరించే స్త్రీమూర్తి సహనాన్నీ, సంతానంకోసం ఆమె చూపే త్యాగాన్నీ, అన్యాయాన్ని ఎదిరించే స్థైర్యాన్నీ చక్కగా ప్రతిబింబించిన నవల 'పేదపిల్ల'. చివరగా చెప్పేదేమంటే నవలాంతంలో రచయిత ఇచ్చిన సందేశం సామాజిక ప్రయోజనంకలది. అత్తవారింట అనుభవించే బాధలనుంచి విముక్తి పొందడానికి స్త్రీ ధైర్యంగా అన్యాయాన్ని ఎదుర్కొనాలనీ, అవసరమైతే భర్తను కూడా త్యజించి స్వశక్తితో పిల్లలను సాకుతూ కాలం గడపాలనీ, భీరువులా ఆత్మహత్యకు పాల్పడకూడదనీ సందేశం అందించిందీ నవల.

-గుబ్బల సత్యనారాయణమూర్తి,

ముమ్మిడివరం- 533216.



చతుర

సంపుటి: 20 సంచిక: 3 ఏప్రిల్ 1997

అడవి మల్లెలా సహజమూ, స్వచ్ఛమూ అయిన కొండ పల్లె అది.

అమాయకత్వం నిండిన అద్దంలాంటి మనసులుగల ఆ అరణ్యావాసులు అడవితల్లి ఒడిలో ఆనందంగా బతుకుసాగిస్తున్న సమయంలో... హటాత్తుగా ప్రవేశించారు ప్రభుత్వాధికారులు.

అడవులను నరికి, ప్రాజెక్టులను కట్టి దేశసౌభాగ్యాన్ని పెంపొందించడానికి... అడవి ప్రజల బ్రతుకులనే నాశనం చేయడానికి నడుంకట్టారు.

మరోవైపునుంచి అడవులను వదిలి వెళ్ళొద్దంటూ హితబోధచేస్తూ అన్నలు ప్రవేశించారు.

అటు ప్రభుత్వానికీ, ఇటు నక్సలైట్లకీ మధ్య నలిగిన గిరిజనులు ఆ సమస్యను ఎలా పరిష్కరించుకున్నారు?

దేశంలోంచి దేశ సౌభాగ్యంలోంచి గిరిజనుల పాత్రను తొలగించే ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరి చివరికేరూపుదాల్చింది?

మనసులను కదిలించే మరపురాని సంఘటనల మాల ఇచ్ఛాపురపు రామచంద్రం రచన 'ఆ కొండల వెనుక' ఈ నెల చతుర సమగ్ర నవల.

# ఆ కొండల వెనుక

– ఇచ్ఛాపురపు రామచంద్రం

పాలవారి పిలుపులులేవు.

పని మనుషుల అరుపులులేవు.

పేపర్లవారి కేకలు, పరమ భక్తుల సంకీర్తనలు, గడియారాల అలారమ్‌లు, కార్ఖానాల సైరన్లు, ఆకాశవాణి మేలుకొలుపులు, ఆర్టీసీ బస్సుల హారన్లు, కాఫీ హోటళ్ల కలకలం, రిక్షా గంటల గలగలలు ఏవీ లేవు.

అలాంటిచోట మళ్లీ తెల్లవారింది!

అడవి... కొండమీద అడవి!

సాధారణంగా ఆలయాలు కొండమీదే ఉంటాయి... ఎత్తుగా... ఉన్నతంగా ప్రత్యేకంగా మనిషికంటే దేముడు ఉన్నతుడు సుమా అన్నట్లు!

కొండమీద అడవిలో సూర్యుడు ఆలస్యంగా ఉదయించి తొందరగా అస్తమిస్తాడు. అడవిలో పగటి గంటలూ తక్కువే, పని గంటలూ తక్కువే. నాగరికత నరికేస్తున్నా... అడవులను పలచన చేసేస్తున్నా, నామ మాత్రంగా అయినా అడవి యింకా మిగిలే ఉంది. అడవిలో మిట్ట మధ్యాహ్నం కూడా చిత్రమయిన లేతచీకటి. ఆ చీకటి చెట్లవలన కాబోలు ఆకుపచ్చగా అనిపిస్తుంది.

అడవి కానుకుని బల్లపరుపుగా ఉండే బండకొండమీద నాగరికత ఆట్టే సోకని అడవిపల్లె.

అడవి మల్లెలా సహజమూ స్వచ్ఛమూ అయిన కొండపల్లె. రాజుపాకల అనే పేరున్నా ఆ పరిసరాల పరిభాషలో మాత్రం గూడెం. కొండమీద వాలులో... ఎక్కడ కాస్త చదునయిన నేలుంటే అక్కడ నాలుగు గుడిసెలు లేచిపోతాయి. అవే జనవాసాలవుతాయి. ఆ కొండమీద అలాటి గూడేలుచాలానే ఉన్నాయి. అనువయిన నేల విస్తీర్ణంబట్టి ఒక్కోగూడెంలో ఏభై అరవై వరకూ కూడా గుడిసెలుంటాయి. అలాటివి పెద్ద గూడేలు, వాటికి పేర్లుంటాయి. టీకొట్టులాంటి చిన్నచిన్న సదుపాయాలుంటాయి. అలాంటి పెద్ద గూడెమే రాజుపాకల. ఏ గూడెమయినా అడవికి అంచునేకాని అడవిలో ఉండదు. అలాగే నీటి వనరుకి పక్కనేకాక కాస్త దూరంలో కూడా వెలుస్తుంది. గిరిజనులకు పర్యావరణ పరిరక్షణ, సహజీవనం వంటి పదాలు తెలియవు. కాని... అవి వారి జీవనవిధానంలో భాగాలై అంతర్వాహినిగా ప్రవహిస్తూంటాయి.

అడవిలో ఉండేది తామేకాదు... సోదరీ సోదరుల్లా మరెన్నో జీవాలుంటాయి. వాటికీ నీరు అవసరమే. తమ దప్పికలాటిదే వాటిదీను. నీటి వసరు నానుకుని తాముంటే ఆ మృగాలకంతరాయం. అవి క్రూర జంతువులయితే మనుషుల మీదకు దండెత్తుతాయి, దాహం తీర్చుకునేందుకు అడ్డంగా ఉన్నారన్న కోపంతో. అవి సాధు మృగాలయితే మనుషులకి భయపడి దప్పికతో ఆగిపోతాయి. అడవి మనుషుల దైనందిన జీవితం జంతువుల మీదకూడా ఆధారపడి ఉంటుందన్న సత్యం వారికి తెలుసు. అందుకే జంతువుల రాకపోకలకిబ్బంది కలిగించనంత దూరంగా తమ గూళ్లను నిర్మించుకుంటారు గిరిజనులు. నిజంగా అవి గూడులే. కొండమీద దొరికే వెదురు ఆకులో, రెల్లుగడ్డి లాంటిదో పైకప్పు, ఇరుకుగా ఉండే లోపలి ప్రదేశం, పాకకు నాలుగు వెదుళ్లో చెట్ల మానులో స్థంబాలు. అవి కొంచెం పెద్ద పక్షిగూళ్ల మాదిరే ఉంటాయి. పులులూ, సింహాలవంటి క్రూర మృగాల బెడద యిప్పుడు లేదు కనుక చెట్లమీదా మంచెలమీదా కాపరాల అవసరం లేకపోయింది. మంచెలయితే అచ్చంగా పక్షిగూళ్లే. నీటివనరులకి దూరంగా నిర్మించడం వలన ఆడవాళ్లకు నీటి మోత తప్పదు. క్రూరమృగాల బారిన పడకుండా ఉండా





లంటే కొన్ని బాధలూ జాగ్రత్తలూ అవసర మేమరి.

పెంకిపిల్ల ఆడుకున్నాక చెదరగొట్టేసిన ఆట బొమ్మల్లా, లక్కపిడతల్లా చెల్లాచెదురుగానూ అస్తవ్యస్తంగానూ ఉంటాయి గూడేలు. అనువయిన స్థలాలు అలాగే జత పడతాయి. కొండంటేనే ఎత్తుపల్లాలూ... లోయలూ... బండలూ. అడవన్నా అంతే. అడ్డదిడ్డంగా యథేచ్ఛగా పెరిగే చెట్లనక్కడ క్రమబద్ధం చేసేదెవరు? చేయగలవారెవరు?

రాజుపాకల చుట్టూ మరికొన్ని గూడేలున్నాయి. కూతవేటులో కొన్నీ, కొంతకొంత దూరంగా మరికొన్నీ. చుట్టుపక్కల వాటికన్నిటికీ యిదే ఒకవిధంగా కేంద్రం. ఇక్కడ బీడీలు, అగ్గిపెట్టెలు దొరుకుతాయి. రచ్చబండ ఉంది. రెండుమూడు వందల జనాభా ఉంది. వారికి మల్లుదొర అని నాయకుడున్నాడు. ఆ గూడేలలో అనేక తెగల గిరిజనులున్నారు. కొండవాళ్లు, కోయవాళ్లు, చెంచులు ఉన్నారు. విలుకాండ్రున్నారు, వేటగాళ్లున్నారు. నాగవంశం వాళ్లు, మంత్రగాళ్లు, వైద్యులు ఉన్నారు. అక్షరం తెలిసినవాళ్లు మాత్రం ఇద్దరున్నారు. అందు చేత తెగ తారతమ్యాలు చూడకుండా మిగిలిన గూడేల వాళ్లకూడా మల్లుదొరని నాయకుడిగా అంగీకరించారు. సమిష్టి విషయాలలో నాయకుడి సలహాలే ఆచరణీయాలు. మిగిలిన ఆచార సంప్రదాయాలలో ఎవరి పద్ధతులూ ఇష్టాలూ వారివే. పరస్పరావగాహన కలిగి ఉండడంవలన దశాబ్దాలుగా ఆ ఆనవాయితీ నిరాటంకంగా కొనసాగుతూ వస్తుంది. రాజుపాకలలో కొంత ధనికుడు గంటందొరే. అతనికి మిద్దె ఇల్లుంది.

ఆ రాత్రి ఎక్కడలేని చలీ ముంచుకొచ్చేసింది. వేసవి మినహా మిగిలిన రెండు కాలాలూ కొండమీద తీవ్రంగానే ఉంటాయి. వర్షాలూ ఎక్కువే, చలీ ఎక్కువే. ఎముకలు కొరికే చలి. వర్షంలా మంచు. గుడిసెలు పిచ్చుకగూళ్లలా ఇరుకు. వాటిలో ఒకరిద్దరికేనా కాలు ముడిచిపెట్టుకు పడుకుందుకూ మూడంకె వేసుకుని సర్దుకుందుకయినా చోటుండదు. గుడిసెముందర పందిరలాంటిది వేసుకుంటారు. దానిలోనే అందరి పడకలూ. వాళ్ల పేదరికం అటువంటిది. ఆ రాత్రి ఆ పందిరిలు చలినీ మంచునీ ఏమాత్రమూ నిరోధించలేకపోతున్నాయి. ఒకటే చలి... వెర్రెత్తించేటట్లు. వయసుమీరిన వారికి పళ్లు గిట్టకరుచుకుపోతున్నాయి. శీతల వాయువులకి రోమాలు నిక్కబొడుచుకుంటున్నాయి. పిన్నాపెద్దా యావన్మందీ చలికి వజవజ వొణికిపోతున్నారు. గుడిసెలో ఉన్న కల్లునంతా తెచ్చుకుని తాగినా వొణుకు తగ్గకపోవడంతో కాళీ అయిన కల్లు చట్టీలనూ కుండనీ చూస్తూ "సలికి సారాయే సరైన సమాదానం. కల్లు నాబంనేదు" అని విసుక్కున్నారు. గుడిసెముందు చలిమంట వేసుకుని వాటి చుట్టూ కూర్చున్నారు ప్రతి కుటుంబమూ. అందినమేరకు దుప్పటియో, కంబళో, చర్మమో కప్పేసుకుంటున్నారు. అయినా ఒంట్లోని వణుకు తగ్గడంలేదు. పులిలాంటి, ఆకలిలాంటి చలి వాళ్లని చికాకు పెట్టేస్తుంది. గుండెల్లోంచి వణికించేస్తూ ప్రాణాలు కడంటి పోతాయేమో అని భయ పెట్టేస్తుంది. చలినయినా ఆకలినయినా మరిపించి కాలం దొర్లించడానికి ఆటా, పాటా, మాటా మందని వారికి తెలుసు. కాని పులిలాంటి చలి నోరు తెరవనిస్తేనా? కాలూ చేయీ సాగనిస్తేనా? ఏం చలో పాడు. మాటకీ పాటకీ నోరు తెరవనివ్వదు. ఆటకి కాలు కదపనివ్వదు. మనుషుల్ని ముద్దచేసి వదిలేస్తోంది. శరీరాలు దగ్గరయితే చలికాస్త దూరమౌతుందని కుటుంబంలోని వారు ఒకరికొకరు అతి దగ్గరగా చేరి మనుషులముద్దలా ఏకమౌతు

న్నారు. చలిని తిట్టుకుంటున్నారు. కునికి పాట్లు పడదామని ప్రయత్నిస్తున్నారు.

మనుషులే కాదు మేము కూడా చలికి తట్టుకోలేకపోతున్నామని సూచిస్తున్నట్లు అడవిలోంచి ఉండీ ఉండీ నక్కల ఊళలు... దుమ్మలగొండ్ల ఏడుపులు... ఎలుగుబంట్ల కేకలు.. పక్షుల ఆర్తనాదాలు ఎవరికేనా కంటిమీద రెప్పవాలి నిద్రరాబోతే అది కాస్తా ఈ శబ్దాలతో చెదిరిపోతోంది. గిరిజనుల గుండెలలోంచి వణుకొస్తోంది చలికి. ఉండుండి నెమ్మదించిపోయే నెగడుని ఎగసనదోస్తూ ఆ చలి రాత్రి వారు శివరాత్రిలా జాగారమే చేస్తున్నారు. ఆ యింటి ముందు మండుతున్న నెగడు ముందు కూర్చున్న యింటిపెద్ద హఠాత్తుగా అన్నాడు,

"ఈ సలికి నాకు గుండు గుభేలు మంటూందర్రా బిడ్డలూ"

అతను వృద్ధుడు. అతనికిద్దరు భార్యలు. ఇద్దరు భార్యలకీ ఇద్దరేసి కొడుకులూ, యిద్దరేసి కూతుళ్లూ. కూతుళ్లు కాపరాలకిపోగా కొడుకులు, కోడళ్లు, మనవలు, మనవరాళ్లతో ఆ ఒక మోస్తరు గుడిసెలో జీవితం సాగిస్తున్నాడు. పేద వాడే అయినా గూడెంలో అతని గౌరవానికి లోటులేదు. అల్లూరి సీతారామరాజుని చూశానంటాడు. అతనితో తిరిగానంటాడు. అవకాశం దొరికితే అలనాటి విషయాలు కథలుగా చెబుతాడు. వెనుకటి తరం మనిషేమో ఈ వయసులోనూ వడలిపోకా వాడిపోకా దృఢంగా ఉంటాడు. ఇద్దరు భార్యలనీ అటూ యిటూ చేసుకుని వాళ్ల భుజాల మీద చేతులువేసి వెచ్చగా కూర్చున్న అతను ఏదో కథ చెప్పబోతున్నాడని కొడుకులకీ కోడళ్లకీ మనవలకీ అర్థమైపోయింది. అతను చెప్పగలిగిన కథలూ వీరు వినవలసిన విశేషాలూ ఏనాడో అయిపోయాయి. అతనేం చెప్పినా వీరేం విన్నా పాతదే! కాని కథలాంటి సంఘటనలు ఎన్నిసార్లు చెప్పినా, వినినా తనివితీరవు. ముఖ్యంగా చలి నిద్రపోనివ్వని ఇలాటి రాత్రి కథలు చక్కని కాలక్షేపాలు. ఆ వృద్ధుడి పేరు పడాలు. అతను చుట్ట అంటించాడు. నెగడులోంచి నిప్పు కణికె తీసి యిల్లాలు అందించగా చలికాగుతూ పెద్దాయన వంక చూశారంతా.

అల్లూరి సీతారామరాజు తలపులోకి రావడమే తరువాయి, ఆ ఎనభై దాటిన వృద్ధుడిలోకి ఎంతో ఉత్సాహమూ జవసత్వాలూ వచ్చేశాయి. వృద్ధులు గతం తలుచుకుని యువకులౌతారన్న సత్యాన్ని నిరూపిస్తూ ఒక్కసారతను కుర్రవాడే అయిపోయాడు. చుట్ట దమ్ము గట్టిగాలాగి పట్టుకోమన్నట్లు రెండో భార్యకందించేసి ఒక్కసారి పొగవదలి, గొంతు సవరించుకుని మొదలుపెట్టాడు. భక్తిగా హరికథ చెప్పే దాసులా శ్రద్ధనిండిన స్వరంతో "మన్యందొర అల్లూరి మామూలు మనిషికాదు మహానుభావుడే. మన గిరిజనుల పాలిటి గోవర్ధనుడే. అప్పుడు... ఆ కాలంలో తెల్లదొరలు మనని మహాపీడించేవారు. వాళ్లొట్టి టక్కరులు. వ్యాపారం చేసుకుంటాం రానివ్వండని బతిమాలి మన నేలకొచ్చి మనలో మనకి తగువులూ కయ్యాలూ పెట్టేసి మన దేశంమీదా, జనంమీదా అధికారం హస్తగతం చేసేసుకుని మనని నానా విధాల్గా దోచుకునేవారు. మనకి సేవచేస్తామనొచ్చి మనని సేవకులు చేసేసుకున్నారు. అలా వందలేళ్లయ్యాక మనవాళ్లు కళ్లు తెరిచారు. మనమేమిటి, పరాయివాడికి ఊడిగం చెయ్యడమేమిటని... ఇంగ్లీషు వాళ్లమీద ఎదురు తిరగడం మొదలుపెట్టారు. అలా మొదలయింది మన స్వతంత్రపోరాటం.

స్వతంత్రమంటే అందరికీ మెదిలేది మహాత్మాగాంధీగారు. కాని ఆయనది సత్యాగ్రహమూ అహింసాలాంటి చప్పిడి





పోరాటం. మనకోసం మన మన్య ప్రజల కోసం ఉన్న వూరినీ కన్నవారినీ ఒదులుకుని ఒచ్చేశాడు రామరాజు. పొడుగరికాడు.. బలిష్టుడుకాడు. అయితేనేం ఆయన గుండె ఉక్కుగుండె. రక్తానికి రక్తం... ప్రాణానికి ప్రాణం. బాణానికి బాణం అనేవాడు. మన్య ప్రజలను పరాయి ప్రభుత్వానికి కప్పాలు కట్టవద్దన్నాడు. నలుగురినీ కూడదీశాడు. కలసికట్టుగా చేశాడు. పితూరీలు లేవదీశాడు. కప్పమడిగిన దొరలను ఖాతరు చెయ్యం పొమ్మన్నాడు. వారిపై యుద్ధానికి సిద్ధమయ్యాడు. రామరాజుది మృగరాజు తత్వం. చాటుమాటు వ్యవహారాలంటే కిట్టవు. గంటం దొర.. మల్లుదొర.. వంటి గిరిజన యువకులను పోగుచేసుకుని నాలుగు విషయాలూ చెప్పి ఆంగ్లేయులతో పోరాటాలకి సన్నద్ధులని చేశాడు. ముందుగా వర్తమానం పంపి మరీ నర్సీపట్నం పోలీస్ స్టేషన్‌నీ (కృష్ణాదేవిపేట) రాజువొమ్మంగిలోని ప్రభుత్వ కార్యాలయాలనీ ముట్టడించేవాడు. చెప్పి చేసి చేవజూపే రకమన్నమాట. ఆంగ్లేయాధికారులని గడగడలాడించాడు. ఇంగ్లీషు దొరను తుస్సుమనిపించాడు. మన్యం పోరాటాలనెదుర్కుందుకనే నర్సీపట్నంలో అంత పెద్ద తాలూకాఫీసుని రాతితో నిర్మించారు. అప్పటికి చింతపల్లికి కూడా రోడ్డులేదు. అంతా అడివే. నర్సీపట్నం దాటినప్పటినుంచీ కొండలు.. అడవి. ఈ ప్రాంతాన్ని ఏజన్సీ అనేవారు, మనం మన్యం అనేటట్లు. సీత అనే అమ్మాయిని చేరదీసి సీతారామరాజయిన మన మన్యం నాయకుడెంతసేపూ చింతపల్లి, లంబసింగి, కృష్ణదేవిపేట, రాజువొమ్మంగి... ఇలాగ అడవులలోనే సంచరించేవాడు మన్యందొరలను కూడగట్టుకుంటూ. రోడ్లులేని ఈ ప్రాంతాలకు ఏనుగులమీదా గుర్రాలమీదా వచ్చేవారు బ్రిటిష్ అధికారులు. అందుకని నర్సీపట్నం పోలీస్‌స్టేషన్ రెండు ఏనుగులనీ, నాలుగు గుర్రాలనీ పెంచేది. పాతికేళ్లకిందటి వరకూ నర్సీపట్నం పోలీస్ స్టేషనుకీ ప్రభుత్వ ఆసుపత్రికీ మధ్య ఏనుగుల శాలా, ఒక ముసలి ఏనుగూ ఉండేవి. సీతారామరాజు మాటల మనిషికాదు. ఉపన్యాసాలూ అవీ ఇచ్చేవాడు కాదు. కార్యశూరుడంతే. అతనికెన్నో విద్యలొచ్చేవి. మన్యంలో పితూరీలు లేవదీయడమంటే సులభంకాదు. చెల్లాచెదురుగా ఉండే ప్రాంతాలకు కబురందాలంటే మనిషి స్వయంగా వెళ్లవలసిందే. అయితే రామరాజు మాత్రం ఒకే సమయంలో రెండు మూడు చోట్ల కనిపించి మాట్లాడగలిగేవాడు. కొండలలో అడ్డదారులన్నీ అతనికి కొట్టినపిండి. సాయంత్రం చింతపల్లిలో ఉంటే తెల్లారేసరికి ధారకొండలో ఉండేవాడు. సీతారామరాజుకి స్నేహితుడూ గురువూ పాకలపాడు గురువు. నర్సీపట్నం నుంచి చింతపల్లి వచ్చేదారిలో ఉందీ చిన్న గ్రామం. అక్కడ ఒక ఆశ్రమం. దానిలో ఆ గురువు ఎలా ఉండేవారని? గెడ్డాలూ కాషాయవస్త్రాలస్వామిలాకాదు. గ్లాస్కోలాల్చీ పట్టుపంచె, తుమ్మెద రెక్కలంతటి నల్లని జుత్తు. అత్యంత మనోహర రూపమాయనది. విలాసపురుషుడు. దక్షిణ నాయకుడనిపిస్తాడు. కానీ ఆయన మహిమకలవాడూ కారణజన్ముడూ. రామరాజుకి గురువుగా ఉండడంకోసం ఉద్భవించాడాయన. ఆ చిన్న ప్రశాంత ఆశ్రమాన్ని చూసేందుకనీ, వైద్యంకోసమనీ, తత్వచింతనకోసమనీ దేనికి ఎవరెటువంటివేళ ఎందరొచ్చినా సమయమయ్యేసరికి పంక్తిన కూర్చుని విందారగించవలసిందే. అక్కడ పాడి ఉండదు పాలుంటాయి. పాదులుండవు కూరలుంటాయి. వర్షాకాలంలో అయినా అడగాలేకాని మామిడిపళ్లు వచ్చాయే! ఎటువంటి వేళ అతిథులొచ్చినా వేడివేడి భోజనమే. అదీ షడ్రసోపేతంగా. ఆయనే రామరాజుకి కామరూపవిద్యల వంటివి బోధించారనేవారు.

ఇప్పుడంటే కళ్లల్లో కలికమేసుకు వెదకినా పులి అనేది కనిపించదుకాని అప్పుడు ఇలాగా? ఒత్తు జుత్తులా చిక్కని అడవి. నిండా పులులే. సింహాలెప్పుడూ లేవీ అడవులలో. కానీ చిరుత నుంచి పెద్ద మెకం వరకూ ఎన్నెన్నో పులులు. పట్టపగలే ఎదురుపడిపోయేవి. అలాంటిది రామరాజు సంచారమంతా రాత్రివేళలే. బ్రిటిష వేగులను తప్పించుకుంటూ తన కార్యక్రమాలను నిర్వర్తించేవాడు. ఆయన సూటిగా ఏ పులి కళ్లల్లోకయినా ఒక్కసారి చూశాడో ఎంతటి పెద్దపులయినా తోకముడిచి వెనుదిరిగిపోవలసిందే. ఆయన వేపే వచ్చేవికావుట పులులు కాని మరేవికాని. అప్పుడప్పుడూ నాకాపనీ యీపనీ చెప్పేవారు. అదీ నా అదృష్టం. ఒకసారాయన ఎవరికో ఏదో వర్తమానమందించమంటే వెళ్తూ, వెళ్తూ పరాకుగా నడుస్తున్నాను. కర్ణుడు కవచకుండలాలనయినా మరుస్తాడేమోకాని కొండదొర విల్లంబులు వదలడు. నా భుజాన విల్లుంది కానీ హటాత్తుగా పులి గర్జించేసరికి పరాకులో ఉన్న నేను తత్తరపడ్డాను. విల్లు భుజం జారిపోయింది. పులి నామీదకురికింది. విల్లు అందుకుందుకు ఒంగోడానికయినా వ్యవధిలేదు. సాధారణంగా పులి అలాగ ఉరకదు. నేనింకేమీ ఆలోచించలేదు. చేతులతోనూ కాళ్లతోనే పులినెదుర్కున్నాను. పులితో మల్లయుద్ధమే చేశాను. అది నా భుజంమీద పంజాతో కొట్టింది. అంతమేర కండ బయట పడినా పట్టించుకోకుండా ప్రాణాలకు తెగించి దానిని పిడికిళ్లతో, మోచేతులతో కొట్టసాగాను. నా దెబ్బలు దానికెక్కడ తగిలాయోకాని అది హటాత్తుగా పారిపోయింది నన్నొదిలి. రామరాజుగారు నాకప్పగించిన పని పూర్తి చేసి వారివద్దకు వెళ్లాను.

"ఏమిటా కట్టు?" అడిగారు రామరాజుగారితోనే ఉన్న పాకలపాడు గురువుగారు. జరిగింది చెప్పాను. చేతికందిన ఆకు అలమలతో కట్టు కట్టాననీ చెప్పాను. గురువుగారి అసలు పేరు నాకే కాదు చాలామందికి తెలియదు. ఆయన నా కట్టువిప్పేసి ఏదో మందువేశారు. తెల్లవారేసరికి నొప్పీ, బాధా మాయం. మూడ్రోజుల్లో గాయం మానిపోయింది. మచ్చమాత్రం మిగిలిపోయింది. అదే ఇది" అంటూ కుడి భుజం మీది మచ్చచూపించి "సీతారామరాజుగారు ఆంగ్లేయులకు దొరికిపోయే నాటి ముందు రాత్రి కూడా యిలాగే కనీవినీ ఎరుగని చలి వేసింది. ఇంత చలి.. అకాలపు చలి.. అరిష్ట సూచకం" అని ముగించాడాయన.

ఎన్నోసార్లు చెప్పిన కథనే మళ్లీ చెప్పినా వాళ్లకి విసుగు రాలేదుకానీ ఆ చివరి మాటకు విసుగుతోపాటు కొంచెం భయమూ వేసింది కొడుకులిద్దరికీ. నడివయస్కులయిన వారికి కొంచెం తార్కిక జ్ఞానమూ ఉంది. సంప్రదాయం మీద విశ్వాసమూ ఉంది. చలికీ రాబోయే అరిష్టానికీ సంబంధమేమిటని ఒక్కసారి వారికనుమానం కలిగింది. అంతలోనే పెద్దవాడు ఊరికే చెప్పడుకదా అనీ అనిపించింది. రేపటి చెడుగురించి ఇవాళే ముందుగా చెప్పి మనసు పాడుచేయడమెందుకూ అని వాళ్ల విసుగు. ముసలి ఛాదస్తం అనుకున్నారు మనసులోనే. గిరిజనులకు పెద్దల యెడల విధేయత ఎక్కువ.

నిద్ర సుఖమేకాదు, చలీ ఎరుగదేమో. అర్ధరాత్రి దాటాక వారా చలిమంట చుట్టూనే వాలిపోయారు. ముసలాయనకు మాత్రం ఓ పట్టాన నిద్రరావడంలేదు. 'చలి ఒంటికేకాదు. లోపలాను. చలిని తాళాలంటే ఒంటికి పైన కప్పు ఎంత అవసరమో ఒంటిలోపల అంత శక్తీ ఉండాలి. ఒంట్లో కొవ్వుంటే ఒంటిమీదచలి ప్రభావం తక్కువగా ఉంటుంది. చలితో యుద్ధంచేసి గెలవాలంటే ఒంట్లో సత్తువుండాలి. అంటే బొజ్జ

# ఏరిన ముత్యాలు

☆ కీర్తి ఆవిరివంటిది. జనప్రీతి ఒక దుర్ఘటన. సంపదలకు రెక్కలు వస్తాయి. కలకాలం నిలిచిపోయేది సత్ప్రవర్తన.

-అబ్రహాం లింకన్

☆ మంచం పట్టిన రోగిలాగానే సుఖంగా ఉంటామనే నమ్మకంతో రాజకీయాలలో ప్రజలు ఒకపక్కనుండి మరొక పక్కకు మారుతుంటారు.

-గెథే

☆ వివేకాన్ని వెతుకుతున్నంతవరకు మనిషి తెలివిగానే వుంటాడు. అది దొరికిందని అనుకోగానే అతడు మూర్ఖుడవుతాడు.

-టాల్‌ముడ్

☆ అతిశయోక్తికి అసత్యంతో రక్తసంబంధం వుంది. రెండూ నిందింపదగినవే.

-హెచ్.బెల్లన్

☆ భాగ్యవంతులకంటే పేదవారే మిక్కిలి శ్రేష్ఠమైన రొట్టెను భుజిస్తారు. కారణం ఆకలి దానికి తీపిదనం ఇస్తుంది.

-ఋగ్వేదం

☆ అంతా నా మేలుకే అనే భావనే సుఖానికి సోపానం.

-వ్యాసుడు

☆ వాతావరణం పొడిగా వున్నప్పుడు మీకు గొడుగు అప్పుగా ఇచ్చి కురుస్తున్న సమయంలో దాన్ని తీసుకొని వెళ్లేవాడే వడ్డీ వ్యాపారి.

-జాన్‌సెల్డెన్

☆ సజ్జనులు అవకాశం దొరికిన వెంటనే సేవాపరాయణులవుతారు. కానీ పనికిమాలిన వ్యక్తులు చెరకులాగా పిండబడినప్పుడే సేవ చేస్తారు.

-తిరువళ్లువర్

☆ ఆపదలో ఆదుకున్నవాడే ఆత్మబంధువు.

-కారెల్

☆ సూర్యుడు మీ నెత్తిపై వున్నప్పుడు నీడ వుండదు. అదేవిధంగా మీరు దృఢచిత్తులుగా వున్నప్పుడు సందేహం అనే నీడ వుండదు.

☆ పని ఎవరినీ ఎప్పుడూ చంపదు. కానీ పనిచేస్తున్నట్లు నటించేవాణ్ణి అది తప్పక చంపుతుంది.

-బర్టన్

☆ ప్రతి విషయంలోనూ, సన్నాహంపైనే విజయం ఆధారపడివుంటుంది. సన్నాహం లేని పక్షంలో అపజయం తప్పదు.

-వెన్‌డెన్ ఫిలిప్స్

సేకరణ: పట్నం శేషంశెట్టి




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

ఏప్రిల్ చతుర నవల ఆ కొండల వెనుక

..............................

**సమీక్షకుని పేరు :** ..............................

**చిరునామా :** ..............................

..............................

..............................

..............................

నిండా బువ్వుండాలి. పొట్ట ఎండకుండా ఎప్పటికప్పుడు నిండుతూండాలి. అలా అయితేనే శీతాకాలాన్ని తరించగలరు. మిగిలిన కాలాల్లోలా కాక చలికాలంలో ఎక్కువ తిండి ఉండాలి రక్తంలో వేడి పుట్టించేందుకు. ఎక్కడినుంచొస్తుందంత తిండి? ఎవరు పెడతారు?" భయంభయంగా అన్నాడు.

"ఇంకెవరు అడివమ్మే. మోదకొండమ్మ తల్లే" అన్నాడు అర్జున... ముసిలతని పెద్ద కొడుకు. అతనికీ యింకా పూర్తిగా నిద్రపట్టెయ్యలేదు.

"అమ్మ మాత్రం ఎంతకని తెచ్చిపెడతది?" చుట్ట అంటించాడు, లేచి కూర్చుని. అర్జున కూడా లేచి కూర్చుని మంటనెగసన దోసి నాలుగు పుల్లలు వేశాడు అగ్ని చల్లారిపోబోతూంటే. తండ్రి కొడుక్కి చుట్ట అందించాడు.

"నువ్వూ రెండు దమ్ములు లాగు. వెచ్చగుంటది"

వాళ్లలో కొన్నిటికి ఎంగిలి అనేది ఉండదు. అలాటివాటిలో కల్లు, చుట్టలు ముఖ్యమైనవి. ఇంటిల్లిపాదీ.. ఆడామగా, పిల్లాపాపా ఒకే కుండనెత్తి కల్లుతాగుతారు. ఒకే చుట్టుకాల్చుకుంటారు. ముసిలాయన పేరు మహారాజు. అతను చుట్టచుట్టడంలో బహునేర్పరి. ఎనిమిదంగుళాల చుట్ట కూడా ఏమాత్రం వంకరలేకుండా చుట్టగలడు. అది వాలిపోదు. విరగదు. చిగురు వెడల్పుగా మొదలు సన్నంగా ఉండడమేకాక అంటిందో మరి ఆరదు కావాలని ఆర్పితే తప్ప. ధారాళంగా పొగనిస్తుంది.

గంటందొరంతటివాడే మహారాజు తారసపడితే పొగాకు పాయయిచ్చి చుట్ట చుట్టించుకుంటాడు. ఒక పొగాకు కట్ట బహుమతిగా అందించి "కుర్రకారుకి చుట్ట రుచి తెలియక బీడీలకెగబడతారు కాని చుట్టకీ బీడీకి సాటా? కొత్త వింతా పాతరోతా. జీలుక్కల్లు నిషా సారాకి రాదు. పొగాకు చుట్ట రుచి బీడీకిరాదు. ఏమంటావ్?" అంటాడు తన అగ్గిపుల్లతోనే మహారాజు చుట్టకూడా అంటిస్తూ. వాళ్లవి వయసులేకాదు, మనసులూ మనస్తత్వాలూ కూడా దగ్గరివే. ఒకే తరం వారయిన వారి రుచులూ అభిరుచులూ కూడా సామీప్యాలే. జన్మదినాలూ వయసులూ తెలియనివాళ్లు. నాగరికులులా లెక్కలు కట్టుకుంటూనే అంకెలను చూసుకునే ముసిలివాళ్లమైపోయామని దిగులు పడిపోరు. శరీరంలో శక్తేతప్ప, ఒంట్లో జవసత్వాలే తప్ప ఏళ్లు వారికి వృద్ధాప్య చిహ్నాలు కావు. వయసు లెక్కలెరుగని వారు. కాలాన్ని యధాతథంగా తీసుకుంటారు తప్ప జరిగిపోయిన జన్మదినాలనూ, రాబోయే యీడునీ తలుచుకుంటూ అనవసరంగా ముసలి వాళ్లు అయిపోరు. పేరుకి నాయకుడయినా డబ్బుకి కొద్దిగా పైమెట్టు మీదున్నా గంటందొర అవేవీ పట్టించుకోరు. మహారాజుని ఆత్మీయుడిగానూ అన్నదమ్ముడిగానూ భావించుకుంటాడు. అవసరమనిపిస్తే సలహాలు తీసుకుంటాడు. మనసు విప్పి మాటామంతీ ఆడతాడు. ఒక్కముక్కలో వాళ్లిద్దరూ నేస్తాలు. "చుట్టరికం అనేది చుట్టమీదే వచ్చింది. వియ్యరికం ఏర్పరచుకునేటప్పుడు సంబంధం ఖాయం చేసుకుంటున్నందుకు నిదర్శనంగానూ, సాక్ష్యంగానూ పట్నవాసంవాళ్లు తాంబూలాలు ఇచ్చిపుచ్చుకుంటారే అలాగ వాళ్లు ఆడపిల్ల తండ్రీ మొగపిల్లాడి తండ్రీ చుట్టలిచ్చి పుచ్చుకునేవారు. ఇద్దరూ ఒకే చుట్టు కాల్చేవారు. అంటే సంబంధం ఖాయమయిందన్నమాట" అంటూ చుట్టరికం కథనీ గొప్పతనాన్నీ చెబుతారు పొగచుట్టప్రియులు. తరాల అంతరాలన్న పదం వారికి తెలియదుకానీ తమ తరానికీ కొడుకుల తరానికీ వచ్చిన మార్పులపట్ల అప్పుడప్పుడు చికాకు పడుతుంటారు.

కొండలమీదా అడవులలోనూ పొగాకు పండదు. నాగరికుల సిగరెట్టయ్యే పొగాకుకి చాలా నాజూకు కావాలి. అంచేత గిరిజనులు పొగాకు కొనుక్కోవలసిందే తప్ప తమ అడవి భూమిలో పండించుకోలేరు. కొనుక్కోవాలంటే డబ్బుండాలి. డబ్బనేదెప్పుడూ సమస్యే. అయితే... అడవులలో తునికాకు దొరుకుతుంది. దీనితోనే బీడీలు తయారుచేస్తారు. మహారాజు తునికాకు ఏరి బీడీలు చుట్టి అమ్ముతూంటాడు. అతనికి కాలక్షేపమూ కాస్త ఆదాయ మార్గమూ కూడా గిరిజనుల జీవన విధానంలోని అతి ముఖ్యలక్షణమూ అతి మంచి లక్షణమూ ఏమిటంటే- ఏ వయసువారయినా వారు చేయగలిగే పని చేస్తూనే ఉంటారు తప్ప ఊరికే కూర్చోరు. వారికి కాలక్షేపం కాకపోడమనే ప్రశ్నకాని... అనారోగ్యపు సమస్యలు కాని తక్కువ. తండ్రి అందించిన చుట్టని రెండు దమ్ములు లాగాడు అర్జున. పొగ కమ్మగా గుండెల్లోకి వెళ్ళి... గొంతూ గుండే ఒక్కసారి వెచ్చనయ్యాయి. హాయిగా అనిపిస్తూందిప్పుడు.

ఆ తండ్రీ కొడుకులమధ్య ఒక చిత్రమయిన అనుబంధముంది. తండ్రి కంఠం కొడుక్కి తమాషాగా, తీయగా వినిపిస్తుంది. ఆ గొంతు వినడం అర్జునకిష్టం. తన మాటలను మౌనంగానూ శ్రద్ధగానూ వినే కొడుకంటే మహారాజుకి ముచ్చట. వాళ్ళిద్దరే ఉంటే ముసలతని గొంతు గవ్వలగుత్తే అయిపోతుంది. మాటలు ఏటి చెలమలో తేట నీరులా ఎడతెగక ఊరుతూంటాయి.

కూర్చుని తింటే కొండలేనా తరిగిపోతాయంటారు. నిజవే మరి.

తండ్రి ఏదో పెద్ద విషయమే చెప్పబోతున్నారని అర్జున కర్థమైపోయింది. తండ్రి భాషాచిత్రమే. కొన్ని విషయాలకు ఒక రకం భాష... మరికొన్నింటికి ఒక రకం యాస. అతనికి భాషా వొచ్చును, యాసా వొచ్చును. అందుకే అతను మాట్లాడుతూంటే వినడానికి విసుగెయ్యదు.

"దేముడు మనుషులని పుట్టిస్తూ ఏం చెప్పాడో తెలుసా?" అంటూ మొదలుపెట్టి ఎన్నెన్నో విషయాలు చెప్పడం మొదలుపెట్టాడు మహారాజు. అయితే ఆ కంఠం అమ్మ కంఠమై... ఆ మాటలు జోలపాటలై... అర్జున కొద్దిసేపటిలోనే నిద్రలోకి జారిపోయాడు.

అంతవరకూ ఓడించగలిగినా... యిప్పుడు మాత్రం-

చలి- వారి నిద్రను భంగ పరచలేకపోయింది. వారు గాఢనిద్రలో పడిపోయారు.

అడవిలో సూర్యుడు శీతాకాలంలో మరీ ఆలస్యంగా ఉదయిస్తాడు. అంతటా పొగమంచు ఆవరించి ఉంటుంది. రాత్రి కురిసిన మంచు చెట్ల ఆకులమీద ముత్యాలుగా మిగిలినది మిగలగా సూర్యకాంతిలోని కొద్దిపాటి వెచ్చదనాన్నీ పీల్చుకుంటూ పలచగా ఆవిరౌతూంటుంది. దానితో ఎటు చూసినా మసకమసకగానూ మబ్బుమబ్బుగానూ ధూళిపట్టిన అద్దంలా కనిపిస్తూంటుంది. ఒక్కొక్కప్పుడీ పొగమంచు ఎంత దట్టంగా ఆవరించుకుంటుందంటే ఒకటి రెండు గజాల అవతల కూడా కనిపించదు.

ఆటవికులకు శీతాకాలం ప్రాణసంకటమే. చలి భరించలేక కొందరు వృద్ధులూ పసిపాపలూ చనిపోతారు. తగిన రక్షణనిచ్చే యిళ్ళుండవువారికి. అయితే... చలిమంటలతోనూ జంతువుల చర్మాలతోనూ కొంతవరకూ వారు చలితో పోరాడుతారు. కాని చలికి ఆకలెక్కువ. అసలే రెక్కాడితే గాని డొక్కాడని బతుకులు. నిజానికి రెక్కలెంత ఆడినా డొక్కలు పూర్తిగా ఆడని బడుగుబతుకులు. ఆపైన శీతాకాలంలో నిలిచే పొద్దు తక్కువ. ఆలస్యంగా అయ్యే సూర్యోదయమూ, తొందరగా అయిపోయే సూర్యాస్తమయమూ పగటిపూటను మరింత కురచ





జేసేస్తాయి. దానితో తిండి దొరికే గంటలు తక్కువైపోతాయి. ఆకలి తీరక మరింత చలి నీరసం. కష్టాలలాగే సమస్యలూ ఒంటరిగా రావు కాబోలు. చలికాలం గిరిజనులక నేక సమస్యలు తెచ్చిపెడుతుంది. విషమ పరీక్షలే పెడుతుంది.

స్త్రీ ఎక్కడయినా స్త్రీయే. నగరంలో అయినా అరణ్యంలో అయినా కుటుంబంలో ముందు మేలుకునేది మహిళే. అడవిలో నీళ్ళు తెచ్చుకుందుకు లేస్తుంది స్త్రీ. అలాగని- మగవాళ్ళు మరీ ఆలస్యంగా లేస్తారని కాదు. గిరిజనులది కష్టపడితేనే సాగే జీవితం. సామంత తెగవారయితే ఉదయం లేచీ లేవగానే పళ్ళు తోముకోకుండానే కత్తో గొడ్డలో భుజాన వేసుకుని అడవిలోకిపోతారు. కట్టెలుకొట్టి... మోపు కట్టి భుజానికెత్తుకుని... దగ్గరలో ఉన్న పెద్ద గ్రామాలకి పోయి... వాటినమ్మి... ఆ డబ్బులతో నూకలో ముంత జొన్నలో కొనుక్కుని యింటికొచ్చి వంటకందిస్తారు. మొక్కజొన్న పొత్తులు ఉడకబెట్టి... ఎండబెట్టి... పిండి చేసి... ఆ పిండితో అంబలి చేసుకుతాగుతారు. కొర్రలు, అలసందలు, సామలు వంటి కాయధాన్యాల పిండితో చేసిన అంబలే వారికి ప్రధాన ఆహారం. వారికి స్థిరమయిన పనంటూ ఏదీ ఉండదు. డిసెంబరునుంచి మే నెలవరకూ అడ్డాకులు ఏరుకొచ్చి... వాటి నెండబెట్టి... బొత్తులుగా కట్టలు కట్టి కొండ సంతలలో అమ్ముతారు. కాఫీ తోటల పెంపకంలో పని దొరికితే అది చేస్తారు. వ్యవసాయముంటే అది చేస్తారు. కుటుంబంలోని వృద్ధుడే ఇంటి పెద్ద. ఆచరించడం మాటెలా ఉన్నా- అతని మాటని, సలహానీ కుటుంబసభ్యులందరూ గౌరవంగానూ భక్తిగానూ వింటారు.

అర్జున కుటుంబం పనిలోకి బయలుదేరడానికి సిద్ధంగా ఉంది. మరెక్కడా పనులు లేవు కనుక అడివికి పోడానికే నిశ్చయించుకున్నారు. పిల్లలు నేలనపడ్డ కాయాకసరూ ఏరతారు. పెద్దలు సామర్థ్యాన్నిబట్టి వంట చెరకు నరకడమో వేటాడడమో చేస్తారు. అడవిలో అనేక రకాల పనులుంటాయి.

వాళ్ళందరూ గుడిసెముందుకొచ్చి అడవి వేపు దణ్ణంపెట్టారు. ఆకాశంవేపు చేతులు జోడించారు. కొండకొనవేపు దండాలు విసిరి కదలబోయారు.

సరిగ్గా అప్పుడే... తీ... తీ... త్రీ... తీకి... తీకి అనేది వినిపించి తుళ్ళిపడి ఆగిపోయారు. అర్జున భయంగా అన్నాడు. "తీతువు... ఆ కూత రానున్న కలతకు సంకేతం. అది శకునపక్షి. మా సెడ్డ పిట్ట. దాని నోరు మా దుర్మార్గం. అది శకునపిట్ట, శని పిట్ట.

అర్జున చిన్న కొడుకు మొన్ననే నాలుగో పడిలో పడినవాడు, నల్ల శానపు రాయి బొమ్మలా ఉండేవాడు. మనసులో పొగరుకు పోయాడు. "తీతిక పిట్ట అరిస్తే నాయనెందుకూ తైతక్కిలాడడం? పిట్టన్నాక కూయదా? దాని కూతకీ మన చేతకీ సంబంధమేటి? " అన్నాడు.

"ఎందుకేనా మంచిది. ఇయాళ కట్టెలు కొట్టమాకండి. గార్డు కంట పడిపోతామేమో" జాగ్రత్త చెప్పాడు మహారాజు.

ఆటవికుల పాలిట యమదూతలు ఫారెస్ట్ గార్డులు. వారి విధి అటవీ సంరక్షణ. కాని... ఆ పేరిట వారు పాల్పడే నీచాలకు అంతుండదు. అటవీ చట్టాలు అడవిలోని చెట్లను నరకడాన్ని నిషేధిస్తూ శిక్షార్హమయిన నేరంగా పరిగణిస్తాయి. పర్యావరణ పరిరక్షణకు, వాతావరణ, వర్షపాత సమతుల్య రక్షణకూ, భూభాగంలో మూడవ వంతు వరకూ అడవులు అవసరం.

కనుక, ప్రభుత్వం వనసంరక్షణార్థం అనేక చట్టాలు చేసింది. జంతువులూ పక్షులూ లేకపోతే మానవజీవనానికి కూడా



కొన్ని ముప్పు లెదురౌతాయని, కొన్ని జంతు వులను వేటాడ్డమూ నిషేధించింది. ఆ చట్టాలను అమలుపరచవలసిన విధి ఉద్యో గులది. వారిలో ప్రత్యక్షంగానూ అడవితో సంబంధం కలిగి ఉండేవారు ఫారెస్ట్ గార్డులు. పై అధికారులు వన సందర్శనం మేరకే. ఈ గార్డులకి గిరిజనులు లోకువ. వారు విద్యావిహీనులు కావడమూ, భుక్తి కోసం అడవిమీద ఆధారపడడమూ, పేద వారు కావడమూ, యివన్నీ కారణాలే గార్డుల జులుముకి. పొట్టి పుణ్యానికి జుల్మా నాలు విధిస్తామని బెదిరించి కొండవాళ్ళ కష్టార్జితాల్ని లాక్కుంటూ ఉంటారు. అది ధనరూపంలో వీలవకపోతే వస్తురూపంలో అయినా సరే. పుల్లలేరుకుందుకో ఆకులేరు కుందుకో అడవిలో తిరిగే ఆడవాళ్ళు కంటికి నదరుగా కనిపిస్తే వారిని బెదిరించి చెరప డతారు. పట్నంలో కాకీ యూనిఫారాల పోలీసుల బెడదయితే, కొండలమీదా అడవు లలోనూ ఈ దరిద్రనారాయణులకు ఫారెస్ట్ గార్డుల బెడద.

"ఈ అడవులు మీవి. ఈ చెట్లు, ఈ సందప, అన్నీ మీవే. వీటిని పెంచేదీ మీరే, అనుభవించేదీ మీరే, కష్టమంతా మీదయితే ఆంగ్లేయులకి కప్పమెందుక్కట్టాలి?" అని ఆనాడు అల్లూరి సీతారామరాజు గిరిజను లనూ ఆటవికులనూ ఉత్తేజితులను చేసినా యిప్పటికీ వారికింకా తమ హక్కులు తెలి యనే తెలియవు. తుపాకి పట్టుకుని కాకి బట్టలేసుకుని అడవిలో రాజులా తిరిగే గార్డంటే వారికి గాబరా. అందుకే అర్జునను అలా హెచ్చరించాడు మహారాజు.

"ఎల్లుండి సంతాయె. ఇప్పటిదనుక పోగే సిందేటీ నేను. సంతకు చేతులూపుకుంటూ ఎళ్ళమా?" అన్నాడు అర్జున. ఆవేళ గురు వారం. శనివారమేమో పాడేరు సంత. ఆ సంతకి అడవి పంటల్తో కావళ్ళేసుకెడితేనే బతుకు మరో వారం నడిచేది. ఆకులో కాయలో కూడేసి... కావిడేసి పాడేరెళ్ళి సంతలో అమ్మాల. ఆ వొచ్చిన డబ్బులలో సిరసి నూనె... అగ్గిపెట్టెలు... అలాటివి కొనుక్కు తెచ్చుకోవాల. ఒక్కవారం సంతకె ళ్ళకపోతే మళ్ళీ వారం వరకూ కటకటే. అంచేత సంత మానుకోలేరు. అడవిలో క్రూరమృగాల బాధ ఉండకపోదు కానీ, ఆ బాధా భయమూ ఫారెస్టుగార్డు పట్లంత కాదు. అయినా ఏమీ అనలేకపోయాడు అర్జున. ముందు సంత, వెనక గార్డు, అదీ పరిస్థితి అనుకున్నాడు మనసులో. అంద రినీ ఒకసారి కాళ్ళు కడుక్కుని మంచినీళ్ళు తాగి మరీ బయలుదేరమన్నాడు. అర్జున తమ్ముడు కిల్లోడు విసుక్కుంటూనే ఆ ఛాద స్తాలు ముగించి, వేటకు కదిలాడు మిగిలిన వాళ్ళతో కలసి.

వేటంటే యివాళ జంతువులని వేటాడ్డ మనే అర్థం ప్రచారమూ స్థిరమూ అయింది కానీ తొలుత ఈ పదానికెన్నో అర్థాలుం డేవి. చేపలను పట్టడాన్నీ వేట అనే అనే వారు పూర్వకాలంలో. రాజుగారి ఏడుగురు కొడుకులూ వేటకెళ్ళి ఏడు చేపలు తెచ్చా రంటేఅది హాస్యాస్పద ప్రయోగమేమీ కాదు.

అడవిలో ప్రవేశిస్తూనే ఆ కుటుంబం నలుగురూ నాలుగు మూలలకీ చెదిరిపో యారు. స్త్రీలూ వృద్ధురాండ్రు కావడాన యింటిదగ్గరే ఉండిపోయారు. అలాగని వాళ్ళు ఊరకే కూర్చోరు. తమవయసుకీ సత్తువకీ అనువయిన... పచ్చి అడ్డాకుల నెండబెట్టడమూ... ఎండాక వాటిని సాపు చేసి... బొత్తులు పెట్టి... కట్టలు కట్టడమూ వంటి తేలిక పనులు చేస్తూంటారు. వాళ్ళు సవతులయినా సఖ్యంగా ఒకింట్లోనే ఉంటారు. గిరిజనులదీ చాలా తెగలలో పితృస్వామ్యమే. పురుషాధిక్యతే. చాలా తెగ లలో బహుభార్యాత్వం సమ్మతమే. ఒక్కొక్క గిరిజనుడు నలుగురేసి ఆడవా

ళ్ళను కూడా వివాహంచేసుకుంటారు. ఎంత మంది భార్యలుంటే అంత గొప్పగా భావిస్తారు గిరిజనులు.

ఆ సాయంత్రం... చీకటి పడుతున్నవేళకి.

కుటుంబ సభ్యులంతా అటవీద్వారందగ్గర కలుసుకున్నారెప్పటిలాగే. వాళ్ళ ముఖాలు ఆనందంతో వెలిగిపోతున్నాయి.

"నేను మోపెడు చింత కట్టెలు కొట్టుకొచ్చాను" కిల్లోడు.

"నేనయితే పనసపళ్ళు కొట్టుకొచ్చాను" అర్జున.

"చూడు నేనెన్ని ఉసిరికాయలేరానో" అంది ఎనిమిదేళ్ళది.

"ఇవన్నీ ఏటి? రేగిపళ్ళు" జోలె చూపాడు ఆరేళ్ళవాడు.

"నేనయితే చింతచిగురు దూశాను" కిల్లోడి భార్య కామమ్మ.

"గచ్చపొద కాపిస్తే దులుపుకొచ్చాను" అర్జున పెళ్ళాం బిమ్మలమ్మ.

సంతోషంగా నవ్వాడు మహారాజు.

"నాకు తేనెపట్టు దొరికింది. పుట్టకి పట్టిన నిలువెత్తు పెద్దపుట్ట. ఇదుగో పట్టు. ఆకులు పోగేసి..., పోగేసి ఈగలని తోలి పట్టు చేజిక్కించుకునేసరికి బ్రహ్మ ప్రళయమే అయింది. మొయ్యలేక గూళ్ళు పడిపోయాయంటే నమ్మండి"

"ఇంటిదాకా నేనెత్తుకుంటాలె" గుడ్డ తొలగించి పట్టుని చూశాడు అర్జున.

"అయితే ఈ పాలి సంతలో బోలేడు దుడ్లు లభిస్తాయన్నమాటే" అంది కామమ్మ.

"ఆc... నీకు బిళ్ళేరి అద్దం కొంటానులే"

"నాకో? " అడిగింది బిమ్మలమ్మ భర్త వంక జూస్తూ.

"పూల రవికె కావాల్నా? "

"పిల్దానికీ పిలగోడికీ సెడ్డీలు తీయిద్దాం ముందు"

కబుర్లు చెప్పుకుంటూ గుడిసెవేపు నడవసాగారు. "రేపు కూడా ఈ దినము మాదిరి దొరికినయ్యో... పాడేరు సంతకి కావిళ్లే కావిళ్ళు... మనకి డబ్బులే డబ్బులు"

అయ్యా, శెకునమన్నాడు. తీతువన్నాడు. అశుబమన్నాడు. లచ్చ జాగ్రత్తలు చెప్పాడందరూ అడివిలోకెళ్ళేవరకూ. తెగ బయపెట్టేశాడు, తాను బెగిలిపోయాడు. కాని జరిగిందేటి? శుభం. నాబం. ఎన్నడూ లేనంత పంట. అందరిచేతులూ నిండుగా. శెకునాలొట్టిదేనన్నమాట. మనసులో అనుకున్నాడు కిల్లోడు. వాళ్ళిల్లు జేరేసరికి చీకటిపడిపోయింది. అప్పటికే కొర్రల తోపకాచి ఉంచారు ముసిలాళ్ళు. ముఖాలూ మూతులూ కడుక్కుని ఇంటిల్లిపాదీ తోపకెగబడ్డారు. పగలంతా అలసీ ఆకలితో ఆవురావురుమంటూఉండటానికి తోడు, గిరిజనులవి కిరసనాయిలు బుడ్లు. వారి ప్రాణాలకు కిరసనాయిలు అతి ప్రియం. దానివాడకాన్ని వీలయినంతగా తగ్గించుకుంటారు. చీకటి పడకుండానే తినేస్తారు. అదీకాక రాత్రి ముదురుతున్నకొద్దీ చలి ముదురుతుంది. ఆ కొండలమీద చలికి గొంతు పూడుకుపోయి మాట పెగలదు, ముద్దా దిగదు. అందుకే పెందరాళే సాపాటు. అదీ రాత్రిళ్ళు గంగరావిచెట్టు దగ్గర ఏవయినా కాలక్షేపాలుండవొచ్చు నాట్యాలు, పాటల్లాంటి వినోదాలు. అందుకే ముందుగా తినేసి రెడీగా ఉంటారు. దాదాపు పన్నెండు గంటలపాటు సూర్యాస్తమయంనుంచీ సూర్యోదయం వరకూ నిద్రపోడమంటే ఎవరితరం? శారీర క్రమే తప్ప మెదడుకి పెద్దపనుండదు వారికి. వారి శరీరాలు దీర్ఘ విశ్రాంతిని భరింపవు.

తోప కడుపునిండా పట్టించేశారు మహా

రాజు కుటుంబం. ఇంకా చలి ముదిరి పోలేదు గానీ... కడుపునిండగానే మామూలు చలి కూడా కాస్త ఎక్కువగా అనిపిస్తోంది. అందుకే నెగడుకి చితుకులూ పుల్లలూ దుక్కలూ సమకూర్చుతున్నారు.

కట్టెలన్నీ ఒకచోట చేర్చడం అయిందో లేదో, శృంగనాదం.

అంటే కొమ్ము బూరా.

ఆ నాదం వారికి వేదం. శిరోధార్యం.

దాని సంకేతం రాత్రికి మద్దిచెట్లుకింద చేరమని, ఆహ్వానం. మద్దిచెట్టంటే రచ్చ బండ లాటింది. ఊరికి, గూడేనికి వేదిక. గూడేనికి సంబంధించిన సామాజిక కార్యక్ర మాలు అన్నీ అక్కడే జరుగుతాయి.

'ఇవాళ ఏటో డాన్సా? పదాలా? అందరూ ఆలోచనలోపడ్డారు. ఆలోచిస్తూనే ఆకాశంవేపు చూశారు. మంచు తెరలు మరీ దట్టంగా ఏమీ లేవు. నక్షత్రాలు కనపడుతు న్నాయి. పగటిపూట సూరీడూ రాత్రిపూట చుక్కలే వారి కాలమానాలు. అలాగ పగటిపూట పొద్దునీ రాత్రి సమయాన వేళనీ కనుక్కోడం వారందరికీ చేతనయిన విద్యే.

వారికి రాత్రుల్లో తరచుగా జరిగే కాల క్షేపం సంగీత నృత్యాలే. వాటిమీదా, తాగుడు, ఏదయినా తగవుంటే అదీ. ఆర్నె ల్లకిందట మాత్రం ఒక తమాషా జరిగింది. ఇలాగే మద్ది చెట్టు మీటింగ్ అని బూరవే శారు. ఆ చెట్టుచుట్టూ ఉన్న కాళీ జాగాలో జనం చేరారు. దివిటీలు వెలుగున్నయ్. అప్పుడు గంటం దొర వొచ్చాడు. అతని వెనుక ఒకడిని పెడరెక్కలు విరిచి పట్టు కుని తెచ్చారు యిద్దరు కోయలు

"నమస్తే నాయకా"... "నమస్తే నాయకా" ... గంటం దొరకు స్వాగతం పలికారు.

నాయకుడు "అందరు కుశలమే గదా?" అంటూ జనాంతికంగా ఒకసారి చేతులు జోడించి బండమీద కూచుని... "ఈ దిన మొక యిసిత్రము జరిగినది మన అడవిన. ఇసిత్రమే కాదు. యిచారించవలసినదీని" అన్నాడు.

అప్పటికే అందరూ ఆ బందీని చూస్తు న్నారు. వాడు అడవివాడు కాదు. పైవాడు ఏడవాడో? ఏమిచేసినాడో? ఎందుకొచ్చి నాడో? అందరిలోనూ ప్రశ్నలు.

"నీ గురించి నువ్వే చెప్పుకో" అన్నాడు గంటం దొర వాడిని చూస్తూ.

గిరిజన వలయంలో మధ్యగా వాడు. వాడి ముఖం అందరికీ కనిపించేలా ఒకడు దివిటీని నేలలో పాతి వెళ్ళాడు.

గంటందొర కొంచెం విడిగా రాతిమీద ఆసీనుడు కాగా ప్రజలు నేలమీదే బైఠాయిం చారు. బందీమాత్రం నిలబడే చెప్పసా గాడు. "నా పేరు వెంకటేశు. మా వూరు అనకాపల్లి. నేను చదువుకున్న వాడిని కాను. పొట్టపోషించుకుందుకు రకరకాల పన్లు చేస్తూంటాను. ఈ మధ్య టౌనువాళ్ళకి ఒక వెర్రి ముదిరింది. అదేమిటంటే... జంతువులనీ పక్షులనీ యింట్లో పెట్టుకోడం"

ఎవరో అరిచారు. "అందులో వింతే ముంది? ఆవులు, గేదెలు, మేకలు పాడికో సమని పేడకోసమని పెంచుదురు కదా టౌన్లలో. కోళ్ళని, బాతుల్ని..."

"అలాటి పెంపకంకాదు. ఉడతలు... కాకులు, పిట్టలు, ప్రాణమున్న వాటిని పెంచితే అదొక లెక్క. వాళ్ళు ప్రాణం లేని వాటిని, జంతువుల, పక్షుల శవాలని ఉంచు తారు. అలా ఉంచడాన్ని కళాపోషణం టారు. అలంకరణంటారు. స్టయిలంటారు. షో కంటారు"

"శవాలనింట్లో పెట్టుకోడమేమిటి? పిట్టలూ, జంతువులూ చచ్చిందనుకా?"

"కాదు... వాటిని చంపి... లోపలిదంతా

తీసివేసి ఎండబెట్టి గడ్డీ గాదము కూరి స్టఫింగ్ చేసి పైకి ప్రాణంతో ఉన్నదానిలాగే కనపడేలా చేసి"

"ఎందుకట? ఏమిటో వెర్రీ, పిచ్చీ? "

"నిజమే వెర్రే... పిచ్చే, కాకి మెతుకు లకోసమొస్తే హుష్ అని తరుముతారు. పిల్లి పాలు తాగేస్తుందని కర్ర పుచ్చుకు తరుముతారు. కాని వాటి శవాలని మాత్రం డ్రాయింగ్ రూంలోనూ బెడ్ రూంలోనూ అలంకరిస్తారు, అందంగా ఉంటాయంటూ"

"మరి... ఎవడేనా, ఎవర్తేనా మనిషి అందంగా ఉన్నా కూడా అలా టిప్పింగు చేసి యింట్లో నిలబెట్టుకుంటారా, రూపు సక్కగుందని? "

"అహ... మనిషిని చంపడమే మర్డరు... నేరం"

"మరో జీవిని చంపడం మర్డరు కాదా? దాన్ది మాత్రం ప్రాణంకాదా? అది నిన్నేం జేసిందని దాన్ని చంపాల? అందంగా ఉండడమేనా దానపరాదం' అట్లయితే దాని అందం అది పూసుకున్నది కాదే? దేవుడి చ్చిందినే? "

"మీ సందేహాలకు నా దగ్గర సమాధా నాలు లేవు. జరుగుతున్నది చెప్పగల్నంతే. పెంపుడు జంతువులనీ... మరికొన్నిటినీ చంపితే నేరమేమో, కాని కాకుల్నీ, పిట్టల్నీ చంపితే తప్పుండదు టౌన్లలో. అలా స్టఫింగ్ చేసిన వాటికి చాలా **ధర** యిచ్చి ధనవం తులు కొనుక్కుంటారు అలంకరణకి"

"నువ్వు పేదోడివన్నావుగా? "

"అందుకే ఈ పని చేబట్టాను. ఎంత అరుదయిన పిట్ట లేదా జంతువయితే అంత మోజూ, ఖరీదూ. ఊళ్లలో దొరకవవి. అందుకే అడవిలోకి వొచ్చాను ఈ వలలు పట్టుకుని. ఇక్కడ బలే చిత్రంగా ఉంది. ఒక చెట్టునిండా కోతులు. మరొక చెట్టు నిండా కొండెలకలు. అవి బలే తమాషాగు న్నయ్. పిల్లలంత ఎలుకలు. ఇటుక రంగు లాటి అదో ముదరెరుపు... పొడవుగా కుచ్చుతోక. చెట్టుమీద అటూ ఇటూ చిత్రంగా పరుగెడుతున్నాయి. పట్టుకుని స్టఫింగ్ చేసి అమ్మాలే కాని ఒక్కోదానికి రెండు వందలు కూడా పలకొచ్చనుకుంటూ చెట్టు దిగువ వల పరచి క్యాటిల్ బార్‌తో రాళ్ళు రువ్వాను వాటిమీదకి. అవి చెదిరి... బెదిరి... వలలో పడితే పట్టుకుందామని"

"మరి నీ దగ్గర తుపాకుందే? "

"ఆత్మరక్షణకు అవసరమైతే ఉంటుందని. జంతువులని పిట్టలని కాల్చి చంపితే షేపు మారిపోయి స్టఫింగ్ బాగారాదు" చెప్పాడు వెంకటేశు.

చటుక్కున ఓ కోయ లేచి "తప్పయి పోనాద్దొరా. పొరపాటు పడినాను. భుజాన బుందూకుంటే సంపడానికొచ్చినాడనుకుని సందెట్లో పట్టేసి నీ ముందుంచినాను. పిట్ట లని కొట్టేవాడు కాదనీ పట్టేవాడే అనీ నాకు తెలవలేదు" అన్నాడు, దొరకి అనవసరంగా శ్రమ కలిగించినందుకు క్షమించమంటు న్నట్లే.

గంటం దొర ఫరవాలేదన్నట్లుగా "ఇప్పుడు పట్టేదే అయినా తరవాత మట్టుపె ట్టక మానడుగా? అంచేత దోషే. ఎంక టేశూ! ఇది అడవి. మా అడవి. ఇక్కడ మాకొక న్యాయముంది. ధర్మముంది. ఆకలి తీర్చుకుందుకో ఆత్మరక్షణకో తప్ప దేనినీ చంపం మేము. అడివమ్మకి చేసిన బాస అది. జంతువులు, పిట్టలు, చెట్లు, మేము అందరం అడవి బిడ్డలమే. సోదరీసోదరు లమే. ప్రాణం నిలుపుకుందుకయితేనే మరో ప్రాణం తీయడం. ఆటలకీ ఆనందానికీ జీవాల ఉసురు పోసుకోం. ఇంకెవరినీ అలా చంపనివ్వం. ముందెన్నడేనా యిలాటి పన్జే శావా అడవికొచ్చి? " సూటిగా అడిగాడు.

"లేదు" అన్నాడు వెంకటేశు భయంగా.



"అయితే యిది ప్రదమతప్పిదమన్న మాట. మళ్ళీ వొస్తావా యిలా పట్టేం దుకు? "

"రాను. మళ్ళీనా? తెలవకొచ్చాను"

"సరే... మొదటి తప్పుకనుక వొదిలే స్తున్నాం. తెలవక చేసిన తప్పు కనుక విడి చిపెడుతున్నాం. మళ్ళీ కాని యిలాటెదవ పని చేస్తూ దొరికావో, మా వాళ్ళు మాట లతో చెప్పరు. ఒక్క బాణమేస్తారంతే. అప్పుడు నీకే స్టఫింగైపోతది. పొద్దున్నే కొండ దిగిపో. ఈ రాత్రికి ఆశ్రయమిస్తాం. ఒరే బండా! ఇతగాడికి యింత సంకటెయ్" తీర్పులాగే చెప్పాడు నాయకుడు.

బతుకు జీవుడా అనుకున్నాడు వెంకటేశు. పట్టుబడినప్పటినుంచీ ఈ కొండాళ్ళేం చేస్తారో అని గుండెలు పీచుపీచుమంటు న్నాయి. దానికి తోడు అన్నమూ నీరూ ముట్టనివ్వకుండా చేతులూ కాళ్ళూ కట్టే శారు.

తీర్పులా చెప్పినా మీరేమంటా రన్నట్లు తన వారందరినీ కన్నులతో కలయజూశాడు గంటం దొర. ప్రజాభిప్రాయాన్ని పరిగణ లోకి తీసుకుని తప్ప తన సూచనను తీర్పుగా ఖరారు చేయడు ఆయన! నాయ కుడే అయినా, వినదగునెవ్వరు చెప్పిన అనేది వారి సిద్ధాంతం.

"అంతే" అన్నట్లు అందరూ తలూపారు. తీర్పు, పంచాయతీ ముగిశాయి.

★ ★ ★

బాగా వెలుగుండగానే మద్ది చెట్టు దగ్గర మనుషులగుంపు పోగయ్యారు. నాయకుడు ఒకరిని జూపి... "ఈయన పట్నంనుంచి పారొచ్చాడు. సదువుకున్నోడూ ప్రెపంచ జ్ఞానం కలోడూ. మనకి, అడివిని గురించి నాలుగు ముక్కలు జెబుతానంటున్నాడు. మనసూ వొళ్లూ దగ్గరెట్టుకుని వినుకొండి. ఎవరేం జెప్పినా ఇనడంవల్ల నష్టముండదు" అన్నాడు.

చేపపిల్లలకు ఈత నేర్పడంలాగా మాకు అడవిని గురించి చెప్పడమేటని మనసులో అనుకుంటూనే చెవులొగ్గారతని మాటలకు-చేసేదేమీలేక. అతని మాటలలో ఊళ్ల పేళ్లూ, మనుషుల పేర్లూ జ్ఞాపకం లేవు గానీ... సంగతి మాత్రం మనసులో లోతుగా నాటుకుపోయింది.

ఉత్తరదేశంలో ఒకరాజుండేవాడు. రాజ ధానికి చుట్టూ అడవులే. రాజుగారికి అంతః పురాన్ని కొత్తదిగా కట్టాలనిపించింది. అందుకు విశేషమయిన కలప తెప్పించమని మంత్రికి పురమాయించాడు. రాజభటులని వెంటబెట్టుకుని అడవిలోకి వెళ్లాడు. చెట్లు నరకడానికి వొచ్చారనేసరికి కొండవాళ్లు, కోయవాళ్లు, చెంచులు, ఆడామగా అందరూ ఏకమైపోయారు. "అడవి మా అమ్మ. మా అన్నదాత. వస్త్రదాత. గృహదాత. మా జీవ నదాత. చెట్లని నరకొద్దు. మా బతుకులు నరకొద్దు" అని వేడుకున్నారు. రాజభ టులు కరగలేదు. కూలీలను చెట్లుకొట్టమ న్నారు. ఆ హుకుం అమలు జరిగే లోగానే పిల్లా పాపా... ఆడామగా... పెద్దా వృద్ధా ఒక్కొక్కరూ ఏడుస్తూ ఒక్కొక్క చెట్టును పట్టుకుని కౌగలించుకుని, "మమ్మల్ని ముందు నరికి అప్పుడు నరకండి చెట్టును" అంటూ నిలబడ్డారు.

మంత్రికేం చేయాలో పాలుపోలేదు. అడ విలో ఎక్కడికెళ్ళినా వీళ్లే తయారు. చేసేది లేక రాజధానికిపోయి ఆటవికులపై రాజుకి ఫిర్యాదు చేశాడు. అప్పుడు రాజు తన తప్పూ, నిజమూ తెలుసుకుని తన రాజ్యంలో అనవసరంగా ఎవరూ చెట్టు కొట్ట రాదని అలా నరికితే శిరచ్ఛేదమే అనీ శాసనం చేయించాడు. సబబే. ఒక చెట్టును నరకడమయితే నిముషాలపనే కాని పెంచా లంటే పదులకొద్దీ సంవత్సరాలకాలం పడు తుంది. చెట్ల పచ్చదనం మనిషి కంటికీ





రోగ్యం. వాతావరణానికి మంచిది. మనుషులు ఒదిలే మలిన వాయువులను పీల్చుకుని గాలిని శుభ్రంచేసేవి చెట్లు. ఒక్క మర్రిచెట్టు వెయ్యిమందికి పరిశుద్ధమయిన గాలిని ప్రసాదిస్తుందట. వర్షాలను కురిపించడానికేకాదు, దుమ్మునీ, ధూళినీ, వేగపుగాలులనీ, భూసారాన్నీ అడ్డుతాయి. నీళ్లు తాగి కాయలూ ఫలాలూ పువ్వులూ వంట చెరకూ కలపా ఆహార పాత్ర (విస్తళ్లు) ఇస్తాయి. పీచునిస్తాయి, మందులనిస్తాయి. జీవులకు ఆశ్రయమిస్తాయి, ఆతపమిస్తాయి. అలాటి చెట్లు లేకపోతే మనిషి ఉండడు. అందుచేత వృక్షాలను కాపాడుకోడం ప్రతివారి ధర్మం. అందులోనూ మీ ఉనికి అడవి. మీ మనుగడకాధారం అడవి. అందుచేత మీరు అడవిని ప్రాణాధికంగా చూసుకోవాలి. కేవలమూ భౌతికావసరాలు మాత్రమేకాక ఆధ్యాత్మిక సాంస్కృతిక విషయాలూ అడవితోనే ముడిపడివున్నాయి. మీ ఆచార వ్యవహారాలు వేరు. మీ దేముళ్లువేరు. మీరు మీ కలవాటయిన సంస్కృతిని కాపాడుకోవాలనుకుంటే వనసంరక్షణ మీ కర్తవ్యమే"

అతను చెప్పిన కథ చాలా నచ్చింది బిమ్మలమ్మకి. అతను ప్రత్యక్ష పురాణంతీరులో ఆ దృశ్యాలన్నిటినీ నటించీ కళ్లకి కట్టినట్లు ప్రదర్శించడంతో హృదయానికి హత్తుకుపోయిందానాటి కార్యక్రమం. అందుకే మళ్ళీ అలాటిదుంటే బాగుండునని కోరుకుంటుందామె.

తోపని పొట్టలనిండా పట్టించి గుడిసెలో ఉన్న కల్లుని బిడ్డి (ఒక విధమయిన పాత్ర. మూతి సన్నంగా, పొట్ట పెద్దదిగా ఉండేది)లో పోసుకుని మహారాజు కుటుంబం కుటుంబమూ పాలోమంటూ మద్దిచెట్టు దగ్గరకి బయలుదేరారు. వీళ్లు చేరుకునేసరికే అక్కడికి చాలామంది ఒచ్చేసి ఉన్నారు. పట్నపోల్లు ముగ్గురు కొత్తగా ప్రత్యేకంగా కనపడుతున్నారు. అన్నింటికంటే... అక్కడ పెద్ద యిలాయిబుడ్డి (ఎలక్ట్రిక్ బల్బ్... బ్యాటరీ సాయంతో) వెలుగుతోంది. దాని కాంతి ఎంతగా ఉందంటే- కళ్లు మిరుమిట్లు గొల్పుతూ మూసేసుకోవలసివస్తుంది. గూడెంలోకి అలాటి దీపం రావడం అదే ప్రథమం. రావలసిన అందరూ సమావేశమయ్యాక ఆ పట్నపోళ్లలో ఒకడు మెల్లగా చెప్పారు.

"ప్రభుత్వం మీ గిరిజనుల కోసం ఎన్నెన్నో ప్రణాళికలూ, కార్యక్రమాలూ చేపట్టనుంది. అందుకే మీ అందరి సహకారమూ అత్యవసరం. సరిగ్గా మళ్ళీ శుక్రవారం సాయంత్రానికే వెలుగుండగానే మేమొస్తాం. ఆ సమయానికి మీరు మీ చుట్టుపక్కల గూడేలవారందరినీ కూడా సమావేశపరచగలగాలి. ఇప్పటికి" అంటూ పక్కనున్న పెద్ద సంచుల్లోంచి అగ్గిపెట్టెలు... కొవ్వొత్తులు... బిస్కట్ల పొట్లాలు అవీ తీసి వారందరికీ పంచాడు మిగిలిన ఇరువురి సాయంతోనూ. గిరిజనుల సంబరానికి మేరలేదు. ఆ బిస్కట్లు మహరుచిగా ఉన్నాయి. ఆ చాకొలెట్లమిత తీయగా ఉన్నాయి. అందరికందరూ చంకలు గుద్దుకున్నారు. ఉచితంగానూ, అయాచితంగానూ లభించిన ఆ చిరుకాన్కలకు.

"ఒచ్చేవారం- మరిచిపోకుండా, చుట్టుపక్కల గూడేల వాళ్ళనందరినీ... పదిహేనేళ్ల పైబడినవారందరినీ ఇక్కడ పోగుచేస్తారు కదూ? అందరికీ ఇంకా ఎన్నెన్నో తెస్తాం, బీడీలూ, కిరసనాయిలూ... గోధుమలూ అవీ కూడా తెస్తాం" అని గుర్తుచేసి వెళ్లారు పట్నపోళ్లు, మోటారు సైకిలుమీద.

ఇక మొదలయ్యాయక్కడ సందేహాలూ, ఊహాగానాలూ. వాళ్లెవరు? ఎందుకొచ్చారు? బిస్కత్తులూ అవీ ఊరికే ఎందుకిచ్చారు? మళ్ళీ ఎందుకొస్తామన్నారు?

చుట్టుపక్కల గూడేలవారిని కూడా పిలవమన్నారే. బీడీలూ అవీ కూడా తెస్తామన్నారే?

ఎందుకు? తమనుంచి ఏమాశించి వారు పట్నంనుంచి పనికట్టుకు మరీ ఒచ్చి ఇవన్నీ పంచివెళ్ళారు? పదిహేనేళ్ళు పైబడిన వాళ్లనే రమ్మనడంలో వారి ఉద్దేశమేమిటి?

ఎంత బుర్రలు బద్దలు కొట్టుకున్నా అర్థం కాలేదేమీ. దానితో అక్కడికా విషయం ఒదిలేసి కల్లుకెగబడ్డారు. గానాబజానాలు... కల్లు... కబుర్లు... ఆటలు రాత్రి గడిచిందీ తెలియలేదు. చలి వేసిందీ తెలియలేదు. అర్ధరాత్రి దాటాకనే గుడిసెలవారు గుడిసెలకీ పాకలవారు పాకలకీ చేరారు సగం సగం స్పృహతో.

మర్నాడు రాత్రి మరీ చలిగా ఏమీలేదు. గాలి వీస్తోంది. ఆకాశం నిర్మలంగా ఉంది. నక్షత్రాలు మెరుస్తున్నయ్. నాయకుడు గంటందొర ఇంకా నిద్రపోలేదు. నెగడు ముందు చుట్ట కాలుస్తూ కూర్చున్నాడొక్కడూ. అప్పుడు వొచ్చాడు మహారాజక్కడికి.

"దొరా!"

"ఊఁ..." తను కాలుస్తున్న చుట్ట అందించాడతనికి. "చలికి ఒణుకుతున్నావు. కాల్చు, వెచ్చగుంటుంది"

అందుకని రెండు పీల్పులు పీల్చాక మహారాజుకి గుండెల్లో వెచ్చగా హాయిగా ఉన్నట్లనిపించింది. "గాలివాటం జూసుకుని రమ్మన్నావ్‌గ? " మెడలోని డప్పుని మునివేళ్లతో ఓసారి మోగించాడు పరీక్షిస్తున్నట్లు.

"ఇప్పుడు వాటం వీలుగుందా? "

"ఓఁ..."

"ఐతే పద"

ఇద్దరూ గూడెంలోంచి, గుడిసెలలోంచి, పాకలలోంచి ఆరుబయలు స్థలానికొచ్చారు. ఇద్దరి వీపులమీదా కంబళ్లున్నయ్. అక్కడ రాయిముందుకి పొడుచుకొచ్చి ఆకాశంలోకి అడ్డంగా లేచి ఉంది. అది చాలా విశాలంగా ఉంది. దాని చివరకు చేరారిద్దరూ. నాయకుడు సూచనలిస్తున్నట్లు చెప్పసాగాడు. "ఇది గూడేలకి, వారి ప్రతినిధులను రమ్మనే సంకేతం. దీనిని విన్న గూడేల నాయకులు రాజుపాకలవొచ్చి నన్ను కలుసుకోవాలి. ప్రతి గూడెమూ ఈ సమాచారాన్ని మిగిలిన వాటికి చేరవేయాలి. ఎల్లుండినాటికి అందరూ, అన్ని గూడేల పెద్దలూ వొచ్చి నన్ను కలవాలి. అర్థమయిందా? "

"ఐంది"

"అయితే మొదలుపెట్టు"

మహారాజు ఒక్కసారి చుట్టూ చూశాడు. గాలివాటం పరిశీలించాడు. ఒక్కసారి డప్పు మీద మెల్లగా పుల్లతో కొట్టి ధ్వని పరీక్షచేశాడు. సంతృప్తిగా తలూపాడు. డప్పుమీద బలంగానూ, స్పష్టంగానూ రకరకాల ధ్వనులు తీయసాగాడు.

అది గిరిజనుల వార్తలు పంపేవిధానం. ఆ శబ్దాలకు నిర్దుష్టమయిన సంకేతాలూ అర్థాలూ ఉన్నాయి. అవి వాద్యకారులకు తెలుసు. ప్రతి గూడేనికీ ఇలాగ శబ్ద సంకేతాలను పంపడమూ అర్థం చేసుకోవడమూ చేతనయిన వాద్యకళాకారులు కనీసం ఒక్కరయినా ఉంటారు. ఇప్పుడు జరుగుతున్నదదే. మహారాజు చర్మవాద్యంమీద ధ్వని సంకేతాలు పంపడం పూర్తిచేశాడు. ఒకటి రెండు నిమిషాలు. గంటందొర కూడా చెవులు రిక్కించుకుని వినసాగాడు. గాలి వీచడంలేదు. మంచు కురవడంలేదు. అందుచేత వాతావరణం తేలికగానూ ధ్వని ప్రయాణానికనువుగాను ఉంది. ఒకటి రెండు నిమిషాలు గడవగానే సమాధానాలుగా అవతలినుంచి ఢమరుక శబ్దాలు రాసాగాయి. మరొక వేపునుంచి డప్పు. ఇంకొకవేపునుంచి బాజా... మహారాజు

సంతృప్తిగా తలపంకించాడు. "చాలు మన వర్తమానం రెండు మూడు గూడేలకందింది కనుక వాళ్లు వాళ్ల దగ్గరి గూడాలకు పంపు తారు" అంటూ లేచాడు పనయిపోయినట్లూ ఇక పోదామన్నట్లూ.

"నిద్దరొస్తూందా? " అడిగాడు మహారాజు.

"లేదు"

"ఎలా వొస్తుందిలే పక్కలోకి వెచ్చన లేదు. శీతాకాలం. దొరా! నువ్వు పెళ్లి జేసు కోవలసింది మళ్లీ. నీ పెళ్లి నేను మరచిపో లేదు. ఒక్కసారా కబుర్లు కలబోసుకుందాం, కూర్చో ఒక చుట్టముక్క పడెయ్"

ఇద్దరివీ సుమారుగా ఒకటే వయసు. పదేళ్లకిందట మహరాజు భార్య చనిపో యింది పాముకరిచి. అతను కావాలను కుంటే మళ్లీ పెళ్లి చేసుకోవొచ్చు కాని దొరే కూడదనుకున్నాడు. దొరకొక్కతే భార్య మొదటినుంచీ. చాలా ఇష్టపడి చేసుకున్నా డామెను. అదంతా మహరాజుకి జ్ఞాపకమే ఇప్పటికిని.

★ ★ ★

గంటందొరది కొండదొరలలో పొరజా లుశాఖ. మొదట్నించీ రాజుపాకలలోనే మకాం. ఎందుకో ఒకసారటెళ్తే- వేటకెళ్లేగూ డెంలో మచ్చేవి కంటపడింది. ఎలాగుండ నామె? చంధమామలా ఉంది. కొండ మల్లెలా ఉంది. కోడెవయసు దొరని కోర చూపుతో నిలేసింది. ఆరాతీస్తే లంబన్న బొట్టె అనీ తమశాఖే అనీ తేలింది. అంతే రాజుపాకలవొచ్చి పంచపాండవుల మాదిరి ఐదుగురు పెద్దలను పెగడకి (రాయబారా నికి) పంపాడు.

పెగడతో మేకనీ, బొడుగు కల్లు (వర న్నంతో తయారుచేసే కల్లు), డబ్బాతో సారా వెళ్ళాయి. పెళ్లికూతురింటికి వెళ్తే వాళ్లేమో మళ్ల పెద్దలని తెచ్చారు. మాటలా డారు. సరే అంటే సరే అనుకున్నారు, సంబంధం కాయమనుకున్నారు. చుట్టలు మార్చుకుని కాల్చుకున్నారు. పెళ్లి మగపెళ్లి వారింట కనుక ఆడపెళ్లివారు పెళ్లికేం తేవా లన్నది తేల్చారు. తనికింకా జ్ఞాపకం. ఇర వైకుంచాల బియ్యం... ఒకమేకపోతు. వేట పోతు బలేగా ఉండింది. రేపు రాత్రి పెళ్ల నగా ఈ సాయంత్రం గంటం దొరవాళ్లు కాత పంపారు. మేక... బియ్యంతోపాటు కాతబుట్టలో గాజులు, అద్దం, కంకణాలు, కాలమెట్టెలు. నేబు (డబ్బు) అన్నీ ఉంచి ఓ అమ్మాయి నెత్తిమీద పెట్టారు. పైకి అర్భ కంగా కనిపించినా బాగానే మోసిందీ గూడెంనుంచి ఆ గూడెంవరకూ కోసెడు దూరమూ ఎక్కడా కిందపెట్టకుండా. కాత గొర్రె సంగతి తనే చూసుకున్నాడు. కాత గొర్రెని అటులాగి ఇటులాగి చివరకు తామే తమవేపు లాగేసుకున్నారు. కాత గొర్రె ఖరీ దుగా ఆ రోజుల్లో పదిటెంకాలు లాగేడు తను. దూళివిందులో మాంసం, అరిసెలు ఉండాలని గట్టిగా చెప్పాడు తనే. ఆడపెళ్లి వారు ఆరుబయలున దూళి విందూ చేశారు, చెప్పినవి ఒడ్డించనూ ఒడ్డించారు. తరవాత వాళ్ల పందిరకెళ్లి అక్కణ్నుంచి మర్నాడుద యమే మగపెళ్లివారి పందిరకందరూ తరలి వచ్చారు. వీది మొగదలే, నేరేడు, అరటి, మామిడి, జంద్రంగి కొమ్మలు కలిపి పాతిం చాడు తను స్వయంగా దగ్గరుండి. పెళ్లికూ తురువాళ్లు పాతిన కాత కొమ్మకంటె తను పాతించిందే గనంగా ఉందని ఎందరో అన్నారు.

ఆ రాత్తిరి లగ్గమైపోయింది. గంటందొర పెళ్లాం నల్లగా ఉన్నా బొమ్మంత చక్కనిది. స్నేహితుడంత చక్కని దాన్ని భార్యగా పొందినందుకు తనెంతో సంతోషించాడు. గంటందొర కామె అంటే ప్రేమా ప్రాణమే. ఆమెపైఎంత ఇదంటే మచ్చెవినికాక మరో ఆడదాన్ని కన్నెత్తి చూడలేదు. అది బతికు న్నప్పుడే కాదు, చనిపోయినా కూడా. ఈ

రోజుల్లో అలా పద్ధతిగా జరిగే పెళ్లిళ్లు కరువైపోయాయి. అంత ప్రేమగా ఉండే ఆలుమగలూ అరుదైపోయారు. దొరకొక్కడే కొడుకు. ఆడు సాహసానికిపోయి యీనిన పులని కానుకోకుండా పోట్లాటకు దిగాడు. అంతే అది అడ్డదిడ్డంగా పంజా యిసిరేసింది. రెచ్చిపోయి ఆడు సచ్చిపోయాడు నిష్కారణంగా. ఆడికో కూతురు. దొరదదేం కర్మోగాని కొండకొమ్మన చీపురుగడ్డేరుతూ జారిపడి సచ్చిపోయింది కోడలు. మనవరాలు గున్నమ్మ మిగిలింది. దాన్ని ముసిలాళ్లిద్దరూ సాకుతూ వొచ్చారు. ముసిల్ది చచ్చిపోయేసరికి పిలదాని వొయసు మూడేళ్లో నాలుగేళ్లో. చిన్నగుంట. ఐనా దొరకి నిబ్బరమెక్కువ కనుక చెక్కుచెదరలేదు. తానే అన్నీ అయి పెంచాడు. ఆరునెలల కిందటెక్కడనుంచో వొచ్చారు వీళ్లు. వారంకిందటే ఈడేరిన గున్నమ్మని జూశారు. అడివిపుష్పంలా అందంగా ఉన్న గున్నమ్మని చూసి గుమ్మయిపోయారు. తమ కుర్రాడికి మనువుజేసుకుంటామని వాళ్లంతటవాళ్లే ముందుకి వచ్చారు. మునుపువారూ కొండమీదవారేనట. అంతే ఓ పదేళ్లయి కొండ దిగిపోయి పట్నంలో ఉంటున్నారట. ఇల్లుందట, వాకిలుందట. వ్యాపారముందట. ఆస్తుందట. "ఐసరబజ్జ అనేయాల్సిన సంబంధం. కాల్ల దగ్గరకొచ్చిన బేరం కాశీపోయినా రాదు. అనవసరంగా ఆలోచించి అనుమానించీ సిద్దాన్నం సెడగొట్టుకోకు.

మంచి సంబంధం. కొండమీదేటుంది? బొట్టునేనా బాగుపడనీ" అని తను దొరని ఊదరగొట్టేశాడు. ఊపిరి పీల్చుకోనిచ్చాడు కాడు. సరే అనిపించేశాడు స్నేహితుడిచేత. అంతే పదినాళ్లకే లగ్గమూ, పిల్లపరాయిదీ ఐపోయింది. దొరని తెరిపిన పడేశాననుకున్నాడే తప్ప- అదంతా మూన్నాళ్ల ముచ్చటే అనీ, ముందుంది ముసళ్లపండగనీ కానుకోలేకపోయాడు. మంచి జేస్తున్నాననుకుని మహానేరం చేశాడు. పాలనుకుని కాలకూట ఇషమిచ్చాడు. పూలమాలనుకుని నాగుపాముని వేశాడు. గోరాతిగోరమే చేశారా నరరూపరాక్షసులు. తలుచుకుంటే రక్తముడికిపోతూంది.

గంటందొర పూజారన్నమాటే కాని పెద్దగా సుఖపడిపోయిందేమీ లేదు. భార్య వున్నన్నాళ్లూ కొంత నయం. ఎప్పుడూ ఎవరో ఒకరు రావడమూ ఏదో పితలాటకం తేవడమూ. చుట్టుపక్కల గూడేలవాళ్లు కూడా ఇతన్నే పెద్దగా భావించడంతో చేతి నిండాపనే ఉండేది. పూజారిలా అతనికి చెందిన పొలాన్ని కూడా సరిగా చూసుకోలేకపోయేవాడు. ఐతే ఎవరో ఒకరు చెయ్యేసేవారు. ఎలాగైతేనేం పంట పండాక నాలుగు గింజలు తెచ్చి ఇంట్లో పోస్తూ వొస్తున్నారు. ఆడదిక్కు లేకపోయినా ఏ అమ్మో ఇంత ఉడికేసి పడేసిపోతుందావేళకి. ఏదేమయినా వయసు వొడిలాక మగాడు ఒంటరిగా ఉండడం కష్టం.

"పద పోదాం. చాలా వేళ అయింది. చలిగానూ ఉంది" అంటూ అతన్ని లేవదీశాడు మహారాజు.



టముకు వినిపిస్తే ఏమిటా అని ఆత్రంగా విన్నాడు అర్జున. చావడి సభకి అందరినీ పిలిచాడు పూజారి. ఏదో విశేషముందట. ఏమిటా అనుకుంటూ వెళ్లాడా రాత్రి.

పూజారి బీమన్న చేత చెప్పించాడసలు విషయం.

"పాడేరునుంచి కొందరు వర్తకులులాటి వారు మన గూడేనికి కూడా రాబోతున్నారని వార్త వచ్చింది. వాళ్లు రావడం మనకి మంచి చేయదు సరికదా కీడే చేస్తుందని నా అనుమానం. అరకు మీకు తెలుసుకదా? మనలాగే కొండప్రాంతం. అక్కడ రంగురాళ్లు దొరికాయి, ఎవరో దేనికో తవ్వ

తూంటే. ఆ రంగురాళ్లు వజ్రాలని పుకారు లేచింది. పుకార్లు చిత్రంగా పుడతాయి. మన గంటందొర పూజారి సీతారామరాజు పితూరీనాటి గంటందొరేనా అని ఒకరు నన్నడిగారు పాడేరులో. నాకు నవ్వొచ్చిందా యన అమాయకత్వానికి. ఆ గంటందొరకి మన పూజారి గంటందొరకీ ఒక తరం అంతరం. అలాగే చింతపల్లిముందు రాజు పాకల అనే గూడెం ఉంది. మీకూ తెలుసు. మన గూడెం పేరూ రాజు పాకలే. దీనికదే పేరెందుకు పెట్టారో అని నాకూ సందేహంగానే ఉండేది మొదట్లో. మొట్టమొదట ఇక్కడ గుడెసె వేసింది సత్యరాజు అనే కొండదొరట. అందుకని దీన్ని సత్యరాజు పాకలనేవారుట. తరువాత అది కాస్తా రాజు పాకలయింది. సరే అదలా ఉంచండి.

మనుషులకి ఆశ ఎక్కువ. సులభంగా సంపాదించటమంటే మోజు. నాగరికులు కష్టపడకుండా సంపాదించెయ్యాలని ఆశ పడతారు. సులభ సంపాదన. తేలిక ఆర్జన... ఈజీమనీ... అంటారు"

ఎవరో గుసగుసలాడారు. "మన బీమన్న దొరకింగిలీషు కూడా వొచ్చునొరే"

దానికి పూజారి జవాబు చెప్పాడు. "దూరపు కొండలు నునుపూ... దగ్గర కొండలు గరుకూ. బీమన్న ఎంత పండితుడో మీకు తెలియదు. ఈ గూడెంమీద అభిమానంతో ఇక్కడుండిపోయాడు. కానీ ఎన్నో విషయాలు తెలిసినవాడు. పేపరు చదువుతాడు. పది విషయాలూ తెలుసుకుంటాడు. ప్రెపంచజ్ఞానం పెంచుకుంటాడు. అతనికదే కాలక్షేపం. మనకోసమని మన స్తాయికి దిగి మాట్లాడతాడు కానీ అతనికెంతో బాషొచ్చు. పెద్ద పెద్దోళ్లనే నిలదియ్యగలడు తన జ్ఞానంతో. అంత తెలివైనవాడు మనమధ్యుండడం మనదృష్టం. అతను చెప్పేది జాగర్తగినండి" అని మందలించాడు పూజారి.

మళ్లీ చెప్పసాగాడు బీమన్న. "ఇప్పుడు టౌన్లవాళ్లేమనుకుంటున్నారంటే - కొండల్లో వజ్రపురాళ్లు దొరుకుతాయనీ. అందుచేత కొండలని తవ్వించాలని. మననే కూలీలుగా వేసుకొంటారు తవ్వకం పనికి. కాని కూలి దొరుకుతుందన్న ఆనందం కొద్దీ ఆ పనికంగీకరించామో మనకొండలూ అడవులూ మనకి మిగలవు. అంటే మన బతుకులే మనకి మిగలవు. అదేకాక ఇంకో ప్రమాదముంది. ఆమధ్య ఒక చోట ఇలాగే కొండని తవ్వుతూంటే చరియకూలి ఎందరో కూలీలు చచ్చిపోయారు. అసలవి వజ్రాలరాళ్లు కానే కాదని చెబుతున్నారు విజ్ఞులు. ఒరిస్సా నుంచీ అక్కడినుంచీ వచ్చారు వర్తకులు. అత్యాశాపరులయినవారు రావడంతో మన గూడెంలోనూ, అడవిలోనూ... మన జీవితాలలోనూ అనుకోని చెడుమార్పులు వొస్తాయి. తాత్కాలిక లాభంకోసం చూసుకుంటే శాశ్వత నష్టం భరించవలసి ఉంటుంది. ఇది ఆలోచించండి. మిమ్మల్నెవరేనా ప్రలోభపెట్టవొచ్చు అటువంటి ప్రలోభాలకు లోనుకాకండి. పైవాళ్లెవరు ఈ విషయంలో వొచ్చినా పూజారితో మాట్లాడమని ఆయన దగ్గరకు తీసుకురండి"

శ్రోతల్లోంచి ఒకరన్నారు, "పెద్దలకి చెప్పకుండా ఎప్పుడేనా ఏదేనా చేశామేమిటి మేము సొతంత్రించి? "

దానికి జవాబు పూజారి చెప్పాడు. "నిజమే... బీమన్న ఎందుకైనా మంచిదని ముందుజాగ్రత్తగా చెప్పాడు తప్ప మీ గురించి కాని మన గూడెం కట్టుబాట్ల గురించి తెలియకా కాదు, మీ మీద నమ్మకం లేకా కాదు. అందుచేత మరోలా భావించకండి. మనవాళ్లు, మన సందుడూ వాళ్లూ వేటకెళ్లి రెండు కొండ మేకలని కొట్టుకొచ్చారు. మాంసం పంచుతారు. వరసకట్టండి"



సందుడు, అతని అనుచరులూ తుపాకులు, ఈటెలు, బరిసెలు పట్టుకుని ఒకవారగా నిలుచున్నారు.

"ఈటె పట్టుకుని ఈశ్వరుళ్లాగే ఉన్నాడు"

వేటగాళ్లను రకరకాలుగా అభినందిస్తూ వాళ్లందిస్తున్న మాంసాన్ని తీసుకున్నారు. ఆకులలో ఆ మాంసాన్ని పొట్లాలుకట్టి ఇళ్లకు పట్టుకెళ్లారు.

★ ★ ★

మద్ది చెట్టు దిగువనున్న వృత్తాకారపు ఆరుబయలు జాగాలో, ఆ సాయంత్రం చుట్టుపక్కల గూడేల గిరిజనులందరూ చేరారు. పదిహేనేళ్లు పైబడినవారినే రమ్మన్నా చిన్నవాళ్లని కూడా వెంటబెట్టుకు మరీ వొచ్చేశారు. పట్నంనుంచి వొచ్చిన వాళ్లీసారి చాలా పెద్దవి ఎక్కువ సంచీలే తెచ్చారు. గంటందొర వాళ్లతోపాటే నిలబడ్డాడు.

"అందరు వొచ్చినట్లేనా?"

"ఊఁ..." అరిచాయి వందల కంఠాలు.

"మరి సబ ప్రారంబించేదా? పెద్ద మనుసులు తొందరపడుతున్నారు"

"ఓ..." వందల గొంతులు.

"వారేటి సెబుతారో జాగర్తగా వినండి"

"ఆఁ..."

"సోదరసోదరీమణులారా!" ప్రారంభించాడు పట్నపాయన. ఆయన మంచిబట్టలతోనూ పెద్ద బొజ్జతోనూ అధికారిలా కనిపిస్తున్నాడు. అతనితో వొచ్చిన ఇద్దరూ ఆయనకు సహాయకుల్లా ఉన్నారు.

"మేమిక్కడకు రెండు ముఖ్యమయన పనులమీద వొచ్చాం. మేము ప్రభుత్వోద్యోగులం. ప్రభుత్వమంటే మీకు తెలుసుకదా? ప్రజల సేవకోసం ఏర్పడినది. ప్రజలందరూ సుఖసౌఖ్యాలతో వర్ధిల్లాలనే ప్రభుత్వకాంక్ష. అందుకు ప్రజల సహకారం కూడా అత్యవసరం. కాశ్మీరంనుంచి కన్యాకుమారివరకూ అంతా సువిశాల భారతదేశమే. గిరిజనులయిన మీరూ... సముద్రతీరంలో ఉండేవారూ, ప్లేన్స్‌లో ఉండేవారూ ప్రతివొక్కరూ భారతీయులే. ప్రతివారిదీ ఈ దేశమే. శతాబ్దాల తరబడి పరులపాలనలో ఉండడంవలన మనదేశం ఎక్కువ అభివృద్ధి సాధించలేకపోయింది. అభివృద్ధంటే అందరి సుఖమూ. మనమందరమూ భారతీయులం. మనందరమూ ఒకటి. మనదేశం త్వరితంగా అభివృద్ధి సాధించాలంటే పారిశ్రామికంగా ప్రగతి సాధించాలి. పరిశ్రమలే విద్యుచ్ఛక్తి. రవాణా సౌకర్యాలు, రహదారులు. ఈ ప్రాంతంలో ఒక ప్రాజక్టుని నెలకొల్పాలని ప్రభుత్వం సంకల్పం. దానివలన విద్యుత్తు ఉత్పత్తవుతుంది. విద్యుత్తుంటే చాలా ఉన్నట్లే. ఎన్నో ఊళ్లకి వెలుగు. ఎన్నో పరిశ్రమలకు ప్రాణం. ఎందరికో ఉపాధి. ఎంతో పురోభివృద్ధి.

విద్యుదుత్పత్తికి అన్నివిధాలా అనువయిన ప్రదేశమిది అని నిర్ధారించబడింది చాలా పరిశోధించినపిదప. అదలా ఉంచండి. ప్రపంచమూ... మనదేశంలోని యితర ప్రదేశాలూ ఎంతో నాగరికంగా తయారౌతున్నాయి. విద్య... ఉపాధి... సదుపాయాలు... జీవనప్రమాణం వీటన్నిటిలోనూ వాళ్లెంతో ముందున్నారు. మీరీ కొండలమీద చదువులేక, ఆరోగ్యంలేక, సుఖంలేకుండా మగ్గిపోతున్నారు. ఇప్పటికే షెడ్యూల్డ్ ట్రయిబ్స్‌కి ఎన్నో సదుపాయాలూ సౌకర్యాలూ కలుగ జేస్తూంది ప్రభుత్వం వారినుద్ధరించాలని. కాని, గిరిజనులు ఆ సదుపాయాలను సంపూర్ణంగా అందుకోవడం లేదు. గిరిజనులు కూడా జాతీయ జీవన స్రవంతిలో కలసినప్పుడే దేశం నిజంగా అభివృద్ధి చెందినట్లు. అందుకే ప్రభుత్వం మీ శ్రేయస్సూ భవిష్యత్తూ కాంక్షించి ఒక ప్రణాళిక అమలుపరచ బూనుకుంది. దాని ప్రకారం మీరందరూ కొండ దిగువ గ్రామా

లలోకి వెళ్తారు. అక్కడ ప్రభుత్వం మీకు పునరావాసం కల్పిస్తుంది. మీ పిల్లలకు ఉచిత విద్య. పాఠశాలలలోనూ ఉద్యోగాల్లోనూ మీకు కేటాయింపులు. ఉండడానికి యిల్లు, వైద్యసదుపాయం. ఒకటేమిటి, సర్వమూను. అయితే... మీరిక్కడి ఇళ్లూ వాకిళ్లూ వొదులు కోవలసి ఉంటుంది కనుక అందుకు పరిహారంగా తగిన డబ్బు చెల్లిస్తారు. ఇక్కడ ప్రాజక్టు నిర్మాణంలో మీకు పనులు దొరుకుతాయి. ప్రాజక్టు పూర్తయ్యాక కూడా మీకు అర్హతలుంటే ప్రాజక్టులో ఉద్యోగాలు దొరుకుతాయి. మీకు భూములుంటే వాటి పట్టాలు సమర్పిస్తే భారీ పరిహారాలు నగదు రూపంలోనూ... దిగువ గ్రామాలలో స్థలాలరూపంలోనూ చెల్లించబడతాయి. ఇంకా ఎన్నోవిధాలుగా మీకు లాభాలు అందించబడతాయి. ఒక్క ముక్కలో చెప్పాలంటే మీ జీవితాలే మారిపోతాయి. మీతోపాటు దేశమూ ముందుకి నడుస్తుంది. ఇక్కడ తలపెట్టినది సాధారణమయిన ప్రాజక్టు కాదు. సకలార్థ సాధకమనడం అతిశయోక్తి అవవొచ్చు కాని కచ్చితంగా బహుళార్థ సాధకమే. మీ అందరికీ యిదొక మహత్తర అవకాశం. దేశం కోసం... దేశ సౌభాగ్యంకోసం... మీవంతు త్యాగం మీరు చేయగలగడానికిది అవకాశం. మీ సోదరులయిన భారతీయుల కోసం. మీ సోదరీ సోదర భారతీయుల కోసం ఉడతా భక్తిగా సహాయమూ త్యాగమూ చేయడం ఎంత గొప్పపని! ఒక్కసారాలోచించండి. బలవంతమేమీలేదు. తొందరేమీలేదు. మళ్ళీ కొన్నాళ్ళు కొన్ని నెలలు పోయాక మేము వొస్తాం. అప్పటికి మీరు అందరూ ఒక మాటకీ ఒక అభిప్రాయానికీ వొచ్చి.. ఆ ఏకాభిప్రాయాన్ని మాకు తెలియజేద్దురుగాని. మీరెంత త్వరగా నిర్ణయానికి రాగలిగితే అంత మంచిది. ప్రభుత్వానికి మీరంటే ఎంతో ప్రేమ. అందుకే మీకీ సువర్ణావకాశమిస్తూంది. జాగ్రత్తగా ఆలోచించుకుని అంగీకారం తెలపండి. ఈ ప్రాజెక్టు పూర్తికావాలే కాని దేశ స్వరూపమూ మీ జీవితాలూ పూర్తిగా మారిపోతాయి"

ఒకసారాగి సహాయకులవేపు చూశాడు. వారిద్దరిలోనూ ఒకరు ముందుకొచ్చి "ప్రభుత్వం మీపట్ల ప్రేమతో కొన్ని కానుకలు పంపింది. ఒక్కొక్కరూ వచ్చి దయతో స్వీకరించ ప్రార్థన" అన్నాడు. అప్పటికే అతని పక్కన పొట్లాలు గుట్టలుగా పేర్చబడి ఉన్నాయి. ఒక్కొక్క ప్యాకెట్టులోనూ-రొట్టె, బిస్కట్లు, ఉప్పు, అగ్గిపెట్టె, కేకు, వెన్న, చిన్నచిన్న పొట్లాలలో ఉన్నాయి.

పొలోమంటూ ఎగబడ్డారు గిరిజనులు వాటిమీదకి. గంటందొర గద్దించాడు. "పశువులమాదిరి ప్రవర్తించకండి. మనిషి మాదిరి వరసకట్టండి" ఆ గద్దింపుతో వారు వరస కట్టారు, గంటందొర వృద్ధుడే కావొచ్చు కాని అతనింకా పూజారే. మామూలు పరిభాషలో 'నాయకుడు'లాటిది కొండభాషలో పూజారి అంటే. నిజానికి మామూలు నాయకుడికి లేని ఎన్నో అధికారాలూ బాధ్యతలూ పూజారివి. అది వంశ పారంపర్యంగా, వారసత్వంగా సంక్రమించే పదవి. ఒక వంశంలో అంతవరకూ వారసత్వంగా వస్తున్న కుటుంబంలో పూజారి పదవి. చేపట్టవలసిన వాడు కాదంటే తప్ప, తను చేయనంటే తప్ప ఆపదవి మరొకరికి వెళ్లదు. అలాటప్పుడు గూడెం పెద్దలు నలుగురూ చేరి పూజారికి అర్హుడయిన వాడిని నిర్ణయిస్తారు. చావడి - గ్రామాలలో రచ్చబండనే గూడేలలో చావడి అంటారు. ఆ చావడిలో పెద్దలు చేరి కొత్త పూజారిని తేల్చుకుంటారు. పూజారిని అందరూ గౌరవిస్తారు. అతని మాటకు అమిత విలువిస్తారు. చివరిమాట అతనిదే ఔతుందేవిషయంలో అయినా. కాని... సాధారణంగా ఏ విషయాన్నయినా నలుగురు పెద్దల అభి

ప్రాయం స్వీకరించి మాత్రమే తప్ప అధికారమున్నది కదా అని ఏక పక్ష నిర్ణయాలెన్నడూ చేయడు ఎంతో అవసరమయితే తప్ప. ఏకపక్ష నిర్ణయం కాకపోయినా తీవ్రమయిన నిర్ణయం తీసుకోవలసిన పరిస్థితి ఒకేసారి ఎదురయింది పూజారి జీవితంలో. అది- రెండేళ్ళకిందట.

★ ★ ★

ఆవేళ మధ్యాహ్నమౌతూంటే వొచ్చారు వారు.

నిలువునా తెల్ల ముసుగేసుకుని ఉన్నారా యిద్దరూ. ఒకరిద్దరు చిలిపి బుడ్డోళ్లు, తెల్లదెయ్యాలని అరిచారు కూడా వారిని చూసి. వారినెవరో పూజారివద్దకు తీసుకువొచ్చారు. ముఖం నలుపు, జుత్తు తెలుపు, మెడ దిగువనుంచీ అతి తెల్లని అంగరఖాలాటి దిరేసు (డ్రెస్). బుడ్డోళ్ళు ఆ తెల్ల జుత్తులని తమాషాలా చూస్తున్నారు. సహజమే. ఎందువలననో కాని, గిరిజన స్త్రీలకు కాని పురుషులకు కాని చనిపోయేవరకూ కూడా జుత్తు తెల్లబడదు, ఊడుతుంది తప్ప. అందుచేత అక్కడివారికి తెల్ల జుత్తుని చూసేసరికి చిత్రంగా అనిపిస్తుంది. పెద్దలయితే మర్యాదకోసమని తమ ఆశ్చర్యాన్నణచుకుంటారు. పిల్లలకి హద్దులేముంటాయలాటివి? సహజత్వం ప్రదర్శించేస్తారు. జంకూ గొంకూలేకుండా.

"నా పేరు శామ్యూల్ జాన్సన్. వీరు జాన్ జకరయ్య. ఈయన జోసెఫ్‌రావ్. మేము క్రిష్టియన్ మిషనరీకి చెందిన వారం. ఫాదర్లం. మీతో మాట్లాడాలని వొచ్చాం" అన్నారు పూజారికి నమస్కరించి.

పూజారి వారికి ప్రతినమస్కారాలు చేసి వెదురు చాపమీద ఆసీనులను చేశాడు. ఎవరినో పిలుచుకురమ్మని కుర్రవాడిని తోలి "నడచి అలసి ఉంటారు. జీలుగు కల్లు సేవిస్తారా? " అనడిగాడు.

గిరిజనులు చేయగల అతిపెద్ద మర్యాద పానీయం అదే. ఆ ప్రాంతాలలో ఇప్ప సారా అరుదు.

"వలదు. మేము దేవుని బిడ్డలము. మేము మద్యము ముట్టము"

"దేముని బిడ్డలు కానివారెవరు! జీవులన్నియూ దేవుని సృష్టేకదా? గొర్రె పాలు తీసుకుంటారా? " అడిగాడు పూజారి.

అప్పుడే యిద్దరు పెద్దలక్కడికి వచ్చారు.

"భీమన్న... సత్తెమయ్య" అని వారిని పరిచయం చేశాడు.

"వలదు. మంచి నీరము కొంచెమిచ్చిన చాలును. ప్రభు కార్యము పై వచ్చుటచేత దూరము నడచిననూ, మేమేమియు అలసట చెందలేదు. అదియే ఏసు మహిమ"

"పాపములు చేయు మానవుడా! నీ భారమును ఏసుయందు మోపుము. అతడు వహించును. నీ పాపములనతడు గ్రహించును" అన్నాడు జాన్ జకరయ్య. కుర్రవాడి చేత ఆనప బుర్రలోని మంచినీళ్ళు అల్యూమినియం గ్లాసుల్లో యిప్పించి,

"మీరు వచ్చిన పని చెప్పండి" అన్నాడు పూజారి.

★ ★ ★

"ప్రపంచమునకు, సృష్టికి ఏసు యొక్కడే ప్రభువు"

"ఏసు యీశు ఒక్కరే పేరులోనే కొంత యాస" అన్నాడు భీమన్న.

"అటులకాదు. క్రిస్ట్ వేరు, క్రిష్ణుడు వేరు" కలుగ జేసుకున్నాడు జోసెఫ్‌రావ్?

"మీరెందుకెటుల వేరుగా చూస్తున్నారో కాని క్రీస్తూ క్రిష్ణుడూ ఒక్కటే. క్రిష్ణుడని పలకడానికి కష్టంగా ఉండి క్రీస్తు అంటూ వచ్చి ఉంటారు అన్నాడు భీమన్న! అతనికి కొంచెం చదువొచ్చు మతపరమయిన విషయాలు కొంతమేరకు తెలుసు.

"అహహ... గుర్రాన్నీ గాడిదనీ ఒక

రాటకు కట్టేయకండి. ఏసు సర్వజగద్రక్షకుడు. ఒక బుట్టెడు చేపలను పదునాలుగు బుట్టలను చేసెను. మేరీకన్య గర్భమునందు జనించెను. రొట్టెలేనివారికి రొట్టెనిచ్చెను"

మామూలుగా అయితే బీమన్న శాంత మూర్తే. రెచ్చగొడితే మాత్రం మనిషికాదు. ఆ వయసులో కూడా "నిజమే. కృష్ణుణ్నీ క్రీస్తునీ ఒక రాటకు కట్టడం నా అపరాదమే. క్రిష్ణుడు అలోకంబగు పెంజీకటికవ్వలనేకాకృతి వెలుగువాడు. బుట్టెడు చేపలను పధ్నాలుగు బుట్టలు- మోళీవాళ్లూ చేస్తారు. బాబాలూ చేస్తారు. అందుకు దేముడు దిగిరానక్కర్లేదు. రొట్టెకంటె అపరిమిత విలువకల భక్తినీ ముక్తినీ ప్రసాదించాడు మా క్రిష్ణుడు. కన్యాగర్భంలో జన్మించడమే ఘనమయితే కృష్ణుడివరకూ అక్కర్లేదు. మా కర్ణుడు చాలు. అసలు, కన్యగర్భవతి కావడమేమిటి? ఊ మీరెందుకొచ్చారింతకీ? "

"మీపై ఏసు కృపని ప్రసరింపజేయుటకు. మిమ్ములను ఏసు కటాక్షమునకు పాత్రులను జేయుటకు. మిమ్ము కొత్తగా రక్షించుటకు"

"అవి ఏవియును మాకక్కరలేదు. ఈశ్వరుని కృప భూమీద యిప్పటికీ ఉంది. దైవ కటాక్షం లభిస్తూనే ఉంది. మేము పాతగానే రక్షింపబడుతున్నాం కనుక కొత్తగా రక్షించబడవలసిన అవసరము లేదు"

హటాత్తుగా జాన్ జకరయ్యా విషయం మార్చాడు. "మీరు గిరిజనులు పరమదారిద్ర్యమున కొట్టుమిట్టాడుచున్నారు. మీకు విద్యలేదు. వైద్యసదుపాయము లేదు. సరియగు తిండి లేదు. మీరందరూ మా మతము తీసికొనినచో మీకు యిక్కడ పాఠశాలలు కట్టించెదము. వైద్యశాలలు నిర్మించెదము. మీకు ధనమును కూడా యిచ్చెదము"

"ఆమధ్య ఎన్నికల ముందు చాలామంది ఇలాగే వాగ్దానాలు చేశారు. ఆశలు కొలిపారు. వారి మాటలు, మీ మాటలు ఒకే తీరున ఉన్నాయి. కాకపోతే వారు పార్టీ అన్నారు, మీరు మతమంటున్నారు. అంతే తేడా"

"మా మతములో చేరినచో మీ కన్నియు లాభములే. విదేశములనుండి నిధులు తెప్పించి మీ ప్రాంతమునూ ప్రజలనూ అభివృద్ధి పరతుము. మీరు చేయవలసిన దొక్కటే. ఏసుయందు విశ్వాసముంచి బాప్తిస్మము తీసుకొనుట. అందువలన యిహలోకమునందును పరలోకమునందును కూడా మీరు రక్షించబడుదురు. రండు... మా మతమును చేరుడి"

"అది మాకు సమ్మతము కాదు. భుక్తి కోసం భక్తిమార్గం మార్చుకునే బలహీనమనస్కులం కాము. మాకు మా మోదకొండమ్మ మొదలు ఎందరో దేవుళ్ళూ దేవతలూ ఉన్నారు. ఇంకా కొత్త దేవుళ్ళని మేమూ మా మతమూ భరించలేము"

"మీరు క్రీస్తుమతము స్వీకరించనిచో సాతాను బిడ్డలయి నరకమునకు పోవుదురు. పాపులను రక్షించువాడు ఏసు యొక్కడే" అని ఒకతను పాట మొదలుపెట్టాడు. మిగిలిన యిద్దరూ కూడా గొంతులు కలిపారు.

"పాట బాగానే ఉంది. ఏ భక్తుడు ఏ దేవుడి గురించయినా పాడుకోవొచ్చు. గీతం మతాతీతంగానే ఉన్నట్లుంది"

"చూశారా మామతంలో ఎంత మంచి పాటలున్నాయో?! అందుకే మీరూ చేరండి. ఇంకా ఎన్నెన్నో మంచి పాటలూ... ప్రార్థనలూ నేర్చుకోవొచ్చు ఎంతో బాగుంటుంది ఆదియందు వాక్యముండెను"

"ఆదియందు ఏమీలేదు. శూన్యం. నిశ్శబ్దం. నిశ్శబ్దంనుంచి ఓంకారం పుట్టింది.

సంగీత సాహిత్యాలకి మూలమూ బీజమూ ఓంకారం. అక్షరం, పదం, వాక్యం, అదీ క్రమం. అందుచేత ఆదియందే వాక్యముండే అవకాశంలేదు"

"మీరు మా మతమును, మతగ్రంథ మగు... పవిత్ర గ్రంథమగు బైబిలునే విమ ర్శించుచున్నారు. అది వలదు. ఎంతో గొప్పదియుగు మా మతమును..."

"దయచేసి ఆగ్రహించకండి. ఏ మతమూ మానవత్వమును మించగలదికాదు. మీరు సర్వమానవులను ఒకటిగా చూడలేక మీ మా మతబేధములను పాటించుటయే మీ స్థాయిని సూచించుచున్నది. సర్వమత ములూ, వాని సారమూ ఒక్కటే"

"కాదు... మా క్రిస్టియానిటి అన్నిటికంటే గొప్పది. మా ఏసు"

భీమన్న యిక సహనం నిలుపుకోలేకపో యాడు. "మీకు మీ మతము గురించి తెలి యదు, హిందూ మతము గురించి తెలి యదు. ఈమధ్యనే క్రీస్తు కాశ్మీర ప్రాంత మున పెరిగినాడనో సంచరించినాడనో పరి శోధకులు అభిప్రాయపడినట్లు వింటిని. క్రీస్తు క్రిష్ణుల పదములందు... నామములందేకాక వారి కథలు లేదా జీవి తములందలి సామీప్యసారూప్యములను కూడా గమనించండి.

పుట్టుకకు ముందే వారిరువురూ ప్రభువు లకు శత్రువులు. క్రిష్ణుడు- కంసునకు; క్రీస్తు- హేరోద్ రాజుకి; ఇద్దరూ కూడా గృహంలో జన్మించలేదు. క్రిష్ణుడు చెరసా లలో, క్రీస్తు గొర్రెల సాలలో. ఇరువురూ స్వస్థానానికి దూరంగా పెరిగారు. ఇద్దరూ మహిమలు చూపారు. మానవాళిని దయతో చూశారు. ఏసు ఒక బుట్టెడు చేప లను పధ్నాలుగు బుట్టల చేపలు చేస్తే, క్రిష్ణుడు తానే పదహారు వేలమంది క్రిష్ణులై గోపికలందరితోనూ ఏకకాలమందు రాసలీల జరిపాడు. క్రీస్తు గుడ్డివానికి దృష్టినిస్తే, క్రిష్ణుడు ధృతరాష్ట్రునకు దృష్టినిచ్చాడు. కుబ్జ అనే అష్టావక్రకు, గూని మహిళకు, కురూ పికి సురూపమిచ్చాడు. ఏసు సముద్రాన్ని పాయలుగా విభజిస్తే- క్రిష్ణుడు గోవర్ధన పర్వతమెత్తి ప్రకృతికంటే తానధికుడనే భావం కలిగించాడు. క్రిష్టియన్ మతానికి ఓల్డ్ టెస్టమెంట్ ఉంటే హిందూమతానికి అపౌరుషేయాలయిన వేదాలు; సర్వవేదసా రమయిన ఉపనిషత్తులు ఉన్నాయి. ది టెన్ కమాండ్‌మెంట్స్‌కి సమాంతరమనదగి నది భగవద్గీత. ఏసు గొర్రెలకాపరి అయితే క్రిష్ణుడు గోవులకాపరి. ఇలాగ వారిరువురూ ఒకరేనేమో అనిపించే అంశాలెన్నో ఉన్నాయి. ఒకే ప్రధానమయిన విభేదం మాత్రముంది"

పూజారి గంటందొర అప్రతిభుడై పోయాడు భీమన్న చెప్పే విషయాలకూ అతని భాషకీ... ఆ కంఠంలోని సాధికార తకీ. అతను చదువుకున్నాడని తెలుసు కానీ... యింత విద్య ఉందా! ఇంత పాండి త్యమా!

క్రిష్టియన్ మిషనరీస్ స్థితి కూడా దాదాపు అలాగే ఉంది. ఒక కొండవాడి కింత జ్ఞానమా! ఇటువంటి భాషా! ఇంత విషయ పరిజ్ఞానమా! ఆశ్చర్యంలోంచి తేరు కోకుండానే అడిగాడు, శామ్యూల్ జాన్సన్. "ఏమిటా బేధం? "

"క్రీస్తు దేవదూత మాత్రమే. క్రిష్ణుడు దేవ దేవుడూ దేవాధి దేవుడూ"

తెల్లమొహాలు వేశారు ముగ్గురూ. వారిని చూస్తూనే జాలిపడుతూనూ మెల్లగా అన్నాడు భీమన్న. "ఎవరికి నచ్చిన మతం వారనుసరించడం తప్పేమీ కాదు. సర్వమ తాల ధ్యేయమూ మానవతే. అయితే... ఒక మతం గొప్పతనం దానిననుసరించే వారి సంఖ్య ననుసరించి ఉంటుందనుకోడం సరయినది కాదు సరికదా అలాటి మతం

వెనుక రాజకీయమూ రాజ్యాధికార కాంక్షా వంటిది కలదేమో అనే సంశయాలకు తావి స్తుంది. మీరు అన్యథాభావించవనంటే నాకు జీర్ణంకాని కొన్ని వాస్తవాలు చెబుతాను. క్రిష్టియన్ మతస్థులు ప్రజలకోసం ఆసుప త్రులు కట్టించడమూ, రోగులకు సేవచేయ డమూ మెచ్చదగినవే. కాని తమదేవుడిని... ఏసుని ప్రార్థిస్తేనే... మతం తీసుకుంటేనే రోగాలు నయమౌతాయని బోధించడం ధర్మం కాదు. ఒక క్రిష్టియన్ ఆసుపత్రిలో నా అనుభవమిది. ఇక విద్యాలయాలలో విద్య బాగానే బోధిస్తారు కానీ... దానిలో మతపరమైన అంశాలు ఎక్కువట. మనదే శంలో ఎక్కువమంది విదేశీ నిధులకోసం యీ మతం తీసుకోడమూ ప్రచారం చేయ డమూ సంఖ్య పెంచడమూ గావిస్తున్నారని కూడా... "

జాన్ జకరయ్య అతని మాటలకడ్డుప డ్డాడు. "పూజారి గంటందొర గురించి మేము విన్నాం కనుక పనికట్టుకుని యింత దూరం వొచ్చాం. వారేం చెబితే అంతట యిక్కడా చుట్టుపక్కల గూడేల్లోనూ కూడా. కనుక వారొకమాట అనాలేకాని మా పని అతిసులువౌతుంది. జాగ్రత్తగా వినండి. మీరు ఎంతమందిని మా మతంలో చేర్పిస్తే అన్నివేళ్ళు. అదనపు సౌకర్యాలెలాగూ ఉంటాయి. లోతుగా ఆలోచిస్తే, మతంకంటే దేముడికంటే కూడా డబ్బే సత్యం. దానిదే మహత్యం అది లేకనే మీరిలా ఉన్నారు"

గంటందొర అంతవరకూ చావడిలో సమావేశమేర్పరచి నలుగురి అభిప్రా యాలూ తెలుసుకుని నిర్ణయిద్దామనుకుంటు న్నవాడల్లా లేచి నిలబడ్డాడు. "దయచేసి మీరు తక్షణం వెళ్ళిపోండి. మరొక్కక్షణం మీరిక్కడున్నా మర్యాద దక్కదు. మేము అనాగరికులమూ ఆటవికులమూ. డబ్బు కోసం మతాన్నీ మనసునీ అమ్ముకొనే ఎత్తుకి మేమింకా ఎదగలేదు" అని భీమన్న చేయందుకుని... "భీమన్నా! మతపరంగా కూడా నేను గూడేనికి నాయకుడినే. నేనే యిటువంటి మాటలు విన్నందుకు ఏం ప్రాయశ్చిత్తం చేసుకోవాలో చూడు" అంటూ లేచాడు.

అతని వైఖరి చూశాక వారు భయంతో వేగంగా బయటకు పోయారు. అదిగో... అప్పుడు, చావడిలోకాక తన యింట్లో భీమన్న సత్తెమయ్యలతో కలసి దాదాపు ఏకపక్ష నిర్ణయం అనదగినట్లు నిర్ణయం చేశాడు. సత్తెమయ్య నిట్టూర్చాడంతవరకూ జరుగుతున్నది చూస్తూనూ వింటూనో ఊరుకున్న వాడల్లా, "చివరకి కొండలని కూడా ఒగ్గరు కాబోలు ఈ రాజకీయాలోళ్లూ, మతాలోళ్లూ"

"మీ మనసులు బరువెక్కిపోయినట్లు న్నాయి జరిగినదానికి. నవ్వొచ్చే ఒక విషయం చెబుతాను వినండి. పర్వతారోహ కులు ఎవరెస్ట్ ఎక్కడానికి మహాపట్టుదలగా బయలుదేరారట. అంతవరకూ ఎవరూ శిఖరంమీదకు చేరలేదు. తామే మొదటివా రుగా ఘనత కొట్టెయ్యాలని పంతంగా ఎక్క సాగారు. అష్టకష్టాలూ పడి ఎలాగైతేనేం కాంచనగంగ శిఖరంమీద కాలు మోపేసరికి, "హాట్ కాఫీయా, ఇడ్లీ సాంబార్ కూడా యిచ్చేదా?" అంటూ అడిగాడట ఓ తమి ళుడు స్వాగతం చెబ్తూ. ఇప్పుడైతే తమిళుడి తోపాటు రాజకీయంవాడూ మతంవాడూ కూడా స్వాగతం చెబుతారేమో? "

★ ★ ★

"మళ్ళీ వొస్తాం. మేం చెప్పిన విషయం ఆలోచించి ఉండండి. అనుకూలంగా ఆలో చించాలి మరి" అని అధికారులు పూజారి దగ్గర శెలవు తీసుకుని వెళ్ళిపోయాక పూజారి యింటినుంచి వొచ్చాయి బస్తాలతో సారా ప్యాకెట్లు. అవి ఆ అధికారులు తెచ్చిన కానుకే. ఆ వాసన పసికట్టడమే



మిటి, అక్కడివారందరూ "సారా! సారా!" అంటూ గంతులేశారు. వాళ్ళ ఆనందానికి పట్టపగ్గాలులేవు. ఎందుకనో మరి, గిరిజనులకీ సారాకీ గాఢమయిన లంకె. జీలుగు కల్లు... ఈత కల్లు. తాటి కల్లు... యిలాగ ఏ కల్లు దొరికితే అదేరోజూ పట్టిస్తూ ఉంటారు. అయినా సారా అనేసరికెక్కడి లేని సరదా. ఏ శ్రీరామనవమికో భద్రాచలం వెళ్లారో విధిగా విప్పసారా తాగి తీరుతారు. జీలుగు చెట్టు పెద్ద యీత చెట్టులా ఉంటుంది. దాని కాండంనుంచి కల్లు తీస్తారు. జీలుగు చెట్టు ప్రతి యింటా ఉండదు. అది మంచి ఆదాయమార్గం. జీలుగు కల్లు ఖరీదుతోపాటు హోదాకలదీ కూడా. అయితే పాడేరు పరిసరాలలో విప్ప చెట్లు పెరగవు. అవి చాలా ఎత్తుగా ఏభైఅరవై మీటర్లు కూడా పెరుగుతాయి. దాని పువ్వు భద్రాచలంలో రాముని ప్రసాదంగా కూడా యిస్తారు, అమ్ముతారు. తీపి, వగరు కలసిన రుచి దానిది. కొన్ని వంటకాలలో కూడా వాడతారు కానీ, ప్రధానంగా సారా తయారీకే వాడతారు. ఇప్ప, విప్ప అని రెండు విధాలుగానూ ఉదహరిస్తారు. స్కాచ్ విస్కీ ఎలాగో... సారాలలో విప్ప సారా అటువంటిది. నాగరికులు కూడా అది దొరికితే దానికెగబడతారు. పిల్లా, పెద్దా, ఆడా, మగా, అందరూ సారా సేవనంలో మునిగిపోయారు. పూజారి వివిధ గూడేల పెద్దలనూ ఒక మూలకు పిలిచాడు. సంకుదేవుడు (గిరిజనుల దేముడు) విగ్రహం వెనుక వారిని కూర్చోబెట్టాడు. అక్కడొక సమావేశం ఏర్పాటయింది. భీమన్ననీ సత్తెమయ్యనీ పక్కన కూర్చోబెట్టుకుని వాళ్ళకి యిలా చెప్పసాగాడు, "వాళ్ళు చెప్పింది మీరు వినీ ఉంటారు, అర్థంచేసుకునీ ఉంటారు. వాళ్ళనేదేమిటంటే, మనమంతా కొండ దిగిపోవాల. ఖాళీచేసిపోవాలి. అందుకు ప్రెబుత్వం వాళ్లేవో యిస్తారు. మరి దీనికి మనవాళ్ళందరూ ఏం ఉద్దేశపడతారో పేరు పేరునా తెలుసుకోవాలి. ఎందుకంటే యిది శానా ముక్యమైన విషయం. ఇన్నాళ్ళుగా ఉన్న వూరి నొక్కసారొదులుకు పోడమంటే మాటలు కాదు. ఒకసారెళ్ళామో మరెనక్కి రాడానికుండదు. కొండ దిగి దిగువ స్థిరపడడమంటే సంబరం కాదు. దాన్లో సమస్యలు దాని కుంటయి. బతుకుతీరునే మార్చేసే విషయమిది. అంచేత, జాగ్రత్తగా ఆలోచించమనండి. వాళ్ళ మనసు విప్పి చెప్పమనండి. దాన్నిబట్టి ఆ ప్రభుత్వపోళ్లకి ఔననో కాదనో చెప్దాం"

అలాగే అన్నారు వాళ్లు. ఎవరి గూడెంలో వారు ప్రజాభిప్రాయం సేకరించడానికీ తరువాత రాజు పాకల నాయకుడికి చెప్పడానికీ ఒప్పుకున్నారు. అందరిలోకీ మావల్ల వెంకన్నే ఎర్రనన్నట్లు ఆ చుట్టుపక్కల గూడేలన్నిటికీ రాజుపాకలే పెద్దగూడెం మరి.

తరువాత ఆ పెద్దలు కూడా సారా పాకెట్లందుకున్నారు. సారా దగ్గర పూజారయినా ఒకటే సామాన్యుడయినా ఒకటే. ముఖ్యంగా... రాత్రి కార్యక్రమాలు విధిగా కల్లుతోనో సారాతోనో మాత్రమే ముగుస్తాయి. వారికది నేరమో అపరాధమో కాదు. తాగడమనేది వారి జీవితంలో భాగమే ఒకవిధంగా. అర్థరాత్రి దాటాక వారు ఆశ్రయం వెదుక్కున్నారు పడుకుందుకు. పై గూడేలవాళ్ళటువంటివేళ వెళ్లే ప్రశ్నలేదు. గూడెంనుంచి గూడేనికి సాధారణంగా అడవి తోవే అడ్డుతోవౌతుంది. చీకటి పడ్డాక అడవిలోంచి వెళ్ళే సాహసం చెయ్యరెవరూ. పులులుకాకపోయినా ఎలుగుబంట్లు, దుమ్మలగొండిలు లాటివి తిరుగుతుంటాయి. వాటినుంచి తప్పించుకోవడం కొండలలో తిరిగేవారికి సమస్యకాదు. వారికి భయమూకాదు. కాకపోతే పాములు మాత్రం వారికి పెద్ద గొడవే. అదీకాక

అడవి నిశ్శబ్దాన్నీ ప్రశాంతతనీ భంగపర చడం వారికిష్టముండదు. సామరస్యమే వారి జీవితవిధానం, సాధ్యమైనంతవరకూ. ఆతిధ్యంవరకూ గిరిజనులు అసాధారణులే. వారి జీవన సిద్ధాంతమే అటువంటిది. తిండికి పేదవారయినా మనసుకి మాత్రం మహా ఉదారులు. దగ్గర ఒక్క రూపాయి ఉన్నా దానిని ఖర్చుపెట్టి అనుభవించ డమో... ఎవరైనా అవసరంలో ఉంటే ఆదు కోడమో చేసేవరకూ వారికి తోచదు. వాళ్లకి రేపనేది లేనట్లే ఉంటారు.

పోడు వ్యవసాయం ద్వారా ఐతేనేం, మరొకలా అయితేనేం వారికి జనవరినుంచి ఏప్రిల్, మే మాసాలవరకే కడుపు నిండా తిండి. పంట చేతికి రావడమేమిటి, బంధు మిత్రుల నాహ్వానించి విందులు చేసుకుంటారు. వారిని సాగనంపేటప్పుడు కూడా వీలయినంతవరకూ వొట్టి చేతులతో పంపక ఏ గింజలో, ధాన్యాలో మూటకట్టి ఇచ్చి మరీ పంపుతారు. ఉన్నప్పుడు తిన డమూ అనుభవించడమూ అంతే. జూన్ నెలనుంచి వారికి గడ్డుకాలమూ, పస్తులకా లమూ ప్రారంభమౌతుంది. ఇక అప్పుడు వీళ్లు ఏదిపడితే అదే తింటారు. అప్పటివారి తిండిని తలుచుకుంటేనే హృదయవిదార కంగా ఉంటుంది.

చింతపిక్కలు కాల్చి, పైపొట్టు తీసి ఆ గింజలను పొడిచేసి దానితో అంబలి కాచుకు తాగుతారు. మామిడి పళ్లలోని జీడిని ఎండబెట్టి పొడిచేసి తోపలీ చేసుకుని తాగుతారు. చింతచిగురు, అలాగే కొన్ని ఆకులను ఉడికించి కషాయంలా చేసుకుని తాగి కడుపు నింపుకుంటారు. అప్పు దొరి కిందో వడ్డీ ఎంతయినా ఫరవాలేదు. అప్పు చేసి పప్పు కూడు తిన్నారే. జూన్ మాసం నుంచీ వాళ్లు అధికరేట్లకి డబ్బో, ఆహారధా న్యాలో అప్పు చేస్తూంటారు. పంట చేతికం దగానే ఎంతో కొంతవేసి చెల్లిస్తారు.

ఇదిగో ఇక్కడే నక్సలైట్లు వారి జీవితాల లోకి ప్రవేశించారు. గిరిజనులలో ఆస్తిపరు లంటూ ఎక్కువేమీ ఉండరు. సంవత్సరం పొడవునా తిండికి లోటు లేకపోతే ధనవం తుడి కిందే జమచేస్తారు. అలాంటివాళ్లు మహా అయితే గూడేనికొకరిద్దరుంటారేమో. వీళ్లు వసూలు చేసే వడ్డీలు అధికంగానే ఉంటాయి. రేపటికోసం దాచుకోకుండా ఎప్పటికప్పుడు సున్నకిసున్న, హళ్లికి హళ్లి చేసుకునే మనస్తత్వం కూడా వారి పేదరికా నికి కారణమే. తాగుడు సరేసరి. ఈ విశృం ఖల మనస్తత్వానికి గిరిజనులలో చాలా మందే బానిసలు. స్త్రీలూ, పిల్లలూ మగ వారూ... కటుంబమంతా కలిసే తాగు తారు సరిపడా కల్లుంటే. అందుచేత ఒకరు చెప్పడమూ, మరొకరు వినడమూ అనేదాని కాస్కారం తక్కువ. వాళ్లు కష్టపడడానికెలా వెరవరో సుఖపడడానికీ అలాగే వెనుకంజవే యరు. జీవితం క్షణికమూ, అశాశ్వతమూ. దంచినమ్మకి బొక్కిందే కూలి అన్న ధోరణి లోనే ఉంటారు వారు.

ఒకవేపు మగాళ్లతో కలిసి సారా తాగు తూనే ఆడవాళ్లు చీకులు (బాంబులు) తయారుచేస్తారు. మాంసంముక్కను పుల్లకి గుచ్చి నిప్పులో కాల్చడమూ దానిమీద ఇంత ఉప్పూ, కారం జల్లి తింటారు. కల్లుపాకల ముందూ సారాదుకాణాల ముందూ ఉంటూంటాయీ కవాబుల కుంపట్లు. వీళ్లు వేరుగా కుంపటంటూ పెట్టకుండా నేలమీదే కట్టెలు పరచి నిప్పుచేసి కాల్చేస్తుంటారు. గిరి జనులు పేదరికం కారణంగానో, నిజంగా రుచులక్కరలేకనో కాని మాంసం వంటలో కూడా మసాలా సామగ్రి వాడరు. ఉప్పు, చింతపండు, మిరపకాయ. అంతే. వారి వంటలు చాలా సులభంగా అయిపోతా యందుకే.

సారా... చీకులు... నాట్యాలు... పాటలు... కోలాహలం... ఆనందం...



అన్నీ ముగిసేసరికి అర్ధరాత్రి దాటిపోయింది. పైగూడేలనుంచి వొచ్చిన వారిని, అతిధులను రాజుపాకల నివాసులు ఒక్కొక్క ఇంటివారూ కొంతమందిని చొప్పున తమ గుడిసెలకు ఆహ్వానించారు పడకలకి. ఆతిధ్యానికి వారెప్పుడూ ముందే ఉంటారు. పగలంతా అడవిలో ఒంటరిగా పనులు చేసుకోడంవల్లనేమో వారికి ఏకాంతం పడదు. సాధ్యమైనంతసేపు నలుగురిలోనూ గడపడమే వారికి సరదా.

ఆరాత్రి మరీ చలిగా ఏమీ లేకపోయినా- ఆరుబయలు పడకలు కనుక నెగడులు వేశారు. నెగడు చుట్టూ శరీరాలు వాల్చి కబుర్లు మొదలుపెట్టారు.

"ఆమజ్జ మా గూడెంల ఏటయినాదో తెలుసా?" ఏదో విశేషం చెప్పబోతున్నట్లే అన్నాడు దొన్ను. సింతగున్నల అనే గూడెం నుంచి వొచ్చిందా కుటుంబం. వారికి మహారాజు ఇంట ఆతిధ్యం ఏర్పాటు చేశారు. చింతగున్నలంటే పోడు వ్యవసాయం జరిగే గూడెం.

కొండమీద- ఎక్కడ కాస్త నేల చదునుగానూ, మరీ రాయి మాత్రమే కాక ఆ రాతి మీద కొంతయినా మట్టి పేరుకుని కూడా ఉంటుందో, అలాటిచోట మొదట మొక్కలు నరికేస్తారు. తుప్పలూ, డొంకలూ నరికేసి... అవన్నీ శుభ్రం చేసి మిగిలిపోయిన ఆకులూ, పుల్లలూ... మోళ్లూ... చెత్తా చెదారాలను నాలుగురోజులపాటు బాగా ఎండనిచ్చి- అప్పుడు అగ్గిపెడతారు. మహావృక్షాలు లేనిమేరనే ఇది సాధ్యం. అప్పుడు నేలమీద బూడిదే ఉంటుంది. నేలను చదును చేస్తారు. అందుకు వారు ట్రాక్టర్లనీ, నాగళ్లనీ ఉపయోగించరు. అవి ఖర్చుతో కూడుకున్నవి. ఇంటిలిపాదీ చిన్న చిన్న గునపాలు, పారలు, తీసుకుని నేలను పైపైన తవ్వి మట్టం చేస్తారు, బూడిదా మట్టి కలగలిసేలాగునా, నేల సమంగా ఉండేలాగునా. అప్పుడా నేలని నాలుగువర్షాలు పడేవరకూ వొదిలేస్తారు. చెట్లూ, అవీ కాలిన బూడిదా మట్టీ కలిసిపోతాయి. అంతే తప్ప వేరే ఎరువులు కొనివేసే ఆర్ధిక స్తోమత వారికుండదు. కొంతవరకూ తెలియకపోవడమూ కారణమే. పైగా దిగుబడి తక్కువ. అలా తయారుచేసిన నేలలో అదను చూసి కొర్రలో, గంట్లో... వరో... కందులో... గింజలు జల్లుతారు నేలను బాగా దున్నకుండానే. విత్తనాలు కూడా నాణ్యత చూడరు. పురుగుమందులు కలపకనే జల్లుతారు. ఐతే- ఇది మామూలుగా కాక పండగలా చేస్తారు. చిన్న యజ్ఞంలా చేస్తారు. నాగరికులు భూమిపూజ, ఏరువాకలు చేసేమాదిరిగా.

ఈ పండగను సంకు పండగంటారు. దీనికధిష్టాన దైవం సంకుదేముడు. ఈ దేముడి చిహ్నం సావడి (రచ్చబండ)లో విధిగా ఉంటుంది. గిరిజనుల దైవవిగ్రహాలు స్పష్టమయిన ఆకృతిలో ఉండవు. దేవుడు సాకారుడేకాక నిరాకారుడు కూడా అనేమో. నాగరికదైవాలు ఏ అవయవానికా అవయవం తీర్చిదిద్దీ మానవాకృతిని పోలీ... అందంగానూ ఉంటే- గిరిజనుల దేముళ్లు బాగా చెక్కని రాయి, లేదా పెద్ద దుక్క, అలా ఉంటాయి. సంకుపండగను సాధారణంగా జులై, సెప్టెంబరు నెలల మధ్య జరుపుతారు. దీనిని విధిగా శుక్రవారం మాత్రమే చేస్తారు. **జొడ్ల** పండగను బుధవారం మాత్రమే చేసేటట్లు. సంవత్సరంలో ఇది ప్రారంభం పండగ. పూజారి గంటందొర ఆవేళ నవధాన్యాలూ కలిపి చేసిన మిశ్రమాన్ని ప్రతి ఇంటికీ పంచిపెడతాడు. ఈ ప్రసాదపు గింజలతో తమ విత్తనాలను కలిపి భూమిలో **జల్లు**తారు. ఏమాత్రం అవకాశమున్నా **బలి,** సారా లేదా కల్లు తప్పవు. తమకే **తమ**




వ్యవసాయానికీ శుభంకోరి, దేవుడి విత్తనాలిచ్చినందుకుగానూ పూజారికి కొంత బహుమతి ముట్టజెబుతారు.

ఇక ఆ పొలానికి దేముడే దిక్కు. నీటివనరు ఉంటే వరి వేస్తారు. లేదా కొర్రలో, కొండకందులో అలాటివి. పడితే వర్షం పడడం లేదా అంతే. సాధారణంగా వర్షం పడుతూనే ఉంటుంది విత్తనాలు మొలకెత్తేందుకు. ఒక్కొక్కప్పుడు మళ్లీ మళ్లీ విత్తనాలు జల్లవలసి ఉంటుంది మొలకెత్తడానికి వర్షం పడకపోతే. విత్తనాలలో మొలకెత్తినన్ని మొలకెత్తుతాయి. పూజారి పంటలు బాగా పండాలని మేకనో, కోడినో కోస్తాడు సంకుదేముడికి.

పంటలకు వొచ్చే తెగుళ్లని నివారించేందుకు పురుగుమందులు వాడరు. ఆర్థికంగా స్తోమత ఉండదు. పైగా దిగుబడితో చూస్తే పెట్టుబడి ఎక్కువ పెట్టడం లాభదాయకం కాదు. అలాగని తెగుళ్ల నివారణకేమీ చేయకుండా చేతులు ముడుచుకుని కూర్చోరు. జొడ్లపండగ చేస్తారు. ఈ పండగ చేస్తే పంటలకు తెగుళ్లు రాకుండా దేముడే కాపాడతాడని వాళ్ల విశ్వాసం. దీనినెప్పుడూ బుధవారమే జరుపుతారు. జొడ్లపండగకి దేముడి దగ్గర కోడినో, మేకనో బలి ఇస్తారు. కల్లు సంగతి సరే. గిరిజనుల పండగలు అర్థవంతంగా ఉంటాయి. తమాషాగానూ ఉంటాయి. గంగదేముడి పండగని ఒక పంథగ చేస్తారు. ప్రతి ఇంటినుంచీ బియ్యం దండుతారు. అలా ఇంటింటినుంచీ పోగుచేసిన బియ్యంతో దేముడి దగ్గర వంటలు చేసి గూడెం అంతటికీ అక్కడే దేముడిముందే భోజనాలు పెట్టిస్తాడు పూజారి. ఒకవిధంగా సామూహిక భోజనోత్సవమే ఈ పండగ. ఐకమత్యాన్ని వృద్ధిచేయడం దీని ఉద్దేశమేమో. పండగయినా, పెళ్లయినా, ఏ కార్యానికయినా పూజారే నిర్వహణ. పూజారిపని చేసేందుకుగానూ అతనికి కొంత పొలం ఇవ్వబడుతుంది. పెళ్లిళ్లు, పండగలు చేయించినప్పుడు ఆ యజమానులు పూజారికింత ఇచ్చితీరాలని నిర్బంధమేమీ ఉండదు. శక్తినీ, మనసునీ బట్టి ఇవ్వడమే. ఐతే, అలాగని ఇవ్వగలిగినవారెవరూ మానరు. అలాటి నైచ్యాలకీ, సంకుచితత్వానికీ గిరిజనులకీ పడదు. నిరాడంబరంగా జీవిస్తూ ఉన్నతంగా ఆలోచించడం అనేదానికి ప్రతినిధులు వనపుత్రులు.

ఇతరులు తమకి చేసిన మేలుకి, ఎలాగయినా కొంతయినా బదులు తీర్చుకోవాలి అనే కృతజ్ఞతాభావం అధికం. అందుకు చక్కని ఉదాహరణ జంకారమ్మ దేవుడి పండగే. గూడెం ప్రజలు తనకి పొలమిచ్చారు పెళ్లిళ్లలో తొగరు పోసినందుకు. (వివాహతంతు జరపడాన్ని తొగరు పొయ్యడమంటారు కోయభాషలో) పంచెలచాపనీ అదనీ ఇస్తారు. ఎన్నోవిధాలుగా తనకి వారు కానుకలు ముట్టజెబుతూనే ఉంటారు సందర్భం వొస్తే. మరివారికి తన కృతజ్ఞత తెలుపుకోడమెలా? రుణం తీర్చుకోవడమెలా?

గూడెంలో ప్రతినెలా, పశువులకీ, పంటలకీ, మనుషులకీ, జబ్బులు రాకుండా ఉండాలని నెలదోషమని చేస్తారు గిరిజనులు. జాంకారమ్మ దేముడికి ప్రతి కుటుంబమూ కోడో, మేకో ఏదో ఒకటి మొక్కుకుంటుంది. వాటిని పూజారి ఆధ్వర్యంలోనే బలి ఇస్తారు. వారందరికీ పూజారే స్వంత ఖర్చుమీద దేముడి ఎదుటే భోజనాలు ఏర్పాటు చేస్తాడు. జాంకారమ్మ పండగనాడు గిరిజనులు దుక్కిదున్నరు. ఎందుకయినా సరే నేలను తవ్వరు, భూదేవిని నొప్పించకూడదని. భూదేవినే కాదు, ప్రకృతినీ హింసించరాదని. ఆ పండగనాడు అడవికెళ్లరు. కొమ్మ నరకరు. వేటాడరు. అడవినుంచి ఏమీ తెచ్చుకోరు. నెలదోషం పండగ, జాంకారమ్మ పండగనాడు కనీసం కొబ్బరి

కాయయినా కొట్టగలనని మొక్కుకోని గిరిజ నుడుండడు.

గిరిజనులులాగే వారి దేవుళ్లూ నిరాడంబరులూ, సహజత్వానికి ప్రతీకలు. నాగరిక ఆలయాలు ఆర్భాటంగా ఉంటాయి. ఆలయాలలో పరిచిన పాలరాయి అక్కడ దొరికేది కాదు. విగ్రహాలను చేసిన రాయి ఎక్కడిదో. శిల్పి అనే ఒక మనిషి దేముడి విగ్రహాన్ని చెక్కుతాడు. ఆలయాలు సాధారణంగా జనావాసాలకు దూరంగానూ, విడిగానూ, ప్రత్యేకంగానూ ఉంటాయి జనజీవితానికీ, దేముడికీ చాలా దూరం సుమా అంటున్నట్లు. కాని గిరిజనుల భక్తీ, దేముడూ కూడా సహజమైనవీ, స్వచ్ఛమయినవీ నిర్మలమయినవీ. వారి దేముళ్ల విగ్రహాలు వారి అడవిలో దొరికే కర్రలే. వారి కొండమీది రాయే మనిషికి దేముడిని చెక్కి రూపమిచ్చే అర్హతలేదని చెబుతున్నట్లు దేముడనబడే ఆ కర్ర లేదా రాయి సహజ రూపంలోనే ఉంటుంది తప్ప చెక్కబడదు. ప్రత్యేకంగా ఆలయమో, కోవెలో అంటూ విడిగా కాక చెట్టుకింద అందరికీ అందుబాటుగానూ అందరి మధ్యా ఉంటాడు కొండ దేముడు. దేముడి కోసమంటూ మనిషి ఎక్కడికో పోనక్కరలేకుండా, ప్రయాస పడనక్కరలేకుండానే చేరువగా ఉండే, మిత్రుడిలాటి దైవం. దైవమంటే ప్రకృతే తప్ప కృతకం కాదని చెబుతూ, విశ్వమంతా దైవమయమే, ప్రాణులు, అప్రాణులయందు తానున్నానంటున్నట్లు, కర్రముక్కలోనూ, రాయిలోనూ వెలసివుంటాడు గిరిజనదేముడు. నగలూ, నాణాలూ పెట్టుకోకుండా నిసర్గంగా దర్శనమిస్తూంటాడు. గిరిజనుల హృదయాలలోనూ, వారి జీవన విధానంలోనూ దేముడిది ముఖ్యభాగమే.

పోడు వ్యవసాయం ప్రధాన వృత్తిగా సాగే అడ్డోలి, సెంగాం, సింతగున్నల గూడేలలో వ్యవసాయపు పండగల సంఖ్యా ఎక్కువే, వాటి పట్టింపూ ఎక్కువే. పోడు వ్యవసాయం ఒకరకంగా అల్లి బిల్లి వ్యవహారమూ ఆషామాషీ పనీలాగే సాగుతుంది. నారుని మళ్లీ ఊడ్చడం (నాట్లు.. ఉభాలు... అంటారు నాగరికులు) ఉండదు. విత్తనం జల్లి వొదిలేస్తారు. అంతే. దేముడు వర్షం పోస్తే నీరు, లేకపోతే లేదు. గాలిలో దీపం వ్యవసాయం. పండినంత పండుతుంది. గండాలన్నీ గడిస్తే,

ఈ పంటకోసమే, పోడు వ్యవసాయం కోసమే, అడవిని పాడుచేస్తారు గిరిజనులు అంటుంది ప్రభుత్వం. నేలను కాల్చడంతో, చట్టుపక్కలుండే మొక్కలూ చెట్లూ కూడా ఆ వేడికి మాడిపోతాయి. ఇలా అడవిని పాడుచేసే పోడు వ్యవసాయం శాశ్వతమా అంటే అదీ కాదు. ఎరువులు వేయకపోడం వలన భూసారం తొందరలో తగ్గిపోయి కొన్ని పంటలకే భూమి నిస్సారమైపోతుంది. అందువలన తరవాత కూడా అక్కడ మొక్కలు కాని, చెట్లు కాని పెరగవు. అలా అడవి తగ్గిపోతుందని ఇండియన్ ఫారెస్ట్ యాక్ట్ పోడు వ్యవసాయాన్ని నిషేధించి, శిక్షార్హమైన నేరంగా చట్టం తెచ్చింది. పోడు వ్యవసాయం చేసేవారు సంచారజీవులు. వ్యవసాయం ఫలించేంతవరకే ఆ చోట ఉంటారు. నేల పనికిరాకపోగానే అక్కడినుంచి మరొక అనువైన ప్రదేశానికి మకాం ఎత్తేస్తారు. కనుక వారికి అడవితో అనుబంధం గాఢంగా ఉండదు. స్థిరంగా అక్కడే జీవించే ఆటవికులలా అడవిమీద శ్రద్ధ వహించరు. నిజానికి అడవుల నాశనానికింకా ముఖ్యమయిన కారణాలు వేరే ఉన్నాయి. అది ప్రకృతి సహజమయినవి కొన్నీ, మానవుల నిర్వాకాలు మరి కొన్నీ. వేసవిలోనూ, ఆ ముందూ అడవిలో బలమయిన పెనుగాలులు వీస్తాయి. దానితో పెద్ద పెద్ద కొమ్మలూ, కాండాలూ




రాపాడుతామొకదానితో ఒకటి. అప్పుడు నిప్పు పుడుతుంది. సముద్రంలో కెరటాల తాకిడికి జనించే బడబానలంలా అడవిలో చెట్లకొమ్మల రాపిడికి దావానలం జ్వలిస్తుంది. గిరిజనులు ఏరుకుపోగా మిగిలిన ఎండుకొమ్మలు అంటుకుని జ్వాలలు పెద్దవై అడవిని దహించడం మొదలుపెడతాయి. అడవులలో అగ్ని నిరోధకానికి అగ్నిమాపక శాఖ ఉండదు కనుక ప్రకృతిపరంగానే ఏదో జరిగి ఆరాలాదావాగ్ని.

మహా మహావృక్షాలను కూడా మాడ్చి మసిచేయగలదీ దావాగ్ని. ఇదికాక మనుషులు స్వార్థంకోసం అడవి నంటించటమూ జరిగేది పూర్వం. వేసవిలో ఎవరో అడవి కగ్గి పెట్టేవారు. దానితో అసలే వేసవీ, ఎండలూ ఏమో ఇట్టే అంటుకుపోయి దానంతట అదే అల్లుకుపోయేదగ్ని. కొండదిగువ దగ్గర ఊళ్లకి రాత్రివేళ కొండలమీద జ్వాలాతోరణాలులా కనిపించేవి ఇవే. కొండ పాదులంటించడమంటే ఇదే. సహజంగా అగ్నిపుడితే కొండపొళ్లంటుకున్నాయంటారు. బొగ్గుల కోసమని ఇలా అంటించడం చేసేవారు. క్రమంగా కలప విలువ, గిరాకీ పెరగడమూ, బొగ్గులకి ప్రత్యామ్నాయంగా కిరసనాయిలు ఊక (చిట్టు) పొయ్యిలు... గ్యాసు... విద్యుచ్ఛక్తి అభివృద్ధి చెందడంవలన కొండపొడులంటించడమనేది దాదాపు అంతరించినట్లే. అడవులలో శాశ్వతంగా నివసించే గిరిజనతెగలు అడవిని నమ్ముకునే తప్ప అమ్ముకుని బతికేందుకు అయిష్టంగా ఉంటారు. అడివి కగ్గిపెట్టడమంటే అమ్మకగ్గిపెట్టడమే అని వారి నమ్మకం! కనుక వారు మాత్రం ఎన్నటికీ కొండ పొడలంటించరు.

సింతగున్నలగూడెంనుంచి వొచ్చిన కుటుంబం పెద్ద దొన్ను. వాళ్ల ఊళ్లో జరిగిన విశేషం చెప్పసాగాడు.

"మా ఇంటికో సుట్టపోడొచ్చాడు. ఆడు మొదట్నించీ టౌన్లలో బతికినాడులె. ఆడిక్కడన్నీ ఇంతలే. ఇసిత్రాలె. మా పాక న్జూసీ,

"ఇంట్లోకి పాములొచ్చీవా? పులులూ అవీ వొచ్చివా? " అనడిగాడు.

"రావు. మా ఇంటిచుట్టూ కట్టు కట్టిస్తాం గందా? " అన్నాన్నేను.

"కంచేశావు సరే. కాని అది పాముల్నీ, క్రూరమృగాలనీ ఎక్కడాపగలదూ? " అని ఎదురు పెశ్నేశాడు.

"కట్టు కట్టడమంటే అదికాదూ... మంత్రాలతో కట్టు" అని చెప్పాను. ఆడు నవ్వేసి, "మంత్రాలకి చింతకాయల్రాల్తాయా? పాములూ, పులులూ పారిపోతయ్యా? " అని హేళన చేశాడు.

"పులుల్లేవు. జంతువులూ, పాములూ కట్టుదాటి రావు" అని చెప్పాను.

"నేన్నమ్మను" అన్నాడాడు. నాక్కోపమొచ్చినాది. "నమ్మకపోతే నూతిలోబడు. ఎవర్నమ్మకాలాళ్లవి" అంటున్నానో లేదో ఆడి సంటిబిడ్డ హటాత్తుగా ఏడుపుకి లంకించుకుంది. దానమ్మ రొమ్ము కుడిపినా పాల్తాగదు. ఊరకే పేచీ పెట్టేస్తూంది. ఏదేనా బాదా అంటే అలాటి వాటమేమీ కనపడదు. ఏంజేసినా అది ఏడ్పు మానకపోయేసరికి "గీరేమో..." అంది నా ఆడదాయి.

"పూజార్ని తీసుకొస్తనుండు. గ్రెహపీడయితే బూడిదెడతాడు" అంటూ నేను బోయి పూజార్నట్టుకొచ్చాను. ఆయనొస్తూనే బిడ్డ ముకం చూసి... "గాలి... బాలగ్రెహపీడే" అంటూ కళ్లు మూసుకుని నిటారుగా నిలబడి నిముషంపాటు పెదవులు కదిపాడు మంత్రాలు గొణుగుతూ. పిమ్మట కుడిచెయ్యి సూపుడేలితో ఎడంపాదం బొటనేలి కింద దూళిదీసి పాపనొసల దూళి బొట్టెట్టిండు. అంతే. మాయలాగ ఏడుపు ఆపేసి

నాది కుర్రకుంక. అంతటితో ఆగేనా? కిలకిలమని ఒకటే నవ్వు. మా ముద్దుగ అందం గుంటదిలే గుంటది. అదలా ఒక్కచ్చనంలో మారినా ఆడికి నమ్మకం సాల్లేదు. మర్నాడేటయిందంటే...

"నేనడివికి పొయ్యాను. ఆడు పెద్ద మొనగాడిలా సికారెల్లినాడట. ఒకచోట పనసచెట్టుకి బలే కాయలు కనిపించినయట. బాగా ముదిరి... పండుతూ మంచి వాసనేస్తూంటే ఒకటి తెంపుకుందామని చెట్టుమీద చెయ్యేసినాడో లేదో దానికంటుకుపోనాడు. చెయ్యాడిరాదు. గోలాగగ్గోలా పెట్టేస్తాంటే ఎవరో ఆ తట్టున పోతూ వాణ్ణి చూసి ఎవరేటని ఆరాలు తీశార్ట. మనోడు నా పేరూ, మా బంధుత్వమూ చెప్పి కొత్తోడినన్నాడట.

సరే... "తప్పయిపోనాది. మరెన్నడూ అలా పరులసొమ్ము ముట్టను. ఈపాలికి చ్చమించు గవర్రాజూ. అని మనసులో ఏడుకో" అని సలహా జెప్పినాడంట. మన వాడలా చేసేసరికి చెయ్యాడొచ్చిందట. ఆ చెట్టుకీ, చెప్పినవోడికీ చెరో దణ్ణమూ పెట్టి ఇంటికి పారొచ్చాట్ట బతుకు జీవుడా అని. నేనడివినుంచి రావడమేమిటి, ఆ గవర్రాజెవరు? అసలిదంతా ఏటి సెప్పు సెప్పంటూ పేణాలు తీశాడు. నాకూ చెప్పక తప్పలేదు"



గవర్రాజు గురించి మహారాజు కుటుంబానికీ బాగా తెలుసు. ఒకసారి వాళ్ల కొండకందుల చేలో తరచుగా దొంగతనాలు జరుగుతూంటే ఆ చేనుకి కట్టు కట్టించారు. కట్టంటే, మంత్రకట్టు.

గవర్రాజుది నర్సీపట్నం. బూతవైద్యుడిగా పేరుపొందినవారాయన. కాని ఆయన అభిరుచి మూలికావైద్యం పట్లనే. చిన్నపిల్లల గాలిదోషాలు మొదలు పెద్దవాళ్లకి పట్టే మొండి దెయ్యాలవరకూ దేనినయినా ఆయన వొదిలించగలరని ప్రసిద్ధి. ప్రతి ఆదివారమూ వారింటిముందు భూత వైద్యం కోసం వొచ్చేవారితో చిన్న సంతలాగే ఉండేది. ఉదయం పూజలో కూర్చుని పదకొండు గంటలకి పూజాగృహంనుంచి బయటకొచ్చి రోగులను చూసేవారాయన. ఆంజనేయస్వామి భక్తుడు. బ్రహ్మచారి. తమ్ముడింటనే ఉండేవారు. కాళీ ఉపాసకులయిన ఆయన దృఢమైన శరీరమూ. పెద్ద మీసాలూ. సింధూరపు బొట్టు. పంచెకట్టుతో గంభీరంగా ఉండేవారు. వొచ్చినవారిని శారీరక రుగ్మతో, మానసిక రుగ్మతో పరిశీలించి అనువయిన వైద్యం చేసేవారు. దయ్యాలను భూస్థాపితం చెయ్యడమూ... చేతబడులు, చిల్లంగులు వొదలగొట్టడమూ వారికి బాగా తెలుసు. మూలికల కోసం వారు తరచుగా కొండలలోకి వెళ్లవలసివస్తూండేది. ఆ సందర్భంలోనే వారికి గిరిజనులతో స్నేహాలేర్పడ్డాయి. అభిరుచి కల కొందరు గిరిజనులకు మూలికలను గుర్తించడమూ, ఏ మూలికనేతిథిలోనూ, సమయంలోనూ ఏ దైవాన్ని ప్రార్థించి ఎలా తియ్యాలో ఆ పద్ధతీ బోధించేవారు. అలాగే వారికి కొందరు శిష్యులు కూడా ఉండేవారు. తనకి కావలసిన మూలికలేవో శిష్యుడికి కబురు పంపితే- ఆయన అక్కడికి వెళ్ళనక్కరలేకుండా ఆ శిష్యుడే మూలికలను తీసి పంపేవాడు.

గవర్రాజు నిత్యవిద్యార్థి. గిరిజనులనుంచి కొన్ని వైద్యవిధానాలను తానూ నేర్చుకునేవారు. మంత్రాలనూ నేర్చుకునేవారు. పార్శ్వపు నొప్పి (మైగ్రేన్)కి గిరిజనులు చిత్రమయిన చికిత్సా విధానమవలంబిస్తారు. సూర్యోదయంతో తలనొప్పి ప్రారంభమై, ఎండెక్కుతున్నకొద్దీ తలనొప్పి తీవ్రతరమై మధ్యాహ్నంనుంచీ తగ్గడం దీని లక్షణం. ఈ రోగిని ఉదయం నొప్పి పార్శ్వంమీద ఎండపడేలా సూర్యునికెదురుగా నిలబెట్టి- నొప్పికల పక్కయొక్క నీడ

పడేచోట మంత్రవైద్యుడు నేలమీద మంత్రం చదువుతూ ఒక మేకు దిగగొడతాడు. అంతే పార్శ్వపు నొప్పి పటాపంచలౌతుంది. తర్కానికీ, హేతువుకీ అందకపోయినా ఫలితాలు సంతృప్తికరంగా ఉండడంతో తానూ ఈ వైద్యవిధానాన్ని అలవరచుకున్నాడు గవరాజు. అలాగే గిరిజనులకు తెలిసిన మరి కొన్ని చిట్కావైద్యాలూను.

బాగా వేడి చేసిన లక్షణాలు కాళ్లపీకులు వంటివి కనిపిస్తే ఆ రోగి తలకి చెరువులోని నాచును పట్టీలా వేసి దానిమీద ఆకుతో కట్టు కడతారు. కందదుంపని పోలిన పెద్ద చలవదుంప యొక్క చిన్న ముక్కని నూరి తలకి పట్టువేస్తే శరీరంలోని అధిక ఉష్ణాన్ని లాగేస్తుందంటారు. తన వద్దకు వైద్యానికొచ్చేది పేదలు కనుక వారికి అతితక్కువ ఖర్చుతో రోగనివారణ జరిగేలా ఇలాటి చిట్కాలూ, చిట్కావైద్యాలూ చేసేవారాయన. వారెక్కడున్నా ప్రజోపకారే. గిరిజనులు కొందరు- "కష్టపడి నెలలతరబడి చెమటోడ్చి పనసకాయలు పెంచుకుంటే ఎవరో ఎత్తుకుపోయారు రాజా!" అని మొరపెట్టుకునేవారు. అలాటప్పుడు చెట్లకీ, చేలకీ కట్టు కట్టేవాడాయన. ఆ కట్టు విప్పేవరకూ పరులెవరయినా ఆ చెట్టును ముట్టుకున్నారో- దానికంటుకుపోయారే. జొన్నవిత్తులు, నేలచిక్కుళ్లు, పనస, కొండకందుల, వంటి పంటలకి గిరిజనులు వారిచేత ఇలా మంత్రకట్టు కట్టించుకునేవారు. కట్టు మళ్లించేవరకూ ఆ పంటలకు పరులనుంచి శ్రీరామరక్షే. వాక్శుద్ధికల గిరిజనులకు వారీ మంత్రాలను నేర్పేవారు. కట్టు కట్టబడిన చెట్టూ, చేనూ పైవారికి తేలికగానే తెలిసిపోతుంది.

ఇప్పుడు గవరాజులేరు. కీర్తిశేషులైపోయారు. వారి వంశంవారు మాంత్రిక శాఖనూ వైద్యశాఖనూ చూస్తున్నారు. వారు లేకపోయినా గవరాజుగారి పేరు చెప్పుకుంటే చాలు దయ్యాలు, భూతాలనుంచి ధీమాగా ఉండొచ్చునంటారు. అదిగో ఆ మహానుభావుడికి దణ్ణం పెట్టుకోబట్టే దొన్ను చుట్టం చెట్టునుంచి విడివడగలిగాడు.

"పాడేరుకి కొంచెం దూరంలో సుమారొక కిలోమీటరులో నక్కలపుట్టు అనే గ్రామముంది. అక్కడొక మాస్టరున్నాడు. శక్తి ఉపాసకుడు. ఆయన పూజచేసి వచ్చి రోగులని ముట్టుకుంటాడు, వారి బాధలువిని. అంతే తొందరలోనే నయమైపోతుందెలాటి రోగమయినా" తనకి తెలిసినది తాను చెప్పాడు మహారాజు. మాటకి మాట తెగులూ, నీటికి నాచు తెగులూ అని సామెత. తెగులేకాదు మాటకి మాట ముచ్చట కూడానూ. ముఖ్యంగా సారా తాగి నిషా మీదున్న మహారాజులాంటి ముసలి వారికైతే మరీను.

"అమ్మీ! కాసిని మంచి నీళ్లట్టుకురా" భార్యకి చెప్పాడు మహారాజు గొంతెండినట్టుంటే. దోకి (దోకి అని కూడా అంటారు. కొబ్బరి చిప్పకు కర్ర తగిలించి లేదా సొరకాయ దొలిచి ఎండబెట్టి డొల్లచేసి కర్ర అతికి హ్యాండిలున్న చెంబులా చేస్తారు. అదే డోకి. చేదు ఆనపకాయతో చేసిన దోకిలో విత్తనాలు నిలవచేస్తారు. పాత్ర చేదుకి పురుగులు దరిచేరవని)తో నీళ్లు తెచ్చి అందించిందా వృద్ధురాలు. దొన్నుకి ముందిచ్చి మిగిలినవి తానూ దానితోనే తాగాడు. మహారాజుకి దొన్నంటే సరదా. అతను బొట్టిలాగడం పెళ్లి చేసుకున్నాడు. మామూలు పెళ్లిళ్లుకాక కొండకాపులు, రెడ్డి దొరలు, సామంతులు తోవపెళ్లి అని చేసుకుంటారు. తోవలో ఏ చెట్టుకిందనో తోవపక్కన జరుగుతుంది పెళ్లి. ఏకరాత్రి పెళ్లి కూడా చేసుకుంటారు లేనివారయితే. సాయంత్రమే కొమ్మువేయడం (కొమ్ముపాతడం) రాత్రికే పెళ్లి జరిపించేయడమూ.

కలవారయితే తాహతుకొద్దీ ఐదురాటలో ఆరు రాటలో వేస్తారు పెళ్లి పందిరికి. గొప్పగా అన్ని రాటలకీ బోయిసెట్లు (అలంకరించబడిన మట్టి పిడతలు) పెడతారు. సొనాయిమేళం పెట్టిస్తారు. ఒక రాటకైనా బోయిసెట్టు పెట్టించకుండా ఏ పెళ్లీ జరగదు. పెళ్లయ్యాక బంధుమిత్రులు బోయిసెట్ల పిడతలతో పదార్థాలూ అవీ పట్టుకెళ్తారు. ఈ రకం పెళ్లిళ్లన్నిటికంటే భలేమజాగా ఉండేది మాత్రం బొట్టిలాగడమే. దొన్నుకి ఓ అమ్మాయిమీద మనసయింది. తనలాంటి స్నేహితులని పదిమందిని వెంటేసుకుని సారా పోయించి పాడేరు సంతకి తీసుకెళ్లాడు. ఆ సంతకే ఆమెకూడా రాగానే చూపించాడు. తాము పదిమందీ పిల్లవాళ్లు అడ్డుకోబోయినా సరకు చెయ్యకుండా ఆ అమ్మాయి నెత్తుకొచ్చేశారు. ఆ అమ్మాయిని దొన్నింటికి చేర్చారు. బలవంతంగా లాక్కొచ్చిన ఆ అమ్మాయిని దొన్ను పెళ్లాడాడు. తరవాత వాళ్లవాళ్లు తగవుకి రాకపోలేదుకానీ కుర్రది కుర్రాణ్ణి మెచ్చిందిగా, మీరభ్యంతరం చెప్పరాదు అంటూ తమ పెద్దలు వారికి నచ్చజెప్పి భోజనాలు పెట్టి పంపేశారు. మగతనమంటే అదే. పెళ్లంటే అదే. అప్పటికి తాను యువకుడు. మాంఛిబలంగా ఉండేవాడు. పెళ్లికూతుర్ని పిల్లికూనని మల్లె చంకనెత్తేసుకుని ఎదురయిన వాళ్లందరినీ గెలిచేస్తూ ఒకటే పరుగు. ఎవరయినా ఆపగలిగితేనా? అడ్డుకోగలిగితేనా? ఆ వేళ దొన్ను ఎంతో సంబరపడిపోయి రెండు దోకిల సారా పోయించాడు. దొన్ను తనకంటే రెండేళ్లో మూడేళ్లో చిన్నవాడు. కాని తనంత ఓపిగ్గా కనిపించడు. ఏట్రాయిదీ, నాకంటే సిన్నోడివే, నాసిగ కనపడతావేటని అడగబోతే "ఇద్దరు భార్యల మొగుణ్ణికద? ఇటూ అటూ వోయింపయిపోయి యిలగయిపోయాను" అని నవ్వుతాడు.

దొన్ను అంత మోజుపడి బొట్టిలాగడం పెళ్లి చేసుకున్నాడేకాని ఆ ముచ్చట ఎన్నాళ్లని? పట్టుమని పదేళ్లేమో. రెండు కూనలని పుట్టించేశాడు చకచక. దాంతో ఆ ఆడదికాస్తా అప్పడమైపోయింది. ఘనోడి మనసు మరో దానిమీదకి ఎగిరింది. ఇదీ బిడ్డ తల్లేకాని పిటపిట్లాడుతూ ఉండేది. అంబారీ ఏనుగులా అంతుండేది. సూడ్డానికి రెండు కళ్లు సాలేవికావు. ఏం చేశాడోమరి మెల్లంగ దాన్ని పక్కలోకి లాగేడు. ముగ్గులోకి లాగేడు. అడివిలోనో కొండమీదో కలుసుకుంటూ సుఖపడడం మరిగారిద్దరూ. ఎన్నాళ్లు దాగుతుందేటి దొంగపనీ రంకుపనీ? ఈడి పెళ్లానికుప్పందిపోనాది. ఇది మొగుణ్ణి నసబెట్టేడం మొదలెట్టింది. చూస్నూసి.. "నీయవ్వ... నేన్దాన్నొగ్గనే, ఉంచుకుంటాను" అనేశాడు. అది పిల్లల్ని దీసుకుని అమ్మోరింటికిపోయింది. చంప మొగుడికి తెలిసిపోయింది. వాడు దాన్ని మర్యాదగ అడిగినాడు. "ఏమే? నేన్నీకు సాల్లేదా! ఎందుకిట్టా ఎదవపనిచేస్తావ్? ఐందేదో అయింది. బుద్ధిగుంటానంటే చ్చెమించేత్తా. మనిసన్నాక మనసు చెదరడం మామూలే. ఏవో తెలియక జేసుంటావు... తప్పని చెబుతున్నాగా, దిద్దుకుందువా? ఒద్దికగ కాపరం సేస్తువా?" అన్నాట్ట.

"నాకు దొన్నుగాడంటెమోజు. ఆడిని నేనొగ్గలేను. సూసీ సూడనట్లు పోతనంటవో నీతోనూ సంసారంజేస్త. లేదా..." నీ యిష్టమన్నట్లు జూసింది నిర్భీతిగా.

"నీమీది బ్రెమ (ప్రేమనే వాళ్లు బ్రెమ అంటారు)తో కుక్కముట్టినకుండవయినా కాదనరాదనుకున్నానుకాని.. నాకేటి కరమే ఎంగిలి దొప్పలోనే ఎప్పుడూ అంబలి తాగడానికి? నేను మొగాణ్ణే..."

"నేనాడదాన్నికానా? అందమైనదాన్నికానా! దొన్నుగాడు దెచ్చిన చెంపపిన్ను

పెట్టుకుని గాజులేసుకుని పూసల్దండ పెట్టుకుని పూల సీరకట్టానో గూడెం గూడెమంతా తిరగబడి పోదా? విరగబడి పోదా? నేనాణ్ణొగ్గను. నీ మగతనం నాకు సాలట్లేదు" అని నిర్లజ్జగా చెప్పేసిందామె.

దొన్ను పూజారికి ఫిర్యాదు చేశాడు. అతగాడు బారికని పిలిచి టముకేయించాడు చావడిలో తగువుందని. సహజంగా కాలక్షేపం కోసం ఎదురుచూసే గిరిజనులు చావడిలో చేరారు. పెద్దలూ వొచ్చారు.

చంప భర్త పిర్యాదు చెప్పుకున్నాడు.

"ఏటంటావ్? నిజమేనా?" అడిగాడు పెద్ద.

నిజమే అన్నట్లు తలూపిందది.

"నువ్వు దాన్ని పెళ్లి చేసుకుంటవా?" దొన్ను నడిగాడు రెండో పెద్ద.

దొన్ను ఆలోచనలో పడ్డాడు. చంప తనక్కావాలి. ఇప్పుడు దాన్ని దాని మొగుడొగ్గియాలంటే ఆడు ఓలి (పెళ్లికయిన ఖర్చు లేదా ఒదిలేసేవాడూ స్వీకరించేవాడూ అంగీకరించే మొత్తం) అడిగి తీరతాడు. మొగనాలు చెల్లించాల. మొగనాలకే డబ్బు కావాలి. మళ్లీ పెళ్లిజేసుకోవాలంటే చంపది తన కులంకాదు. తనేమో గదబ. అదేమో కొండపురజాలు. మారుకులం మనువొద్ది. కులం కలుపుకోడానికి ఆ పెద్దలకు తప్పు చెల్లించాలి. అంతా కలిసి తడిసిమోపెడౌతుంది ఎలా? భరించలేడే? సరిగ్గా సమయానికి మహారాజు దొన్ను చెవిలో గుసగుసలాడాడు. "నేను చంపని కదిపి చూశాను. అది నిన్నొగ్గదు. నీమీద మోజుగుంది. అంచేత నువ్వు పెళ్లే జేసుకోనక్కర్లేదు. ఉంచుకున్నా ఉంటది. ఇందువల్ల నీకోసుకముంది. ఓలికట్టి మళ్లీ పెళ్లే చేసుకోనక్కర్లేదు. కులమూ చెడుపుకోనక్కర్లేదు. నిన్ను మేము వేరుంచక్కర్లేదు, వెలెయ్యక్కర్లేదు. అంచేత పెళ్లి చేసుకుంటాననకు. దాన్నొబందం తెంపేసుకొచ్చేనీ చాలు"

మహారాజుకి దొన్ను బాల్యస్నేహితుడు. వాడు కాని వాల్మీకులయిన (కొండపుర జాలన్నావారే. కుల సోపానాలలో వారిది అడుగుమెట్టు. నిజానికి వారు తెల్లవారు ఝామున నాలుగు గంటలకే లేచి స్నానం చేసి ఆసనాలు వేసినట్లు సాష్టాంగ నమస్కారాలూ అవీ చేస్తూ దేముణ్ణి కొలుస్తారు. సూర్యనమస్కారాలు చేస్తారు. సూర్యోదయమయ్యే వరకూ దైవప్రార్థనే. అయినా కులం రీత్యా వాల్మీకులు తక్కువ వారు. కులాంతర వివాహం చేసుకుంటే యిద్దరిలోనూ ఎవరిది తక్కువ కులమైతే అదే ఔతుందా యిద్దరిదీ. పై కులానికి చెందినవారిని తమలో కలుపుకుందుకా కులపెద్దలకు డబ్బు చెల్లించాలి. కులం కలుపుకుందుకు భోజనాలు పెట్టాలి. అటు కులాంతర వివాహం చేసుకుని తక్కువ కులంలోకి పోయినవారిని ఆ కులంవారు వెలివేస్తారు. మళ్లీ తమ గడపలోకి రానివ్వరు. మంచినీళ్లివ్వరు. కులాలనేవి నిజానికి గిరిజనులలో శాఖలు. వారి చాలా నేరాలకు నిష్కృతి ధనరూప పరిహారమే కానీ వారి దగ్గర ఆ ధనమే కరువు) చంపను చేసుకుని వాల్మీకుల్లో కలసిపోతే తను వాడిని వెలెయ్యాలి. అది తనకి శానా కష్టం. దొన్నుకి దూరంకాలేడు. దొన్నుని దూరం చేసుకోలేడు. అందుకే ఈ ఉపాయం ఆలోచించాడు. "పెళ్లంటే ఏటి, ఉంచుకోటమంటే ఏటి? ఏదయినా ఒక్కటే. అవ్వపేరే ముసలమ్మ, వ్యాఘ్రం పేరు పెద్దపులి. పగలు అంబలికాసి రాత్రి పక్కలో ఆనందమివ్వాలి ఆడది. దాన్ని పెళ్లామంటే ఏమి, ఉంచుకున్నదనుకుంటే ఏమి? చంపమొగుడికి మొగనాల చెల్లించడమే నీ మెడకి మించిన భారం. నేనో చెయ్యేస్తాలే. ఆడిని తెగ్గొట్టేస్తే... అది పంజరంనుంచి పైన పడిన చిలకవుద్ది. అప్పుడు

మీకడ్డెవరు? "

"నిజమే నీ సలహా బాగుంది"

"నీ పెండ్లము యిషయమేటి? "

"తగవులాడి తగవులాడి అమ్మగారింటికి పోయింది. పగలు అంబలికాచడానికీ యింటి పన్లకీ వొస్తుందికాని సీకటడితే మరి సిక్కదు. సవతిని దెస్తవా అని కారాలు మిరియాలు నూరింది. కంయ్యిమంటూ కల హమాడింది. బిడ్డలని మాత్రం యిచ్చీ మంది"

గిరిజనులు విడిపోతే బిడ్డలు మగాడికి తీర్పుచెప్పబడతారు. దొన్ను భార్యకి బిడ్డ లంటే ప్రాణం. వారికోసం ఆమె ఎలాటి షరతులకేనా లొంగిపోతుంది. ఆ బలహీన తనాసరా చేసుకుని ఆమె తగవుకెల్లకుండా చూసుకోగలడనే ధైర్యం దొన్నుది. కనుక ఆవిడకి మొగనాలు బాధలేదు.

"పెళ్లి చేసుకోను యిప్పుడు" అన్నాడు దొన్ను.

పూజారి చంపవేపు చూశాడు. అతని చూపుకి అర్థం "పెళ్లి చేసుకోనివాడికోసం ఉన్న కాపరాన్నీ మొగుణ్నీ వొదులుకుం టావా వెర్రిదానా? ఇల్లాలి స్థానం వొదులు కుని ఉంపుడుకత్తెగా వెళ్తావా? " అని.

"దొన్ను నన్ను పెళ్లి చేసుకోకపోయినా నా మొగుడితో సంసారం చేసేదిలేదు. ఆడు నన్ను ప్రతిరాత్రీ బాదేస్తున్నాడు" అందామె.

"చెడు తిరుగుళ్లు తిరిగే ఆడదాన్ని బాదక పోతే ప్రేమిస్తాడేటి మొగుడు? నాకూ పౌరుసముంది. నేనూ మొగాణ్నే. తప్పు యితే కాయగలను కాని తల తిరుగుడు నేనొల్లను"

వ్యవహారం తేలిపోయింది. వాళ్లిద్దరూ కలిసి కాపరం చేయలేరని తెలిసిపోయింది. పెద్దలు పూచీకత్తులు రాశారు. వివాహం నుంచి దాంపత్య బంధంనుంచి ఆ దంప తులు విడిపోయారు కనుక యికపై ఒకరితో ఒకరికే విధమయిన సంబంధం కాని ఒకరిమీద ఒకరికి హక్కుకాని... ఒక రిపట్ల ఒకరికి బరువు బాధ్యతలుకాని ఉండ బోవని ఉభయులూ అంగీకారంతో పత్రం పై సంతకం చేయాలి. సంతకాలు చేయడం రాకపోతే వేలిముద్రలు వేస్తారు. ముందే సిద్ధపడి ఒచ్చారు కనుక దొన్ను అక్కడిక క్కడే మొగనాలు చెల్లించేశాడు. తగవు పెద్ద లకు రుసుము కట్టేశాడు. పూచీకత్తుల పత్రా లమీద సాక్షులు కూడా సంతకమో వేలి ముద్రో పెట్టారు. నాగరిక కోర్టులలో మల్లె ఏళ్లూ పూళ్లూ, ఎంతో ఖర్చూ, ఎన్నో అసహ్యా కరమయిన ప్రశ్నలూ ఏమీలేకుండా రెండు గంటల స్వల్ప వ్యవధిలో తక్కువ ఖర్చుతో న్యాయబద్ధంగా అక్కడ విడాకులు జరిగిపో యాయి. నిజానికి కోర్టులు పెళ్లి చెయ్యవు. కాని విడాకులకి పెత్తనం వహిస్తాయి. ఇది అసంగతమే ఒకవిధంగా. పెళ్లి చేయనివా రికి దానిని భగ్నంచేసే అధికారముంటుందా అన్న ప్రశ్నకాస్కారముంది. కాని గిరిజను లలో పెళ్లి చేయించేది పూజారికనుక అతనే విడాకుల వ్యవహారానికీ పెద్ద కనుక సబ బుగా అనిపిస్తుంది.

చంప ఉంపుడుకత్తే అయినా ఆమె సాంఘిక హోదాకి భంగమేమీ రాదు రాలేదు. ఆమె దొన్నుతో అతని గుడిసెలోనే ఉండసాగింది. భార్య పగలు మాత్రమే ఆ యింట ఉంటూ పనులలో పాలు పంచు కుంటుంది. రాత్రయ్యేసరికి కన్నవారింటికి పోతుంది. బిడ్డలనామె పెంచుతుంది. నిజా నికెవరినయినా పెంచేది అడివమ్మే. వేలెడె దిగిన నుంచీ తల్లి వెనుకో తండ్రివెనుకో వనానికి తరలి వెళ్లవలసిందే బతుకు తెరు వుకి. ఆమె ఎవరితోనో అప్పుడప్పుడు రహస్య సంబంధం పెట్టుకుంటూందని విని దొన్ను మహారాజుని సలహా చేశాడు.

"తగవు తీసుకెళ్లి మొగనాలు లాగమంటా వేటి? "

"ఒద్దు" అన్నాడు మహారాజు.

"ఏం! నేను మొగాణ్ణికానా? నాకు పౌరుసంనేదా? నాపెల్లాం నా పక్కలో తొంగోకుండా మరో మొగాడికి కొంగుపరవడమేటి? "

"పౌరుసం పక్కనెట్టి మనస్పూర్తిగా న్యాయమాలోసించు"

"ఏటా న్యాయం? "

"పెళ్లయి పెళ్లామున్నా నువ్వు పైరుచి మరిగావు. పెళ్లానికి సవతిని గాకపోతే ఉంపుడుగత్తెను తెచ్చావు. ఆ కోపంమీద అది నీ పక్కలో తొంగోడం మానింది. అయితే అదీ మనిసే. ఆడదయినా అదీ ఉప్పుకారం తింటున్నదే దానికీ ఒళ్లుంటది, కొవ్వుంటది, కోరికుంటది. పంతానికని నీ పక్కలోకి రాకపోయినా పున్నమికీ అమావాసకయినా పురుసుడి చెయ్యావొళ్లూ తన ఒంటిమీద పడాలనుకుంటుంది మానవ ధర్మంగా. ఆకలి, దాహం అంతటిదే దేహాని కొచ్చే ఆ బాదా తనివి తీర్చుకోకపోతే తడబాటూ తల్లడిల్లే. నరాలు నిలవనిస్తవేటి? నీ భార్య యిడిపోలేదు. నిన్ను మరీ ఇబ్బందేటీ పెట్టేడంలేదు. పన్లు మానాన పన్లు చేస్తుంది. నీ పక్కలోకా ఉంపుడుకత్తె ఉండనే ఉంది. అది మాత్రం ఎందుకు నస్టపోవాలి? దాని సుకం దాన్ననుబవించుకోనీ. కడుపోకాలోవొచ్చి కూనని దింపిందా అది ఏరే యిసయం. అప్పుడాలోచిద్దుం. అంతవరకూ దాని సుకం జోలికెళ్లకు. ఆడదానికొకటీ మగాడికొకటీ న్యాయముండకూడదు ఇలాటి యిషయాల్లో. మరొ కళ్లుసురుమనమెందుకు పోసుకోవాల? దేముడు మెచ్చడు"

"నిజమేలే నీ మాటా! ఔను అదీ మనిసే ఆడదీ మనిసే"

దొన్ను భార్యకి కడుపురాలేదు. వారి బంధం తెగలేదు. వాళ్ల జీవితాలలాగే సాగుతూ వస్తున్నాయి. ఇన్నాళ్లయి ముసిలిదయినా అది పంతం వదలనూ లేదు. మొగుడికి ఒక్కసారి పక్కెయ్యనూలేదు వాడు ఉంపుడుదాన్ని చేరదీశాడని ఎరికయ్యాక.

ఇంటికంతటికీ అదే వంట చేస్తుంది. అందుకు బలమయిన కారణమే ఉంది. సంప్రదాయాలూ ఆచారాలూ పాటించడంలో నాగరికులలోనే కాదు గిరిజనులలోనూ స్త్రీలు ఎక్కువ పట్టింపుగా ఉంటారు. మగాళ్లలా పరిస్థితులకీ మార్పులకీ సులభంగా లొంగిపోరు. భారతదేశవాసులకు ప్రస్తుతం ఆదర్శమూ స్వర్గమూ అయిన అమెరికాలోనే వైట్స్, నిగ్గర్స్ పేరిట అతిదారుణంగా వర్ణవివక్షపాటించబడుతోంది. తెల్లవారు నీగ్రోలను నిగ్గర్స్ అంటారు అవమానకరంగా. భారతీయులని కూడా కలర్డ్ అంటూ దూరంగా ఉంచడమేకాక నానా యిబ్బందులూ పెడతారు. ఇక భారతదేశంలో అగ్రవర్ణాలూ అధమకులాలూ అని ఉండనే ఉన్నాయి. అస్పృశ్యత అనేది ఉంది. (విద్యావంతులలో నాగరికులలో కాకపోయినా) బంట్రోతు ఉద్యోగం నుంచి భారత ప్రధాని వరకూ సినిమా వేషాలు.. రాజకీయాలు.. పదవులు... సీట్లు అన్నీ కుల ప్రాతిపదికనే నిర్ణయించబడుతున్నాయి. లౌకిక రాజ్యమనిచాటుకునే ఈ దేశంలో కుల సంఘాలు మహామహా సభలు జరుపుకుంటాయి. యధేచ్ఛగా కుల ప్రచారమూ చేసుకుంటాయి. రాజ్యాంగమే షెడ్యూల్డ్ తెగలు, షెడ్యూల్డ్ కులాలు, ఇతర కులాలు అంటూ భారతీయులను కుల విభజన చేసి వొదిలింది. ఏజెన్సీ ఏరియా మాత్రం భారత దేశపు తానులోని ముక్కేకదా? సిరికి వారసత్వమబ్బకపోయినా చీడ అంటుతుందికదా? గిరిజనుల



లోనూ కులవ్యవస్థే. తెగలు అవరోహణక్ర మంలో రాజులు, బిగత, కొండదొర, రెడ్డి దొర, గదబ, కొండపురజాతి (వాల్మీకి) మెట్టుకంసాలి (ఓజుళ్లు), కోదులు (నామం దులు) యిలా ఉంటాయి వారి తెగలు. రాజులు మిగిలిన ఏ శాఖవారింటిలోనూ అడుగు పెట్టరు. మంచినీరు కూడా తాగరు. తమపై శాఖలవారితోనే తప్ప ఏ శాఖవారూ తమకిందివారింట భోజనమూ చెయ్యరు, నీరూ తాగరు. దొన్ను కొండదొర, చంప కొండపురజాలు. (వాల్మీకి) వాల్మీకి తెగ తమ కొండదొరకంటే అధమ తెగక నుక దొన్ను భార్య కామెతెచ్చిన నీళ్లకాని చేసిన వంటకాని నిషేధమే. అందుచేత ఆ పనులన్నీ ఆమే చేస్తుంది. దొన్ను భార్య కంటే తమది తక్కువ కులం కనుక ఆవిడ నీరూ వంటా పనులూ ఉంపుడుకత్తెకు నిషే ధాలుకావు. స్త్రీలు ఈ శాఖావ్యత్యాసాలను కచ్చితంగా పాటిస్తారు. వాల్మీకులు పూర్వం ఆవుమాంసం, ఎద్దుమాసం కూడా తినే వారు. వాటిని దేముడికి బలియిచ్చేవారు. కాలక్రమంలో ఆవులనూ ఎద్దులనూ బలి ఇవ్వడంలేదు, తినడమూలేదు. మెట్టుకం సాళ్లు (ఓజుళ్లు) యినుపపనులు పారలూ అవీచేస్తారు. భోజన పానీయాల్లోనే శాఖల పట్ల ఎంతో పట్టుదలగాఉండే గిరిజనులు వివాహ విషయంలో ఉండరా? నాగరికుల కంటే వీరికే పట్టింపు ఎక్కువ.

"పూజారి మాటవిన్నావుగదా? ఏటి నీ ఉద్దేశ్యం? " అడిగాడు దొన్ను.

"దేని గురించి? "

"కొండొదిలి పోడం గురించి"

"నామాటేం చెల్లుద్ది? నీ ఒక్కడి మాటకి లువేటి? పూజారి నలుగురూ ఎలాగంటే అలాగే అన్నాడు గందా? సూద్దాం, నలుగురూ చివరకి ఏటి దేలుస్తారో నలుగురితో పాటూ నారాయణా, కులంతోపాటుగో విందా" అతని కంఠంలో కొంత నిర్లిప్తతా నిస్సహాయతలతోపాటు ఏదో తెలియని భయం కూడా.

"నిజమేనే. మన చేతిలో ఏముంది? చూడబోతే కుర్రాళ్లందరూ వెళ్లిపోవాలన్న ఉత్సాహంతోనే ఉన్నట్లున్నారు" నిర్వేదంగా అన్నాడు దొన్ను.

"ఆ!" బాధా, భయమూ నిండాయతని కంఠంలో. చెప్పలేని విచారం, దిగులు.

"నిద్దరొస్తుంది పడుకో" అని వాలిపో యాడు దొన్ను. తెల్లవారుతూనే కుటుం బాన్ని తీసుకుని తన గూడెం వెళ్లిపోయాడు కాలికడకనే. రాజుపాకల నుంచి వాళ్ల గూడెం దూరమూ కాదు, కాలినడక తప్ప మరో ప్రయాణ సాధనం లేదు. గాడిద లున్నా వాడకం తక్కువ. వాళ్లకి నడక అనేది నాగరికులకు మల్లే ఓ సమస్యాకాదు.

స్వతంత్రం వొచ్చాక కొండలలో కూడా రోడ్లు వేశారు కొన్ని ఊళ్లకి. సీలేరు హైడ్రో ఎలక్ట్రిసిటీ ప్రాజెక్టు కోసం... నర్సీపట్నం నుంచి చింతపల్లి మీదుగా రోడ్డు వేశారు. అలాగే పాడేరు మీదుగా అరకుకి. రోడ్డు అనేది ప్రయాణ సదుపాయమేకాక నాగరిక తాభివృద్ధికి మార్గం కూడా. మనుషులని దగ్గర చేసేదీ, వస్తువులను రవాణా చేసేదీ, జీవన విధానంలోనే మార్పులు తేగలిగేవీ రోడ్లే.

మాడుగుల అనే కొండ దిగువ ఊరి నుంచి పాడేరుకీ గంగరాజు మాడుగుల అని- పాడేరు దాటాక మరో వూరికీ, మరా కవేపు అరకుకీ రోడ్లు వేసింది ప్రభుత్వం. రోడ్లతో సంబంధం కలిగిన... రోడ్లపక్క నుండే ఆమాత్రపు, ఈమాత్రపు గ్రామాలలో కూడా సంతలు జరుగుతాయి. వీటిని కొండ సంతలంటారు. చుట్టుపక్కల వూళ్లనుంచీ, కొండమీది గూడాలనుంచీ ఈ సంతలకు కొనుగోలుదార్లూ అమ్మకందార్లూ కూడా

వస్తారు. ఈ సంతలలో కొనేవాళ్ళే అమ్ముతూనూ ఉంటారు. అమ్మినవాళ్లు కొంటూనూ ఉంటారు. చింతపల్లివేపు సంతలకి నర్సీపట్నంనుంచి, పాడేరు సంతకి మాడుగుల, అనకాపల్లి మొదలయిన పట్నాల నుంచీ వ్యాపారులు వస్తారు. పాడేరు దగ్గర కొండలమీది గూడేలనుంచి అడవి పంటలు పట్టుకుని గిరిజనులు వొస్తారు. గిరిజన జీవితంలో సంతకున్న ప్రాముఖ్యం ఇంతాఅంతాకాదు. అడవి పంటనమ్మాలన్నా... తమకి కావలసిన సామానులు కొనుక్కోవాలన్నా, సంత మాత్రమే శరణ్యం. సులభం. ఒక్కొక్క ఊరి సంత ఒక్కొక్కరోజు జరుగుతుంది వారంలో.

ఆరోజు పాడేరు సంతదినం. తూరుపు తెల్లవారకనే లేచింది మహారాజు కుటుంబం. ఆ వారమంతా అడవిలో పోగు చేసిన అడ్డాకులు. కొండకందులులాటి కాయధాన్యాలు... బొప్పాస, పనసలు... అన్నీ వీలునుబట్టి మూటలుగానో బస్తాలలోనో కట్టారు మోసి తీసుకెళ్లేందుకనుకూలంగా. ఆనప బుర్రలలో మంచినీళ్లు నింపారు. సామాన్ల మూటలను నెత్తికెత్తుకుని సూర్యుడు పూర్తిగా ఉదయించకుండానే ఇంటిల్లిపాదీ బయలుదేరారు. నడవగలిగిన వారందరూ, తాము మోయగలిగేదీ ఏదో ఒకటి పట్టుకున్నారు. ఎనిమిదేళ్లవాడే వాళ్లలో చిన్నవాడు. వాడేమో నాలుగు బొప్పాసలను తాడుతో ముచికలు కట్టి భుజంమీద వేసుకున్నాడు. కబుర్లు... సంతలో తమ సామాన్లకెంత రావొచ్చునో కలలు... ఆ డబ్బుతో ఏంకొనాలో ఊహలు... పాటలు... చకచక... చరాచరా నడక. తోవలో కలిసే మిగిలిన కుటుంబాల వారితో పలకరింపులు. ఏమేం తెస్తున్నారో ఆరాలు. నడిచి... అలిసి... దాహమేస్తే ఆనప బుర్రలోంచి నీళ్లు తాగడం... మళ్లీ నడక. ఈ హడావిడిలో చలి సంగతి మరపున పడిపోతుంది. పాడేరు చేరుకునేసరికి పదవుతుంది అదిగో ఇదిగో అని. వీరి రాకని దృష్టిలో పెట్టుకునే సంత కూడా పదికీ పదకొండుకీ మధ్యనుంచి కూడడం మొదలవుతుంది. బస్సులో వ్యాపారులు దిగుతారు. రోడ్డుపక్క అద్దాలు, దువ్వెనలు, రెడీమేడ్ బట్టలు... ఫ్యాన్సీ సామానులు... పీచుమిఠాయి, పాకుండలు, జంతికలు, చేగోడీలు, ఆటవస్తువులు అమ్మే రోడ్డుపక్క దుకాణాలు... లాటరీలు, పేకముక్కల క్కీలు... కూల్‌డ్రింక్ బళ్లు... అన్నీ సిద్ధమవుతాయి. గిరిజనులు తెచ్చిన సామగ్రిని కొనే షావుకార్లు వొస్తారు. పసుపు, అల్లం, దుంపలు, కరక్కాయలు, తుమ్మజిగురు, ఇండుగ పిక్కలు, పనసకాయలు, బొప్పాసకాయలు, కొండ కరివేపాకు... అలా అడివిలో దొరికేవి గిరిజనులు తేగా వాటిని వీలయినంత చవకగా కొనేస్తారు వ్యాపారులు. గిరిజనులు చాలామందికి దొడ్డి ఉంటుంది. దానిలో వాళ్లు ఏవోపంటలు పండిస్తారు. ఆ పంటలని సంతకి తెచ్చి అమ్ముతారు. పంటలు పళ్లేకాక కొందరు- జంతువులని కూడా సంతలకు తెస్తారు అమ్మడానికి. అలాటి వాటిలో కుందేళ్లు ముఖ్యమైనవి. వీటిని తమాషాగా పడతారు. మొదట, కుందేళ్లు మసిలే ప్రాంతం చూసి... అవి ఒకే తోవలో వొచ్చేలాగా అటూ ఇటూ కంచెతో హద్దులు వేస్తారు. ఆ తోవను రానురానూ సన్నం (వెడల్పు తక్కువ) చేసి అనువుగా ఉండే చోట వలలు (ఉరి) వేస్తారు. తిన్నగా వొచ్చిన కుందేళ్లు వలలో చిక్కుకుంటాయి. అవి ఇక వెనక్కి వెళ్లలేవు. వలలో ఉండవలసిందే. ఇదంతా రాత్రి జరుగుతుంది. ఉదయమే వేటగాళ్లు వెళ్లి వలలోని కుందేళ్లను పట్టుకుంటారు, చాలా తొందరగా. చేతికి చిక్కకుండా పరుగెత్తే కుందేళ్లని ఇలా యుక్తిగా బంధించి...

పాడేరు సంతలో మాంసాహారులకో, పెంచు కునేవారికో అమ్ముతారు. వీళ్లు పిట్టలని పట్టడం కూడా తమాషాగానే ఉంటుంది. **పురిటి పిట్టల**ను చిన్నవాటిని తెచ్చి తాము అరవమన్నపుడల్లా అరిచేలా దానికి శిక్షణ ఇస్తారు. ఆ పిట్టని వెదురు గూడులో ఉంచి, వీళ్లు దగ్గరలో దాక్కుని... పిట్టలని పట్టే పురిటి పిట్టచేత అరిపిస్తారు. పక్షులు ఆ ప్రాంతాలకు రాగానే, అవి ఈ పిట్ట అరుపులకాకర్షింపబడి వెదురు గూట్లోకి వొస్తాయి అమాయకంగా. అంతే అవి ఇక మరి తిరిగి వెళ్లలేవు. ఆవిధంగా ఉంటుందా గూడు. కొండకోళ్ల చేత కూడా ఇలాగే

కూయించి కొండకోళ్లని పడతారు గిరిజనులు. వీటన్నిటినీ తాము తిన్నవి తిని మిగిలిన వాటిని సంతలో అమ్మి సొమ్ముచేసుకుంటారు.

గిరిజనులు విద్యావంతులుకారు సరిగదా అమాయకులు కూడా. వీరిని వ్యాపారస్తులు ధర దగ్గరనుంచీ తూకంవరకూ ప్రతి దశలోనూ వంచిస్తూనే ఉంటారు. వీరిలా వంచనపాలు కాకూడదనే గిరిజనాభివృద్ధి సంస్థలు స్థాపించబడ్డాయి. అవి గిరిజనులకు అప్పులిస్తాయి- వ్యవసాయంకాని, పాడి పరిశ్రమకాని అభివృద్ధి చేసుకుందుకు. వీరు తెచ్చిన పంటలకు ధర కట్టి, కొంత అప్పు జమకట్టుకుని మిగిలినది వీరికివ్వాలి. కాని...

గిరిజనాభివృద్ధి సంస్థలలో పనిచేసేవారు టౌన్లవాళ్ళు... వాళ్ళకి గిరిజనులమీద ప్రేమా ఉండదు, దయా ఉండదు. తిలా పాపం తలా పిడికెడని... వారూ వీరిని శాయశక్తులా మోసం చేస్తూనే ఉంటారు. ప్రభుత్వ విధానాలు కూడా లోపభూయిష్టం. ఏ జెర్సీ ఆవునో గిరిజనులకిస్తే- వారు దానికి సరిగా తిండీ పెట్టలేరు, దానికీ వాతావరణం పడనూ పడదు. ఆవు చచ్చి అప్పు మాత్రం మిగులుతుంది. కాఫీ తోటల పెంపకం, మిరియాలతోటల పెంపకం వంటి నిర్వహణ కష్టమయిన... పెట్టుబడు లధికంగా ఉండే, సాంకేతిక పరిజ్ఞానమవసరమయ్యే అంశాలమీద వీరికప్పులివ్వడంవల్ల వీళ్ళు బాగుపడేదానికంటే రుణగ్రస్తులుగా మిగిలేదే ఎక్కువ.

గిరిజనులు సాధారణంగా అడవుల అంచులలోనే తప్ప అరణ్య మధ్యాలలో ఉండరు. రవాణా సౌకర్యాలలేమి, క్రూర జంతువులు, ఆహార సముపార్జన, దట్టమయిన అడవిలో వ్యవసాయం అనువు కాకపోవడం, కారణాలుగా అడవి అంచునుంచి లోపలికి కొంత భాగం వదిలి- అక్కడ సరిహద్దు వేస్తారు, సర్వే రాళ్లతో. దాని లోపలిదంతా రిజర్వ్ ఫారెస్టు. అది అటవీశాఖకు చెందినది. ప్రభుత్వ ఆస్తి. దానిపైనే ఫారెస్ట్ గార్డ్‌లు అజమాయిషీ చెయ్యాలి. రిజర్వ్ కాని భాగంలో గిరిజనులకు వారు చేసే వ్యవసాయమూ మొక్కల పెంపకమూ బట్టి ఆ భూభాగానికి వారికి సర్వేశాఖవారు పట్టాలిస్తారు. పట్టాలు కల గిరిజనులు ఆ భూభాగంమీద హక్కుదారులౌతారు. వారు ఒకవేళ అమ్మదలుచుకున్నా మరొక గిరిజనుడికే తప్ప పైవారికమ్మకూడదు. తాము వ్యవసాయం చేసుకోలేకపోతే కౌలు కివ్వవచ్చును. కౌలంటే సంవత్సరానికింత చెల్లింపు అని. అది- పంటలో భాగమైనాకావొచ్చు, నగదయినా కావొచ్చు ఇలాగ పట్టాలివ్వగా కూడా కొంత బంజరు భూమి మిగిలి ఉంటుంది. కొత్తగా అక్కడి కెవరేనా గిరిజనులు వొస్తే యీ బంజరు భూమిలోంచి కొంత భాగం కేటాయిస్తారు. పెద్దల సమక్షంలోనే భూమికి హద్దులుగా సర్వే రాళ్ళు పాతడం జరుగుతుంది. ఒకవేళ అలా బంజరు భూములు లేకపోయినా గిరిజనులవి ఉదారహృదయాలు కనుక వీలయిన వారు- కొత్తగా వచ్చిన వారికి నేల ఏర్పరచుతారు. ఇలాగ గిరిజనులు భూమిని కలిగి

ఉంటారు గానీ అవి సారవంతమయిన భూములు కావు. నీటివనరులుండవు. జంతువులు పక్షులనుంచి పంటలకు ముప్పు, చీడల బాధ. ఇన్ని కారణాలుగా దిగుబడి ఆట్టేరాదు. కష్టానికి తగిన ప్రతిఫలముం డదు. అందుచేతనే వారి పేదరికం వారిని వదలదు. పైగా వారికి సారానో, కల్లో లేక పోతే దినము గడవదాయె. వీరు చేసే వ్యవసాయమూ వీరు చేసే అనేక యితర పనులలా అరకొరగానే ఉంటుంది. ప్రకృతి మీదే అధికంగా ఆధారపడతారు వీరు.

మర్రిచెట్లు చిగురువేయడం మొదలుపె డితే- నారు పోసే సమయమొచ్చిందని గుర్తి స్తారు. ముహూర్తాలకి కూడా-చుక్క ముహూర్తగాళ్ళనే ఆశ్రయిస్తారు. చుక్క ముహూర్తగాళ్ళంటే నక్షత్రాలనిబట్టి ముహూర్త నిర్ణయం చేసేవారు. పెళ్ళిళ్ళకు, పండగలకి, దుక్కి దున్నడానికి, అన్నిటికీ ఈ చుక్క ముహూర్తగాళ్ళే ముహూర్తం నిర్ణయి స్తారు. శాస్త్రవిజ్ఞానాన్ని ఒక పట్టాన అమలు జరుపరు.



మహారాజు కుటుంబం తెచ్చిన సామగ్రికి పెద్ద ధర రాకపోయినా తొందరగానే అమ్ముడు పోయింది. అలచందలకూ నేల చిక్కుళ్ళకి మంచి ధరే పలికింది. ఈమధ్య పత్రికలూ, టీవీ తెగ ప్రచారం చేస్తూండ డంతో ప్రకృతి సహజంగా దొరికే వస్తువు లకి గిరాకీ బాగా పెరిగింది. అలచందలలో ఐరన్ ఉంటుందనీ, నేల చిక్కుళ్ళు ప్రొటీన్ మయమనీ, పసుపు పదివేల విధాలుగా సౌందర్య రక్షణి అనీ వ్యాసాలు వస్తూండ డంతో కొనేవారు పెరిగి వ్యాపారస్తులు వాటికోసం కొండ సంతల కెగబడుతు న్నారు.

సంత- రెండు గంటలకు ఎత్తివేస్తారు. గిరిజనులు చీకటి పడకుండా తను గూడేలు చేరాలి కదా? సరుకు అమ్మకమైపోవడంతో, వొచ్చిన డబ్బులో కొంత పెట్టి కిరసనా యిలు, అగ్గిపెట్టెలు, నూకలు, ఉప్పు కొని, మిగిలిన డబ్బుతో పిల్లలిద్దరికీ లాగులు కొన్నారు. పూసమిఠాయి తినిపించారు. అందరికందరూ బండిమీద కూల్‌డ్రింక్ అని అమ్మే రంగునీళ్ళు తాగారు. ఆఖర్న సారాసీసాలూ గారెలూ కొన్నారు. గిరిజనా భివృద్ధి సంస్థ ఉద్యోగులతో గిరిజనులకు పనులుంటాయి. సరుకులివ్వడం, అప్పుచెల్లు పెట్టించుకోడం వంటివి. కనుక.... వారు వొత్తిడి చేస్తే కాదనలేక గిరిజన స్త్రీలు వారి వెంట వెళ్తారు. అక్కడ ఆ మహానుభావుడొ క్కడే కాక మరికొంతమంది కూడా ఆమెననుభవించి వొదులుతారు. దయామ యుల్లా చేతిలో కొంచెం డబ్బుంచుతారు. ఆ తరువాత సదరు వ్యక్తి ఈమెను తనకి తెలి సినవారికి తార్చుతూ తాను చేసుకునే సొమ్ములో కొంత ముట్టజెబుతుంటాడు. ఆమె ఈ సంపాదనకి అలవాటుపడి సంత ఎప్పుడా అని ఎదురుచూసే స్థితికి వస్తుంది. అయితే ఆమె ఎన్ని వ్యవహారాలు నెరపినా సంత ముగిసేలోగానే. సంత ముగిశాక ఏ చిరుతిళ్లో తిని, పాడేరు వూరి మొగదలకు చేరుతారందరూ!

అసలు సంతకు రావడంతోనే ఎవరి సరు కుతో వారు విడిపోయి సంతలో తలో చోటూ చూసుకుంటారు. ఉదయం రాగానే వొండుకుతిన్న కుండలూ ముంతలూ సర్దు కుని గోనెసంచులకో కావడికో ఎత్తి బయలు దేరుతారు. సంతకొచ్చేటప్పుడు తేవడానికి మరీ ఎక్కువ సరకుండి, మోయడానికి తగి నంత మంది తనవారు లేకపోతే కావిళ్లు వేస్తారు. అప్పుడప్పుడు కొందరు మూటలని గాడిదకెక్కించడం కూడా కద్దు. పాడేరు ఊరు పొలిమేరలు దాటి కొండెక్కడం మొద లవగానే... ఆగిపోతారు. సామాను దించేసి సారా కాయలు బయటకు తీస్తారు. సంతలో కొని దాచిన చిరుతిళ్ళు, చేగోడీలో



పకోడీలో కారప్పూసో కూడా బయటపెడ తారు. కుటుంబం కుటుంబమంతా సారా తాగడం మొదలెడతారు. పెద్దలు పిల్లలకు తాగడం నేర్పుతారు. తల్లి ఉగ్గుపాలు పట్టినా మానినా- తండ్రి పిల్లలకి సారా మాత్రం కచ్చితంగా పట్టి తీరుతాడు. గిరిజ నుల ఉద్దేశంలో సారా తాగనివాడు మనిషే కాడు. వాడిది జన్మేకాదు. మహారాజూ... కొడుకులూ... కోడళ్లూ... మనవడు, మన మరాలు అందరూ రోడ్డు అనే ఆ కాలిబాట మీదే కూర్చుండిపోయారు వలయాకారంగా. మధ్యలో సారాసీసాలూ, చిరుతిండీ. మహా రాజు సరిగ్గా సారా కాయ నోటికెత్తబో తుంటే, "కిల్లోడా!" అంటూ వొచ్చాడు తను. కొంచెం నాగరికతలో బతుకుతున్నట్లున్నా అతని రూపం అతన్ని గిరిజనుడని పట్టి స్తూనే ఉంది. కొంచెం లావు పెదవులు... మోటుగా చదరంగా ఉండే ముఖం... బల్బులాటి ముక్కు, చర్మంలో ఒకవిధమ యిన నిగారింపు, థైరాయిడ్ వ్యాధి లక్ష ణాలు.

"రారా కొర్రా! ఏటిశేసాలు? రా... సారా పుచ్చుకో, సమయానికొచ్చినవ్" అంటూ సీసా అందించి, అతనొక పెద్ద గుక్కతాగి కింద పెట్టేక మళ్ళీ అన్నాడు.

"చెప్పు"

"పాడేరొచ్చిన"

"దేనికీ? "

"ఆమజ్యా మాయమ్మ కాలిరిగినది"

"మరేటి జేసినవ్? "

"మా గూడెపు పూజారి ఆయనకు వొయిజ్యం దెలుసుగందా? మందు పూసి బూరుగు సెట్టు బెరడుతో కట్టుగట్టి వెదురు పేళ్లతోన బిగించి, బందోబస్తు చేసినాడు. మందూ తినిపించాడు, కోడిగ్రుడ్డు, కోడి యేపుడు దట్టంగా బెట్టించినాడు. బాగానే ఉన్నది గాని, ఓ పాలి పాడేరు ఆస్పిటాల్లో జూబించిరా పో అనినాడు. నాకయితే యిష్ట ములేదనుకో. గాని, పూజారి చెప్పిండు గదా అని తెచ్చినాను. అంతా బాగు అన్జెప్పినాడు సూదిమందు డాట్టరు. అమ్మనటు బండిమీ దంపేసి నేనిటు పారొచ్చినాను మిమ్ములను జూసి చాలాదినములయినదని"

"మంచి పని జేశావ్" అన్నాడు అర్జున.

"మీ గూడేనిగ్గాని అన్నలొచ్చినరా? " అడి గాడు కొర్ర.

అన్నలనగానే మహారాజు ఆలోచనలో పడిపోయాడు. అతని మెదడులో జ్ఞాపకాలు రేగాయి



ఆవేళ తనూ గంటందొరా వాళ్ళింటిదగ్గర కూర్చుని చుట్టకాల్చుకుంటూ కబుర్లు చెప్పు కుంటున్నారు. చిన్ననాటి ముచ్చట్లూ వూసులూ కలబోసుకుంటుండగా పంతులు పారొచ్చినాడు, కంగారు పడిపోతూ, "పూజా రిగారూ! తమరొక్కసారి యిస్కులుకి రాండి" అన్నాడు కచ్చులో కందులేపేస్తున్నట్టే.

"ఎందుకు? "

"అన్నలొచ్చినారు"

"అన్నలెవరు? మేమే అందరికీ అన్నలం. వయసులో మాకంటె పెద్దోళ్ళుండేది కష్టం"

"అలాటన్నలు గారు వీరు వేరు. మీరొక సారి రండి"

బంకలా పట్టుకుని కదిలేవరకూ వొదిలా డుకాదు. గంటందొరతో పాటే తనూ వెళ్ళాడు ఆ అన్నల తమాసేటొ చూద్దామని.

తమని యీవలుండమని... తాను బడి లోకి వెళ్ళాడు. రెండు నిముషాలు గడి చినయ్యో లేదో నలుగురు కుర్రాళ్ళు జబర్ద స్తీగా వొచ్చారు. వాళ్ళు ప్యాంటు చొక్కాల దిరేసులో ఉన్నారు. ఒకళ్ళిద్దరు కళ్ళకి జోడు పెట్టారు. అందరి కాళ్ళకీ జోళ్ళు న్నయ్. ఒక కళ్ళద్దాలవాడు తననే అడిగాడు





"ఇదేనా బడి? "

"ఊ"

"బడి యిలాగా ఉండడం? పశువుల పాకల్లె ఉంది"

"గూడెం కద? రాజు పాకలలో అన్నీ పాకలే మరి. తమరెవరు? పట్నపోళ్ళా? "

"ఆ... అన్నలం"

"వయసు జూస్తె చిన్నోళ్ళ మాదిరీ తమ్ముళ్ళ మాదిరే ఉన్నది"

"వయసన్నలం కాము. అన్యాయాన్నెదిరిస్తాం. అందుకని అన్నలమంటారు. ఎక్కడా అన్యాయం ఉండనివ్వం"

"ఇక్కడేమీ అన్యాయం లేదే!"

తన మాట వినిపించుకోకుండా సాలలోకి నడిచి "మాస్టరూ!" అని పిలిచారు.

"ఎవరు సార్ మీరు? "

"అన్నలం"

"అంటే? "

"నక్సలైట్లం"

భయంతో వొణికిపోయాడు మాస్టరు. "ఎందుకొచ్చారు సార్? "

"నీ స్కూలు తనిఖీకి. హాజరుపట్టీ తియ్"

"మీరు ఎడ్యుకేషనల్ ఆఫీసర్లు కారు కదా? "

"అంత కంటే గొప్పవాళ్లం. మర్యాదగా తియ్" జేబులోంచి పిస్టల్‌లాటిది తీశాడు కళ్ళద్దాలవాడు. టీచరుకి ముచ్చెమటలు పోసేశాయి. నిలువునా వొణికిపోతూనూ చెమటలు కారిపోతూను హాజరుపట్టీ అందించాడు. అతనది చూస్తూంటే మరొకడు తరగతిలో ఉన్న పిల్లల్ని లెక్కెట్టసాగాడు.

"పట్టీ ప్రకారం నలభై ఐదుగురు విద్యార్థులుండాలి"

"పధ్నాలుగురే ఉన్నారు" అన్నాడు లెక్కపెట్టినవాడు.

"దీనికి నీ సంజాయిషీ ఏమిటి? "

"నేనేం చెయ్యగలను? మొదట యింటింటికీ వెళ్ళి విద్య యొక్క ఆవశ్యకత అందరికీ బోధించి తమ పిల్లలను బడిలో చేర్పించి నాకుఉద్యోగావకాశం కల్పించమని కాళ్ళావేళ్ళా పడ్డాను. ఎలాగో నలభై పేర్లు నమోదుచేశాను. కాని... తీరా బడి తెరిచాక ఎవరూ రారే? బతిమాలితే రోజూ ఓ పది మందో పన్నెండు మందో వొస్తారు. ఇవాళ నయమే. ఈ రోజు వొచ్చిన వారు రేపు రారు. రేపొచ్చిన వారు ఎల్లుండి రారు. ఈ బడిలేకపోతే నాకుద్యోగముండదని కాని వీళ్ళకి చదువేమిటి? "

వీళ్ళు యిలా మాట్లాడుతూంటే- ఒక అన్న పిల్లల చదువు పరీక్షించి "హోప్‌లెస్! ఒక్కడికీ ఒక్కక్షరమ్ముక్కా రాదు" అన్నాడు చిరాకుగా.

"చెప్పానుగా, వీళ్ళకి చదువుమీద బొత్తిగా శ్రద్ధలేదని"

"చెప్పేందుకు ముందు నీకుందా శ్రద్ధ? " గద్దించాడొక అన్న. "మీరే ఇలా దేశాన్ని తగలెట్టేస్తున్నారు. విద్యలేకనే... నిరక్షరాస్యుల శాతం ఎక్కువయ్యే- రాజకీయ నాయకుల ఆటలు సాగుతున్నాయి. ప్రజలు నిరక్షరకుక్షులూ తమ మంచి తాము తెలుసుకోలేని వారూ కనుకనే రాజకీయనాయకులూ అధికార యంత్రాంగమూ ప్రజల జీవితాలతో చిత్తమొచ్చినట్లు ఆడుకుంటూ దేశాన్ని భ్రష్టుపట్టించేస్తున్నారు. ఊc. ముందు నీ జ్ఞానమెంతో చూస్తాం. నీకు అన్నల గురించి ఎంత తెలుసు? చెప్పు"

మాస్టరు బిక్కచచ్చిపోయాడు. బడిపెట్టిన ఆరు నెలలలోనూ యిలా ఎవరిఎదుటా భయభక్తులతో నిలబడవలసిన అవసరం రాలేదు. చదువుకున్నవాడని కొండవాళ్ళు



గౌరవంగానూ భక్తిగానూ చూస్తూ వొచ్చారు అంతలో ఒక అన్న ముందుకొచ్చి

"నక్సల్‌బరీ ఉద్యమం ఆధారంగా నక్స లైట్లు ఉద్భవించారు. ఆంధ్రదేశంలో నక్సలై ట్లనే అన్నలంటారు. వీళ్ళు అన్యాయాన్ని అరికట్టడానికి కంకణం కట్టుకున్నారు. వ్యవ స్థతో దానిలోని లోపాలతో విసిగిపోయి విప్లవిస్తున్నారు. మా విశ్వాసం విప్లవం. విప్లవం. విప్లవం. తుపాకి గొట్టం ద్వారా మాత్రమే సమసమాజం స్థాపించబడగ లదు. ముందీ సమాజాన్ని... వ్యవస్థను సమూలంగా నాశనం చేయాలన్నంతగా ఇది కుళ్ళిపోయింది. అట్టడుగు మనుషులు. బడుగు వర్గాలవారు బాగుపడాలి. అందుకు- ధనవంతులు నశించాలి. కార్మి కులూ శ్రామికులూ అప్పుడే రాజ్యమేలగలు గుతారు.

"ఈ ప్రభుత్వాన్ని కూలద్రోయాలి. కూకటి వేళ్లతోసహా దీనిని పెకలించి పారేయ్యాలి. శ్రామికులకు పట్టం కట్టాలి. నిజమయిన మేధస్సుకు, ప్రతిభకు పెద్దపీట లభించాలి. అన్యాయం, దోపిడీ అనేవి ఎక్కడా ఉండకూ డదు. అలాటి రాజ్యం స్థాపించడమే మాధ్యేయం. ఈ కుళ్ళిపోయిన వ్యవస్థతో మేధావి వర్గం విసిగిపోయింది. ప్రభుత్వ, పాలనా విధానాలు మేధావుల సహనాన్ని సంపూర్ణంగా తినేశాయి. ఈ వ్యవస్థకు సంపూర్ణస్థాయిలో క్షాళనం కావాలి. నిజమ యిన మనిషికీ ప్రతిభకీ సమాజంలో స్థానంలేకుండా పోయింది. అందుకే నక్స లైట్ ఉద్యమంలో డాక్టర్లు, ఇంజినీర్లు, ప్రొఫెసర్లు మొదలయిన మేధావులెందరో ప్రముఖ పాత్ర వహిస్తున్నారు. యువతీ యువకులెందరో దీనికి అండగా నిలుస్తు న్నారు. ఈ వ్యవస్థ యువతకేం చూపగలు గుతోంది! నిరుద్యోగం... నిరాశాపూరితమ యిన భవిష్యత్తు. నిస్పృహ! అసమర్థ... అన్యాయ ప్రభుత్వాలు యువతని నిర్వీర్యం చేసి వొదిలేశాయి. ఎన్నాళ్ళిలా? ఆకలితో చావడంకంటే తుపాకి గొట్టంతో మరణిం చడం మేలు. యువత విప్లవిస్తోంది. ప్రభంజనంలా విరుచుకుపడుతోంది నక్స లైట్ ఉద్యమం ద్వారా. కొత్త సమాజం ఆవి ర్భవించబోతోంది. నక్సలైట్ ఉద్యమకారులే నవసమాజాన్ని ఆవిష్కరించబోతున్నారు. అరచేతిని అడ్డుపెట్టి సూర్యకాంతి నాపలేరు. అన్యాయాలకు, అక్రమాలకు, అవినీతికి తుపాకి మాత్రమే పరిష్కారం. క్లుప్తంగా యిదీ మా ఆశయం"

జడివానలా... హోరుగాలిలా సాగింద తని ఆవేశపూరిత ఉపన్యాసం. మధ్యమధ్య కొన్ని కవితా పంక్తులు- వాటికవే ఆకర్షణీ యంగా ఉన్నాయి. దానికితోడు అతను వాటిని ఒక లయతో గానంచేసినట్లుండడం వలన అవి మరింత ప్రతిభావంతంగా ధ్వనించాయి.

అయితే రాజకీయాలు తెలీని ఆ బడిపం తులికి మాత్రం అంత ఉపన్యాసం విన్నాక కూడా ఏవేవో అనుమానాలే మిగిలాయి. ఒకచేతి అయిదు వేళ్లే సమానంగా ఉండవు. ఐదూ సమానంగా ఉండేవేళ్లతో చెయ్యి- సరిగా పనిచెయ్యజాలదు. బొటనవేలు విడిగా... పొట్టిగా... ధృడంగా... మిగిలిన వాటికి ఎదురుగా ఉంటేనే చేతికి పట్టు సాధ్యమౌతుంది. మరి మనుషులు మాత్రం అందరూ ఒకే మూసనుంచి వొచ్చినట్లు ముమ్మూర్తులా సమానంగా ఉంటే... సమ ర్థత కోల్పోదూ అన్యాయాన్ని ఖండించవల సిందే కాని... ఏది న్యాయమో ఏది అన్యా యమో ప్రతివారూ తేల్చి చెప్పగల్గేంత సర ళంగానూ సులభంగానూ కాక అతిసంక్లిష్టం గానూ సంకీర్ణంగానూ ఉంటుందే మానవ జీవన మార్గం!

ఏదో ఒక స్థాయిలో దోపిడీ అనేది లేకుండా మానవ జన్మే ఉండదే! అసలు- దోపిడీ అంటే ఏమిటి? శృంగారం కోసం స్త్రీ

శరీరాన్ని కొంత హింసించడమో బాధించ డమో చేయాలి పురుషుడు. తప్పదు. ఆమె స్త్రీత్వాన్ని దోచుకోడమేనా అది? మరి అలా టిదీ దోపిడీయే అయితే సృష్టి ఎలా సాధ్యం? శ్రమకి రూపాయల్లో విలువ కట్ట డంద్వారా కదా అదనపు శ్రమ విలువ సిద్ధాంతం వివరించబడింది? కచ్చితంగా శ్రమని రూపాయలలోకి మార్చడం సాధ్య మేనా? శ్రమ- రూపాయల జరత్రి ఒక ఒడంబడిక మాత్రమే కాగలదు తప్ప అది దోషరహితమెలా ఔతుంది? ఒక రిక్షావాడు మనిషిని లాక్కుని వెళ్ళినందుకు పడిన శ్రమకి విలువ యిన్నే రూపాయలని తిరు గులేని రీతిలో నిర్ధారించగలమా? నగరాల్లో అదే శ్రమకు ప్రతిఫలం ఎక్కువ లభి స్తుంది. వర్షం పడుతూంటే రిక్షా రేట్లు పెరుగుతాయి! రాత్రులు రిక్షా రేటెక్కువ! అంటే పరిస్థితినిబట్టి రేటు పెరుగుతుంది! వీటన్నిటినిబట్టీ మారే రేట్లులో శ్రమవిలువ నిర్ధారణ సామాన్యుడికి సులభమా?

మార్గాలు ధ్యేయాన్ని సమర్థిస్తాయం టారు. నీ మిత్రులెవరో చెప్పు, నువ్వేమిటో చెబుతానన్నట్లే- ధ్యేయాన్ని సాధించేందుకవ లంబించే మార్గాలు మంచివి అవాలం టారు. మంచి మార్గమే మంచి ధ్యేయానికి దారి చూపగలదంటారు. మరి- విప్లవమూ, పోరాటమూ, తుపాకీ, హత్యలు నిశ్చయంగా మంచి మార్గాలు కావే! మంచి మార్గాలు కానివి మంచి ధ్యేయాలను సాధించగ లవా? అలా సాధించబడినా అవి మంచి కాగలవా?

అన్యాయాలకూ అక్రమాలకూ పాల్పడేవా రిని... ధనవంతులని... చంపడమే వీరి ఉద్దేశంలా ఉంది. ఏదేమయినా వాళ్లూ మనుషులే కదా? విశ్వమానవులంతా సోద రులే అన్న పలుకుల ప్రకారం- చెడ్డవాళ్ళ యినా అన్నదమ్ములేకదా? అన్నదమ్ములని హతమార్చడం అన్యాయమూ అధర్మమూ కాదా? ఎందుకయినా సరే సాటి మనిషిని మట్టుపెట్టడం మానవత్వానికి వెక్కిరింపు కాదా? గులాబి మొక్క- నీరు పోస్తే పూలు పూస్తుంది కాని రక్తం పోస్తే గులాబీలు పూస్తుందా? వ్యవస్థలో లోపాలుండవొచ్చు సమాజానికి చిన్నప్రతీక (మినియేచర్) అయిన కుటుంబంలో... పదిమంది కూడా సభ్యులుండని సంసారంలోనే లోటుపాట్లుం టాయి, ఉంటున్నాయి. ఇంట్లో చీమలున్నా యని యింటి కగ్గిపెట్టుకుంటారా వివేకుల యినవారు? సమాధులమీద మళ్ళీ కట్ట డాలు కట్టరే. స్మశానం భవననిర్మాణానికి కూడదే. మరి- ప్రస్తుత సమాజాన్ని కూల ద్రోసి ఆ స్మశానం మీద నవసమాజస్థాపన చేస్తామంటారేం యింత విద్యాధికులూ?

అతనిలో ఎన్నో అనుమానాలు, సందే హాలు, చిక్కు ప్రశ్నలు. జవాబులు తెలుసు కోవాలనే కుతూహలం. కాని... వారి చేతు ల్లోని పిస్తోళ్ల భయంతో అతని నోరు నొక్కేశాయి.

"మా విప్లవానికి... ఉద్యమానికి- విద్యే తగిన ఆయుధం. అందుచేత విద్య నేర్పేవా రిని మేమొక కంట కనిపెడుతుంటాం. సరే, ఇంతకీ మీదేవూరు? " అన్నారు, వారిలో ఒకరు.

"మాడుగుల"

"రోజూ బడికి వొస్తున్నావా? "

"ఊఁ"

"అబద్ధం... వారానికి రెండు రోజుల యినా రావడంలేదు గదూ! నిజం చెప్పు"

"మరి...మరి... మాడుగులనుంచి రోజూ రాలేక" నీళ్ళు నమిలాడు టీచరు.

"ఎందుకు రావాలి అక్కడినుంచి? ఇక్కడే ఉండు"

"బసదొరకదు. అదీకాక ఒంటరిగాడిని"

"అదంతా మాకనవసరం. నువ్వు రోజూ



బడికి రావాలి. చదువు చెప్పాలి"

"అలాగే... కాని... పిల్లకాయలు రావాలి కదా? "

"వొస్తారు. మరొక విషయం. మేమిక్కడి కప్పుడప్పుడు వొస్తూంటాం. మేమేదడిగినా చేస్తుండాలి. డబ్బిస్తుండాలి తెలిసిందా? మేమిలా వొచ్చి వెళ్ళిన విషయం కాని పోలీసులకి తెలిసిందో, నీ శరీరం అదిగో, ఆ చెట్టుకి వేలాడుతుందంతే" కఠినంగా చూస్తూ వాక్యం పూర్తిచేశాడతను.

"చెప్పను" వొణుకుతూ వొప్పేసుకున్నాడు టీచరు.

"గుడ్ బోయ్... అహ. గుడ్ టీచర్. వొళ్ళు దగ్గరపెట్టుకు మసలుకో. సరే బడినొదిలాక... మీ గూడెం నాయకుడిని కలుసుకుని మాట్లాడు. అన్నట్లు మీ పూజారిల్లు చూపించడానికెవరినేనా పంపు మాతో. మీ పూజారి పేరేమిటి? "

"గంటందొర"... అంటూ ఒక కుర్రాడిని దగ్గరకు రమ్మన్నట్లు సైగచేసి వాడు రాగానే "వీరికి పూజారి గారిల్లు చూపించి రండి" అన్నాడు.

"మళ్ళీ వొస్తాం" అని వెళ్ళిపోయారా నలుగురూ.

మూడుగ్లాసుల నీళ్ళు తాగినా గుండెదడ తగ్గలేదు టీచర్‌కి. నిజానికతనిదివరకు అన్నల గురించి వినే ఉన్నాడు. అదేమిటో అన్నలు టీచర్లమీద నిఘా వేసినట్లున్నారు. వాళ్ళు తిన్నగా బడికి వొచ్చి పాఠాలు చెబుతున్నారో లేదో అని కనుక్కుంటే సరే. అలా కాదు, అన్నలకి వాళ్ళు డబ్బివ్వాలట. చాకిరీ చెయ్యాలట. సాహిత్యం పంచాలట. గూడెంలో జనాన్ని అన్నలకు ఉద్యమానుకూలురుగా మార్చే డ్యూటీ కూడా టీచర్లకే వేస్తారుట.

టీచర్లకు పాఠాలు చెప్పడంతోపాటు ఎన్నికల డ్యూటీలు, జనాభా లెక్కలు పశువుల లెక్కలు, ఆ లెక్కలూ యీ లెక్కలూ అంటూ అదనపు పనులప్పగిస్తూ పాఠాలు చెప్పనివ్వడంలేదని ప్రభుత్వాన్ని తిట్టుకున్నారు కొందరు టీచర్లు. ప్రభుత్వాన్ని కూలదోస్తామనే అన్నలూ యీ బడిపంతుళ్ళ యెడల ప్రభుత్వంలాగే ప్రవర్తిస్తున్నారు మరి. తను ఎడ్యుకేషనల్ ఆఫీసర్లకేనా భయపడలేదు కాని వీళ్ళకు వొణకవలసి వొస్తోంది. మనుషులని భయపెట్టడమూ బెదిరించడమూ బలవంతంగా ఉద్యమంలో చేర్చుకోడమూ సమంజసంగానే తోచింది కాబోలు వాళ్ళకు. వీళ్ళకంటే మండల్ ఇ.వో.లే నయం. గిరిజన ప్రాంతాలలో పని చేసే తమ సమస్యలనూ కష్టాలనూ కొంత వరకయినా సానుభూతితో అర్థంచేసుకుంటారు. ఇదేం నక్సలైట్లు? వారసలు-నక్సల్‌బరీ, నక్సల్స్ నక్సలైట్స్, అన్నలు... గురించి చక్కగా వివరించనయినా లేదు, జులుంప్రదర్శించడం తప్ప. తుపాకి చూపించి మనుషులను ఎందరి నెంతకాలం లొంగదీసుకోగలరు? తమ సిద్ధాంతాలు సమంజసమయినవీ బలమైనవీ విశ్వశ్రేయోకామ్యాలూ అయితే ప్రజలే వారి వెనుక వొస్తారు. ఇలా బలవంతంగా రుద్దడమేమిటి? ఆలోచిస్తూ వారు పంచమని వదలిన ప్రచార సాహిత్యాన్ని ఎవరికంటా పడనిచోట రహస్యంగా ఎలా దాచాలా అని మధనపడుతూంటే, ఒక అన్న మళ్ళీ వెనక్కొచ్చి... "నువ్వొరా... కలిసి వెళ్ళడమే మంచిది" అంటూ సత్యన్నారాయణని వెంటబెట్టుకుపోయాడు పూజారి దగ్గరకి.

"రండి... దయచేయండి. తమరెవరు పట్నం బాబులు? " ఆహ్వానించాడు గంటం దొర.

"అన్నలం"

దొర సన్నగా నవ్వి... "మీరు అన్నలేమిటి? నా బిడ్డల వయసువారు. బిడ్డలు. ఆc... తమరు జీలుక్కల్లు పుచ్చుకుంటా

మంటే సిద్ధం చేయిస్తాను" అన్నారు.

"చేయించండి. మేము అన్నలమే. నక్స లైట్లం"

"నా కింగ్లీసు రాదు. నక్సలైట్ అని యిన్లేదు"

"ఇప్పుడు వినండి. మేం అన్యాయాన్ని ఏ స్థాయిలోనూ సహించం" ఖండితంగా చెప్పాడా అన్న.

"మంచిదే. సత్యం వధ, ధర్మం చర" అన్నాడు పూజారి పక్కనున్న భీమన్న.

"దోపిడీని సాగనివ్వం"

"సంతోషమయినమాట. డబ్బుంటే దోపిడే. మా గూడెంలో డబ్బు లేనివాళ్లే అంతా"

"మనమంతా ఏకమై ప్రభుత్వంమీదా, పోలీసులమీదా తిరగబడాలి"

"ఎందుకు? వాళ్లేం చేశారు? "

"ఫారెస్టుగార్డులు కూడా ఏమీ దాష్టీకం చెలాయించడం లేదా మీమీద? "

"చెలాయిస్తారు. ఎప్పుడు? మా వోళ్లు హద్దుదాటి రిజర్వ్‌లోకి వెళ్లితే. అక్కడినుంచి కాయో కసరో, కర్రో పుల్లో దొంగిలించుకురా బోతే. నేరానికి శిచ్చ న్యాయమేగద? "

"నేరమెందుకయింది? అడివిమీద ప్రభుత్వమెవరు హద్దులూ, ఆంక్షలూ విధించడానికి? "

ప్రభుత్వమెవరు?

ఆ ప్రశ్నకి మహారాజు దగ్గర కాని... భీమన్న, గంటందొరల దగ్గరకాని జవాబు లేదు. ఉన్నది చాలా అస్పష్టమైనది. ప్రభుత్వమంటే మంత్రులా? ఎమ్మెల్యేలా? అధికారులా? ఏమో. తెలీదు. డబ్బున్నవాళ్లేమో.

"దేశంలో చాలా అన్యాయాలూ, అక్రమాలూ జరుగుతూ దేశం పాడైపోతూంది. ఇక లాభంలేదు. ఉద్యమం ద్వారా, తుపాకి ద్వారా ప్రభుత్వాన్ని పడగొట్టి మన రాజ్యం స్థాపించాలి"

"అందులో అన్యాయాలుండవా? "

"ఉండవు"

"ఏటినమ్మకమలాగని? "

"ఇదీ" పిస్తోలు తీశాడా అన్న జేబులోంచి.

త్రుళ్లిపడ్డారు పూజారీ, భీమన్నా, మహారాజూ. ఒక్కసారి వాళ్ల ముఖాలు జేవురించాయి. మహారాజు దగ్గర విల్లు, బాణము ఉన్నట్లాయెనా- తన కళ్లముందే తమ పూజారికి జరుగుతున్న అవమానానికాగ్రహించి, అవతలివాడి గుండెలోకి ఒక్క బాణమేసేవాడే.

"బెదిరిస్తున్నావా? " నిప్పులు కురిపిస్తూ అడిగాడు.

"లేదు... విషయం చెబుతున్నాను. సంగతి తెలియజేస్తున్నాను. అంతే" అంటూ పిస్టల్‌ని జేబులోకి తోసేశాడతను.

దానితో మహారాజు శాంతించాడు.

"మేం మీకు కొన్ని విషయాలు చెబుతాం. అలా నడచుకోవాలి మీరు"

"ముందు చెప్పండి. తరవాతఆలోచిద్దాం"

"ఇక్కడా కాదు, ఇప్పుడూ కాదు. చావడిలో చెబుతాం. టముకేయించి నలుగురికీ వర్తమానమందించండి, రాత్రికి సభ ఉందని. అన్నలదని మాత్రం చెప్పకండి" అలాగే అన్నట్లు తలూపాడు మహారాజు. బారికకు కబురంపాడు. డప్పు, పుల్ల పట్టుకు మరీ వచ్చాడతను. ఏటి సంగతన్నట్లు చూశాడు పూజారివేపు "రాత్తిరికి చావడిలో సబుందని చెప్పిరా" అన్నాడు మహారాజు పూజారి తరపున. వాళ్ల స్నేహం తెలిసిన బారిక ఓసారి పూజారివేపు చూశాడంతేనా అన్నట్లు. అతను తల పంకించాడు.

"ఈ సభ- గూడెంవాళ్లకి తప్ప మరెవరికీ తెలియకూడదు. జాగ్రత్త. మేం వొస్తాం. సరిగ్గా సమయానికి సరాసరి చావడికే వొచ్చేస్తాం" అని వెళ్ళిపోయారన్నలు.

పూజారి నిట్టూర్చాడు. భీమన్న అతనివేపు చూశాడు. పూజారి భయపడుతున్నాడా? అదతనితత్వం కాదే!

"ఏటవుతోంది గూడేనికి?"

"ఎందుకొచ్చిందీ అనుమానం?"

"ఏటో... ఇంత దూరానా, ఎత్తునా అడవిలోనూ ఉన్నా జనం మనల నొగ్గడంలేదు, సుకంగా మనమానాన్ని బతకనివ్వడంలేదు. రాజకీయాలవాళ్లు... మతాలవాళ్లు చాలక ఇప్పుడీ అన్నలు. రేపు ఇంకెవరెవరో? ఎవరెవరు రాబోతున్నారో? ఏం చేయబోతున్నారో?" అతని కంఠంలో విషాదంతో పాటు కొంచెం భయమూ, వైరాగ్యమూ కూడా కనిపించింది.

"నీ అధికారం పోతుందని దిగులు పడుతున్నావా? పూజారీ" సరదాగా అడిగాడు మహారాజు.

"నా దిగులు నా గురించి కాదు. గూడెం గురించే. మనవాళ్ల గురించే. కాటికి కాళ్లు జాచుకున్నవాడిని. నాకింకా అధికారంమీద మోజా?" వైరాగ్యంగా నవ్వాడు పూజారి.

"అన్నల గురించి భయపడవలసింది" అన్నాడు భీమన్న.

"ఔను. వాళ్ల దగ్గర బందూకులున్నాయి. మన గూడెంలోని ఓ వేటకెళ్లే పోతురాజు దగ్గరుందనుకో. కాని... అతగాడు జంతువులనే చంపుతాడు. అన్నలు అలా విచక్షణున్నవాళ్లలా కనిపించడంలేదు. ఎంత దాష్టీకం చెలాయించారో చూశావుగా"

"నిజమే. నాకయితే ఆ కుర్రెదవలమీద బలేకోపమొచ్చింది. ఏమైతే అదే అయిందని రెండు దెబ్బలు వేసేవాడినే. పైనుంచొచ్చారని ఓపిక పట్టాను" అన్నాడు మహారాజు.

"మంచిపని చేశావ్. సబలో ఏం జెబుతారో చూద్దాం. అప్పుడాలోచిద్దాం"

★ ★ ★

చీకటి పడేసరికి సావడిలో కూడారు గూడెంలోని గిరిజనులందరూ. వాళ్లు కూడిన కొద్దిసేపటికే అన్నలు నలుగురూ దిగారు. శ్రోతలకు పూజారి వారిని పరిచయం చేశాక వారిలో ఒకరు చెప్పసాగారు.

"సోదరులారా! మమ్మల్ని నక్సలైట్లంటారు. తేలికగా వ్యవహరించేందుకు అన్నలుగా పేర్కొంటున్నారు. ఎంత చిన్న స్థాయిలో అయినాసరే అన్యాయాన్ని సహించం మేము. బలహీనులను దోపిడీ చేసేవారికి తగిన శిక్ష విధిస్తాం. పోలీసులు మాకు బద్ధ శత్రువులు. ఈ వ్యవస్థను అహింసలాటి మార్గాలలో మార్చడంమీద మాకు ఎంత మాత్రమూ నమ్మకంలేదు. తుపాకితోనే మార్చగలం. దేశంలో విద్యావిహీనులధికశాతంలో ఉండబట్టే రాజకీయనాయకులు చిత్తమొచ్చినట్లు ప్రజాజీవితాల్తో చెలగాటమాడుతున్నారు. వారి ఆటలు మేము సాగనివ్వం. ప్రజలందరూ విద్యావంతులయితే తప్ప పరిపాలకులు వాళ్ల దగ్గర పెట్టుకు పాలించరు. ధనవంతుడు మరీ ధనవంతుడూ, పేదవాడు మరీ పేదవాడూ ఔతున్న ఈ వ్యవస్థ మారి అందరూ సమంగా సుఖపడగలగాలి. మా ఉద్యమం అందుకే, అది సాధించేందుకే. మొదట నుంచీ గిరిజనులు దేశవ్యాప్త ఉద్యమాల్లో ప్రముఖ పాత్ర వహిస్తున్నారు. గాంధీజీ స్వాతంత్ర్యసమరం ప్రారంభించకమునుపే అల్లూరి సీతారామరాజు మన్యం పితూరీలు లేవదీశాడు. ఆంగ్లేయులకు గిరిజనులు కప్పం కట్టారన్నాడు. వారిని పోరాటానికి తయారుచేశాడు. తెల్లవారి గుండెలలో సింహస్వప్నమై గడగడలాడించాడు. అలాగే ఇంకెందరో బ్రిటిష్ దొరలను భీతావహు

లను గావించారు. ఇప్పుడు స్వతంత్రమొచ్చింది. తెల్లదొరలకు బదులు నల్లదొరలు పాలిస్తున్నారనే తప్ప సామాన్య జనజీవనమేమీ మెరుగుపడలేదు. మరింత అధ్వాన్నమైంది. గిరిజనులను ఫారెస్ట్ డిపార్టుమెంటువారూ, గార్డులూ వేధిస్తూంటే, మైదానంలోని సామాన్యులను పోలీసులు కాల్చుకుతింటున్నారు. ప్రతిభకు అవకాశాలూ, గుర్తింపు తగ్గిపోయాయి. అవినీతీ, ఆశ్రితపక్షపాతమూ, లంచగొండితనమూ దినదినానికీ పెచ్చుమీరిపోతున్నయ్. కేంద్రమంత్రుల స్థాయిలో కోట్ల రూపాయలలో కుంభకోణాలు జరిగిపోతున్నాయి. రాజకీయనాయకులు దేశాన్ని తమ విలాసాలకోసం, ధనికవర్గాల మేలుకోసం అప్పులపాలు చేశారు. ప్రయివేటీకరణ పేరుతో దేశాన్ని అమెరికా వంటి విదేశాలకమ్మేస్తూంది ప్రభుత్వ యంత్రాంగం. అధికారుల జులుం ఇంతింత కాదు. దేశంలో ఆకలీ, ఆకలిచావులూ పెరిగిపోతున్నాయి. ఎన్‌కౌంటర్ల పేరుతో పోలీసులు వ్యవస్థ కెదురుతిరిగిన వారిని రహస్యంగా మట్టుపెట్టేస్తున్నారు. లాకప్‌డెత్‌లు పెరిగిపోతున్నాయి. బడుగువర్గాలకు బతుకు దుర్భరమైపోయింది. ఈ పరిస్థితులను సహించలేక దేశక్షేమమూ బడుగుజీవుల ఉద్ధరణాకాంక్షించి చాలామంది నక్సలైట్లుగా మారారు. ఉద్యమాన్ని నడుపుతున్నారు. మేము మా ఉద్యమాన్ని గిరిజనుల నుంచీ ప్రారంభించడానికి పెద్ద కారణమే ఉంది"

"ఏటో? " ఎవరో శ్రోత ఉండబట్టలేకపోయాడు.

"అందరికన్నా అత్యధికంగా పీడించబడుతున్నదీ, అష్టకష్టాలూ పడుతున్నదీ మీరు. మీలో ఐకమత్యభావం అత్యధికం. టౌను ప్రజలు ఒకపట్టాన ఏకం కారు. మిడిమిడి చదువులవలన వారిలో వంచనా, జ్ఞానమూ, స్వార్థమూ పెరిగాయి. మీరు ప్రకృతి ఒడిలో పెరుగుతూ నిష్కల్మషులుగా, నిరాడంబరులుగా, నిర్మలంగా మిగిలారు"

అతని మాటలు ఉత్తుత్తి పొగడ్తలు కావు. గిరిజనులలో ఎవరయినా మరణిస్తే వెంటనే ఆ విషయం టముకువేసి చెబుతాడు బారిక. అంతే. టముకు వినపడగానే ఎక్కడిపనులక్కడే అలాగే వదిలేసి మృతుడి ఇంటికి పరుగెత్తుకొచ్చేస్తారు. శవాన్ని దహనం చేయాలని నిర్ణయించబడితే ప్రతి ఇంటినుండీ కనీసం ఒక కర్ర అయినా తెస్తారెంతలేనివారయినా. శవం వెళ్లేవరకూ అందరూ ఆ ఇంటనే ఉంటారు. వివాహానికయినా అంతే. అందరికీ కబురు వెళ్తుంది. పైగూడేలనుంచి ఐతే ఇంటికొకరయినా వొచ్చి తీరుతారు. వీరు వొట్టి చేతులతో రారు. గింజలో... కాయలో... గుమ్మడి కాయలో... విస్తరాకులో... ఏవో ఒకటి పట్టుకు మరీ వస్తారు. కష్టంలో అయినా, సుఖంలో అయినా గిరిజనులు ఒంటరిగా మిగలరు. వ్యవసాయపు పనులలో కూడా అలాగే. రేపు ఫలానా వారి భూమి దున్నమని బారిక టముకు వేస్తే దుక్కియేరు (ఎద్దు)న్నవారు వాటినీ, తవ్వుగోల (బొరిగి) లాటి పనిముట్లున్నవారు వాటిని పట్టుకెళ్ళి సాయం చేస్తారు. శుభకార్యాలకు పిలువకుండానూ డబ్బు కోరకుండానే స్వచ్ఛందంగా డోలకివాద్యకళాకారులూ వారూ వొచ్చి గానాబజానా చేస్తారు ఉచితంగా. భోజనాలు చేస్తారు. సారా తాగుతారు. వారిమధ్య సంబంధాలు వ్యాపారాత్మకాలు కావు.

"మీరంతా మేము చెప్పినట్లు వినుకోవాలి. మేము మీ క్షేమం కోరే చెబుతామేదైనా. మాయందు విశ్వాసముంచండి. మీకు ఫారెస్ట్ అధికారులనుంచి చిక్కులు రాకుండా చేస్తాం మేము" వాగ్దానం చేస్తున్నట్లే అన్నాడు అన్న.

అడవి మధ్యలోనే నిజమయిన సంపదుంటుంది. దానిని రిజర్వ్‌గా ప్రకటిస్తుంది ప్రభుత్వం. ఇరుగుడు (రోజ్ వుడ్)లాంటి ఖరీదయిన కలప అడవి మధ్యలోనే ఉంటుంది సాధారణంగా. అలాగే టేకు చెట్లూను. చందనం చెట్లు కూడా విపరీతమైన విలువ కలవి. అయితే ఇవన్నీ అడవి కొనలలో మనజాలవు. అందుకు ముఖ్య కారణం ఈ కలపని దొంగిలించేవారి సంఖ్య అధికం. ఏ వస్తువుకయినా ఖరీదు పెరిగే కొద్దీ కల్తీ అవకాశం, దొంగిలింపబడే ప్రమాదం అధికమవుతుంది.

"మిమ్మల్ని సారావ్యాపారులు అధిక ధరలతో దోచుకుంటున్నారు. కల్తీసారా పోస్తున్నారు. ఇలాటివి అరికడతాం"

ఈమాట గిరిజనులకెంతో నచ్చింది. తక్కువ ధరకి మంచి సారా! వాళ్లు అప్పుడే లొట్టలు వేయసాగారు.

"ప్రభుత్వంతోనూ, పోలీసులతోనూ పోరాటం మాదని చెప్పాముకదా? అది సులభం కాదు. మేమెంతో సమాయత్తం కావాల్సిందే. మా విప్లవకారుల సంఖ్యను పెంచుకోవాలి. ఆయుధాలు సమకూర్చుకోవాలి. ఎన్నో కార్యక్రమాల ద్వారా తప్ప ఇది వీలుపడదు. మేము కొండలనాశ్రయించడం మీ కోసమే. మేము రహస్య స్థావరాలలోనే మీటింగులు పెడతాం. పోలీసులిక్కడివరకూ రావడం కష్టం. వచ్చినా మేము తప్పించుకోవడం సులభం. అడవులే మా కేంద్రాలు. మీరు మాకు సంపూర్ణంగా సహకరించాలి. మా రాకపోకలనూ, కార్యకలాపాలనూ, మీటింగులూ రహస్యంగా ఉంచాలి. మా వివరాలు కాని, ఆచూకీ కానీ మీలో ఎవరినయినా పోలీసులడగగా కాని, స్వచ్ఛందంగా కాని వెల్లడి చేశారో..."

అలా అంటూనే అతను... నాటకీయంగా గాలిలోకి పిస్తోలు పేల్చాడు రెండుసార్లు.

గిరిజనులకర్థమయిందా భాష.

"మనం అన్నదమ్ములం. పీడిత జనులయిన మీరందరూ మాకు తమ్ముళ్లు. మేము మీ క్షేమంకోరి కృషిచేస్తాం. అందుకే మేమన్నలం. మేము మీకెన్నో విషయాలు చెపుతాం. మీకు అండగా నిలుస్తాం. ఈ అన్నలను మీరు మీ హృదయాలలోకి తీసుకోవాలి. మీలో కలుపుకోవాలి. మీ వాళ్లలా చూసుకోవాలి. ఏం? "

"ఓ...!" అరిచారు శ్రోతలు. వాళ్లకిది తమాషాగా ఉంది. ప్యాంటూ, చొక్కా వేసుకునే పట్నపోళ్లెవరూ ఇంతవరకూ ఇలా మనం అనలేదు. అన్నదమ్ములమన్లేదు. ఇది వాళ్లకు కొత్తగానూ, ఉత్సాహంగానూ ఉంది. "మనం మనం బరంపురం" అని అరిచారు ముక్తకంఠంతో.

అన్నలకూ ఆనందం వేసింది వారి స్పందన చూసి! నిష్కల్మషులయిన గిరిజనులు మాటంటూ ఇస్తే మరి తిరగరని వారికి తెలుసు. సభ ముగిసింది. అన్నలు టీచర్‌కి కొన్ని పుస్తకాలూ, కరపత్రాలూ ఇచ్చి "ఇవి ముందు నువ్వు చదివి మా ఆశయాలర్థం చేసుకో. తరువాత బడిపిల్లలకీ, గిరిజనులకీ బోధించు" అన్నారు దబాయింపుగా.

"కాని పిల్లలు... బడికి రారే" మొరపెట్టుకుంటున్నట్లే అన్నాడు టీచరు.

అన్నలు పెద్దలతో సంప్రదించారా విషయం. "మంచిగా తయారవాలంటే మనిషికి విద్యుండాలి. అక్షరాలు రానివాడినందరూ మోసం చేస్తారు. నాగరికులు మిమ్మల్ని అతిసులభంగా దోపిడీ చేయగలుగుతున్నారంటే మొదటి కారణం మీ నిరక్షరాస్యతే. మీ పిల్లలని బడికి పంపండి"

"ఎలా పంపగలం? మావి పూటబత్తెం-పుల్లవెలుగూ బతుకులు. పిల్లా పెద్దా, ఆడా మగా అందరూ అడివికెళ్లో ఆ పనీ, ఈ పనీ

చేస్తూంటేనో కూడా డొక్క నిండడంలేదే. పనిచెయ్యవలసిన కుర్రదో, కుర్రాడో పనులు చేయకుండా బడికిపోయి కూర్చుంటే ఎలా? బువ్వెలా వొస్తది? దినమెలా గడుస్తది? బతకడానిక్కావలసిన అంకెలూ, రూపాయ ల్లెక్కలూ మాకెలాగూ రానేవొస్తయి. ఆకలి తీర్చని అచ్చరాలనేం జేసుకోవాల? నెత్తికి పాముకోనా? పగలెల్లి పాటాలు నేర్చు కుంటూ పలకట్టుక్కూర్చుంటే పనిపాట్లె లాగ? "

వారి మాటలు నిజమే అనిపించింది అన్నలకి. టీచర్ని పిలిచి వారి ఖాళీవేళలో చదువు చెప్పమన్నారు.

"ప్రభుత్వం చెప్పిన టైమింగులు పాటించ కపోతే" నీళ్లు నమిలాడు టీచరు.

"షటప్. ఇక్కడ ప్రభుత్వం మాది. నువ్వు మేం చెప్పినట్లు వినాలి. అర్థమ యిందా? మూడుసార్లు చెప్పు. గిరిజన ప్రాంతాలలో ప్రభుత్వం అన్నలది. నేను వారి సేవకుడిని"

చచ్చినట్లు చెప్పాడా టీచర్. గత్యంతరం లేక!

అన్నలు సాధారణంగా టీచర్లపట్ల కరి నంగా ఉంటారు. వారినదుపులో పెడ తారు. అజమాయిషీలో ఉంచుతారు. వారి ద్వారా డబ్బు వసూలు చేస్తారు. ఎక్కడికి వొచ్చినా వారు ముందుగా పట్టేది పంతుళ్ల పనే. అప్పటినుంచి రాజుపాకలగూడేనికి అన్నల రాకపోకలు మొదలయ్యాయి. వాళ్లు ఏ అర్ధరాత్రి, అపరాహ్నమో హటాత్తుగా ఊడిపడతారు. అన్నం పెట్టమంటారు. ప్రతి ఇంటినుంచి ఇన్ని బియ్యమూ, కాయ గూరలూ... ఏవుంటే అవి తీసుకుని గాడి పొయ్యిమీద అన్నమూ, పులుసు వొండించి తింటారు. అందుకు డబ్బిస్తారు. రాత్రులు చలిగా ఉంటే వారికి కప్పుకుందుకు ఉన్ని వేవో ఇస్తారు. డబ్బున్నవారింట అయితే రగ్గులో, కంబళ్లో తీసుకుపోతారు. ఎదురు చెప్పబోతే తుపాకి తీస్తారు. టీచర్కయితే అన్నలను చూసేసరికి చెమట్లు కారిపో తాయి. వారి డిమాండ్లు అలా ఉంటాయి. వారడిగారో అతను చచ్చీ చెడీ అయినా ఇచ్చితీరవలసిందే. అలాగని వారు దుర్మా ర్గులేం కారు. ఎంతో స్నేహంగా పలుకరి స్తారు. యోగక్షేమాలడుగుతారు. కుశలప్ర శ్నలు వేస్తారు. కష్టసుఖాలు వింటారు. తమ గురించి చెబుతారు. మంచి స్నేహి తుల్లా ఉంటారు. పనిలో మాత్రం మొండి ఘటాలు.

★ ★ ★

రాజుపాకలలో నాగేశుడని ఒక గిరిజను డుండేవాడు. అతని వృత్తి పాములను పట్టడం. పశువులని మేపుకునేవారిలా, కంప లేరుకునేవారిలా... కాయా, పండూ వెదు క్కునేవారిలా ఆకూ, అలమూ కోసుకొచ్చేవా రిలా అతనూ అడవిలోకే వెళ్తాడు. అయితే అతను దట్టంగా చెట్లూ, పుట్టలూ పెరిగిన చోట్లకే వెళ్తాడు. అతనికి తెలుసు అక్కడే పాములుండేదని. పుట్టని బట్టి తెలిసిపో తుంది దేనిలో ఎలాటి పాముంటుంది. మంచి విషపుపాముండే పుట్టపక్కన తిష్టవే స్తాడు. చుట్టుపక్కలనుంచి బంకమన్నుతీసి తగినంత తడిచేసి ఉండమాదిరి నొక్కి, పాముపుట్ట కన్నంమీద కప్పేటట్లుంచు తాడు. ఆ మట్టిముద్దలోకి నిలువుగా ఒక చీపురుపుల్ల గుచ్చుతాడు. అతనికి తెలుసు నాగరికుల ఇంటికి వీధి, పెరటి ద్వారాలుం డేటట్లే- పాము పుట్టకీ రెండు కన్నాలుంటా యని. రెండోకన్నంలో కిరసనాయిలుతో తడిపిన గుడ్డముక్క అంటించి ఉంచుతాడు. ఇక అక్కడ పొగా, కంపూ. ఆ పొగ పాము కన్నంలోకి వెళ్తుంది. వాయుభక్షణతోనే నెలలతరబడి జీవించగలిగే నాగరాజులకి పొగ పడదు. పొగంటే వాయువు కలుషి తమై స్వచ్ఛత కోల్పోదంకదా? సింగము

జీర్ణతృణంబు మేయనట్లే సర్పము కలుషిత వాయువు పీల్చదు. పుట్టలో కల్మషపూరిత మయిన పొగ ఊపిరి సలుపనివ్వకుండా బాధిస్తూంటే- అది రెండవ కన్నంనుంచి బయటకు వొద్దామని బయలుదేరుతుంది. బయటకొచ్చి మంచి గాలి పీల్చుకోవాలని కన్నంవేపు సాగుతుంది. ఆవేపు కన్నం లోంచి చీపురుపుల్ల... పాము పడగతో దానిని తోసుకుంటూ కన్నంవేపుకి, భూమి ఉపరితలంవేపుకి పాకుతుంది. దానితో మట్టిముద్దలోని చీపురుపుల్ల మంత్రం వేసి నట్లు పైకి లేస్తూంటుంది. పుట్టలో పాము పుల్ల అడుగుభాగాన్ని తన తోవకోసం తోస్తూంటుంది కనుక నాగేశుకి తెలిసిపో తుంది నాగరాజు బయటకొస్తున్నాడని. మట్టిముద్దమీద చీపురుపుల్ల లేస్తున్న ఎత్తు నుబట్టి నాగరాజు ఎంతవరకూ వొచ్చాడో అతనికి తెలిసిపోతూంటుంది. పాము దాదాపు కన్నం చివరికి, భూమి ఎత్తుకి రాగానే కన్నం చుట్టూ కుడిచేతిని వల యంలా పెట్టి జాగ్రత్తగా సిద్ధంగా ఉంచి ఠపీమని మట్టిముద్దని పక్కకు కొడతాడు ఎడమచేతితో. మట్టిముద్ద తొలగడమేమిటి,

పాముపడగా కొంచెం మెడా కన్నం బయ టుంటాయి. ఠక్కున మెడ పట్టేస్తాడు, కుడి చేతి వలయాన్ని బిగించేసి. మెడా, పడగా నాగేశు చేతిలో, శరీరమేమో పుట్టలో. కద లలేక బందీ ఔతుందంత పాము. ఇక పాముని బయటకు లాగుతాడు. ఎడమచే తిని కూడా ఉపయోగిస్తూ మెడా, తోకా రెండూ చేతుల్లో ఉంటేనే పాము లొంగేది. తగినంత పొడవులో తోకకాని స్వేచ్ఛగా ఉందో- ఆ భాగంతో మనిషి చేతిని చుట్టే స్తుంది. ఆ చుట్టు, బలం మామూలు మను షులూహించలేరు. పాము దిగువ భాగంతో మనిషి చేతిని చుట్టిందో ఆ బలానికి అత నికి చేతినరాలలో రక్తప్రసరణ ఆగిపో తుంది. చేయి తిమ్మిరెక్కిపోతుంది. పట్టు వొదిలేస్తుంది. పడగని పట్టిన చేయి తోక చుట్టుడుకి వొదులు అవడమేమిటి, మెడని జోరుగా లాగేసుకుని కసితీరా కాటువేసి కన్ను మూసి తెరిచేంతలో చరచర పాకి పోయి అదృశ్యమైపోతుంది. అందుకే ఇటు మెడనీ (పడగ వొంచి కాటు వేయలేకుండా) అటు చుట్టుకోలేనంత చివరలో తోకనీ, రెండింటినీ చిక్కించుకుంటాడు. అలా అయి తేనే అది అతని చేతుల్లో బందీగా ఉంటుంది. అప్పుడు దానినలాగే వెదురుబు ట్టలోనో, కుండలోనో వేసేసి టక్కున మూత వేసేస్తాడు. వెదురుబుట్టయితే పేళ్ల మధ్య ఖాళీల్లోంచి గాలివొస్తుంది. కుండకి పాములనిపట్టి వేసేకుండకి అక్కడక్కడ గాలి రాకపోకలకు చిన్న రంధ్రాలుంచు తారు. పైనున్న గుడ్డలోంచి గాలి పైకి పోగ లదు. గాలాడకపోతే ఎంతటి పామూ బత కలేదు. కుండలో పడిన పాముని కొన్ని రోజులలో వొదులుతాడు. ఇరుకుజాగాలో ముడుచుకుని ఉండే స్వేచ్ఛావిహారం లేకా, స్వచ్ఛమయిన గాలి తగినంత ధారాళంగా లభించకా... భయంవల్లా, బందికానా బాధ వల్లా అది సగం చచ్చుపడిపోతుంది. ఎంత నాగయినా పౌరుషమూ, పొగరూ తగ్గిపో తాయి కుండలో ఉండేసరికి. అప్పుడు దాని నుంచి విషం పిండుతాడు. ఆ విద్య కూడా నాగేశుకి కరతలామలకమే. నాగరికులు పాములకు కోరలు తీసేస్తారనుకుంటారు. కాని నిజానికి కోరలు పీకరు. విషగ్రంధు లలోని విషాన్ని పిండుతారంతే. విషంరాని కోరలు మామూలు కోరలే. పాము విషాన్ని గరళమంటారు. వైద్యానికి చాలా అవసర మది. అమ్మేవాడమాయకుడు కాకపోతే మంచి ధరే పలుకుతుంది దానికి. పాము విషం తెలుగు సినిమాల్లో చూపించేటట్లు నల్లగా ఉండదు. లేత పసుపురంగులో మెరుస్తూ ఉంటుంది. కొన్నాళ్లకు మళ్ళీ కోర ల్లోకి విషం చేరుతుంది గ్రంధుల్లో ఊరి. విషం తీసిన పాములనీ, విషాన్నీ పట్టుకుని

కొండ దిగుతాడు. విషం అమ్ముతాడు. ఊళ్లో పాములన్నిటినీ తిప్పి ప్రదర్శిస్తాడు. మల్లినాగు తెల్లగా మహ అందంగా ఉంటుంది. గోధుమనాగూ గొప్ప సౌందర్య వతే. వాటికయితే శ్రీదేవనీ, రంభనీ... నల్లగా భయంకరంగా ఉంటే చింతనాగు లాటి వాటికయితే చిరంజీవనీ... పొడలు (పెద్ద మచ్చలు)తో లావుగా, పొట్టిగా, అస హ్యంగా కనిపించే పెద్దపొడ (వీటిని కొండ చిలువ పిల్లలనుకుంటారు పట్నవాసులు) కల పాములకు బాబూమోహనని సినిమా వాళ్ల పేర్లు పెట్టి నగరవాసుల సినీతారాభి మానాన్ని సొమ్ము చేసుకుంటాడు. "నాగు పాము ఆడది. జెర్రిగొడ్డు పోతుది. రెండూ పెనవేసుకునేచోట కొత్త వస్త్రం పడేస్తే అవలా పెనవేసుకునే దానిమీద కొచ్చి సంభోగించుకుంటాయి. అవి వెళ్ళిపోయాక ఆ వస్త్రం తీసుకోవచ్చు ఆ వస్త్రం మహిమ అంతా ఇంతా కాదు. అది దగ్గరుంచుకుని ఏ పనిమీద వెళ్ళినా జయమే" అంటూ కథలు చెప్పి మణులూ (నాగమణులు), పాములు పెరట్లో చేరకుండానూ విషాలకు విరుగుడుగా పనిచేసేదీ అయిన తెల్లఈశ్వర వేరూ వంటివమ్మి డబ్బు సంపాదిస్తారు. ఆ ఊరికి ఆ పాములు పాతబడిపోయి చూసే వాళ్లూ, డబ్బులిచ్చేవాళ్లూ తగ్గాక వాటిని ఏ గారడీవాళ్లకో అమ్మేసి కొండకు పోతాడు. నిజానికి పాము చర్మాలకీ గిరాకీ తక్కువేమీ లేదు. అయినా నాగేశు పాములని చంపడు. జరజర పాకిపోతున్న పామును మెరుపు వేగంతో చటుక్కున తోక పుచ్చు కుని విసురుగా లాగి దాని మెడ గాలిలో ఉండేలా తోక పట్టుకుని గాలిలో వేగంగా వలయాలు తిప్పి ఠప్పున దాని మెడ నేల కేసి కొట్టి ఒక్క దెబ్బకు చంపేయగల ప్రతి భాశీలే. కాని పాముని చంపడం అతనికిష్ట ముండదు. పాములమీద బాగానే సంపాది స్తాడు. కాని పట్నంలో మకాం కనక తిండి, సినిమాల ఖర్చెక్కువ. ఆపైన అక్కడ బ్రాందీలూ, రమ్ములూ దొరుకుతాయి. అంచేత కొండకి తిరిగొచ్చేసరికెక్కువ డబ్బులు మిగలవు. అయినా రాజుపాకలలో అతను కలవాడికిందే జమ.

ఆ నాగేశింటికీ వొచ్చారన్నలొక రాత్రి. వస్తూనే భోజనం పెట్టమన్నారు ముగ్గుర న్నలూ. వండించి పెట్టాడు. అతని కన్నల మీద పీకలమొయ్య కోపమొచ్చింది. వాళ్లెవ రని? ఏమిటి వాళ్ల పెత్తనం? తుపాకీ చూపించి బెదిరించడమేమిటి?

రెల్లుగడ్డిమంటలా శీఘ్ర కోపం కాలేదది. గుండెల్లో గూడు కట్టుకుంది. దాంతో పొద్దున్న లేస్తూనే పాడేరెళ్లాడు ఎవరికీ ఏమీ చెప్పకుండా. తిన్నగా పోలీస్‌ఠాణాకె ళ్ళాడు. అన్నల గురించి తనకి తెలిసిం దంతా చెప్పేశాడు. గుండె మంటతో తిరిగి మధ్యాహ్నానికి రాజుపాకలొచ్చేశాడు.

వారం తిరగలేదు. పాముని చంపి తుప్ప లమీద పడేసినట్లు నాగేశు ఊరి మధ్య చెట్టుకి వేలాడాడు. తుపాకీతో కాల్చి చంపా రన్నలతన్ని. ఊరివారిని హెచ్చరించారు.

"మా గురించి పోలీసులకి సమాచారం అందించే ఇన్‌ఫార్మర్లెవరికేనా ఇదే గది పడుతుంది. ఒళ్లు దగ్గర పెట్టుకు మస లండి" అని.

ఆనాటినుంచీ రాజుపాకల గూడేనికి పోలీ సుల రాకలూ, కష్టాలూ ప్రారంభమ య్యాయి. ముందు నుయ్యా, వెనుక గొయ్యా పరిస్థితయింది.

అన్నల గురించి చెప్పమని పోలీసులు హింసలు పెడతారు. కొడతారు. తిడతారు. ఆడాళ్లని చెరుస్తారు. అవితే యివితే అని పీక్కుతింటారు. కోడి కూరేసి కూడు పెట్ట మని పీడిస్తారు.

చెబితే అన్నలు చంపుతారు. చెప్పకపోతే

పోలీసులు బాధిస్తారు. జనం అడకత్తెరలో పోకవక్కల్లా నలగవలసిందే. ప్రతి గూడే నికీ పోలీసు రక్షణ కల్పించే స్తోమతు ప్రభుత్వానికి లేదు. పోలీసులనిటు రాకుండా ఎదుర్కోగలిగేంత సామూహిక బలమూ, యంత్రాంగమూ అన్నలకులేదు. వాళ్లు గిరిజన గూడేలలో రహస్యంగా మీటింగులు నిర్వహిస్తారు. కానీ ఆ మర్నాటినుంచీ పోలీసులు తయారక్కడ. అన్నలయితేనేం, ఎర్రబుట్టలయితేనేం? ఏ రాయయితేనేం? గిరిజనుల జీవితాలలోని శాంతి సౌఖ్యాల్ని కొల్లగొట్టేందుకు అనిపిస్తుంది దూరంనుంచి చూసేవారికి. అన్నలు-ఎర్రబుట్టల మధ్య ఫలితం తెలియని నిరంతర యుద్ధం అది.



కొర్ర-అన్నల గురించి అడిగేసరికి మహారాజు కటుంబంలోని అందరి ముఖాలూ మ్లానమయ్యాయి. సారా తాగుతున్నారేకానీ ఉండవలసినంత ఉత్సాహంగాలేరు. అతను విశేషం చెబుతున్నట్లు చెప్పసాగాడు.

"గంగరాజు మాడుగులకి ఇరవై కిలోమీటర్ల దూరంలో అడివిలో బొంగితల అనే గ్రామముంది. గిరిజన గ్రామమే కానీ కొంచెం పెద్దది. విలేజ్ ప్రెసిడెంటున్నాడు. అతనికి చిన్న చిన్న వ్యాపారాలున్నాయి. వాటిలో చాలా లాభమే సంపాదిస్తున్నాడు. గిరిజనులనుంచి అడవి పంటలను అతి తక్కువ ధరకు సేకరించి టౌను వర్తకులకి మంచి ధరకమ్మడం, అలాగే కలప కాంట్రాక్టర్లతోనూ చేతులు కలిపేవాడు. మీకు తెలియనిదేముందీ? కలప నరుక్కుందుకు కంట్రాక్టు పాడుకున్న స్థలంలోనేకాక పక్క స్థలాలలోవీ చెట్లు నరికించేసుకుని లారీలకెక్కించేస్తారు. అలాగే ఎక్కడేనా గంధంకాని, టేకుగాని, రోజ్‌వుడ్‌లాటి విలువయిన కలపుంటే ఆ చెట్లూ దొంగతనంగా నరికించి చేరేసుకుంటారు. ఇది చూసీ చూడనట్లూరుకోడానికి ఫారెస్టు గార్డులకీ అధికారులకీ కోడిపెట్టలు... విస్కీసీసాలు... డబ్బు... ఆడవాళ్లు.. అలా లంచాలు పెడతారు. నిజంగా అడవులపాలిటి అసలు శత్రువులీ కంట్రాక్టర్లే కానీ మనంకాము. తప్పు ఆళ్లదీ చెడ్డపేరు మనదీను. సరే.. ఆ ప్రెసిడెంటు పీకకి ముడిలేదు. ఆశకంతులేకపోయింది. తాగినకొద్దీ తాగాలనిపించే సారాకేనా సాలనిపించే అద్దుంటాదేమోకాని సంపాదించి పడేసుకునే అన్యాయం సొమ్ము ఎంతయినా ఇక చాలనిపించదుకదా? ఎవరి పేరుతోనో గిరిజనులకిళ్లు కట్టించే ప్రభుత్వ పథకానికి కంట్రాక్టు కొట్టేశాడు కొంత పరపతీ పలుకుబడీ కలవాడవడంతో. పాతిక వేలుచేసే యిల్లు కట్టడానికొప్పుకున్నవాడు యింటి మీద పదేలయినా పెట్టాలా? ఊహుఁ... మరీ ఎక్కువ మింగేసి గిరిజనులను దగాచేశాడు. దాంతో అన్నలకాగ్రహమొచ్చింది. అంతకుమునుపు నుంచీ వాళ్లెన్ని హెచ్చరికలు చేస్తున్నా అతగాడినక పెడచెవిన పెడుతూ వస్తున్నాడు. ఆ కోపమూ ఈ కోపమూ కలిపి ఒక్కసారి చూపించేశారాయనమీద"

"ఏంజేశారే? " కుతూహలం ఆపుకోలేకపోయాడు అర్జున.

"రెండుకాళ్లూ మోకాళ్ల వరకూ నరికేశారు. నరికిన కాళ్లను నక్కలకిసిరేసి మరీపోయారు"

"ఆ!"

"అందుకే చెబుతున్నాను. అన్నల్తో అతి జాగర్తగుండాలి. అసలుకథ అంతటితో అయిపోతే బాగానే ఉండేది"

"మరి? ఇకనేటయింది? " సారా సీసా నోటికందిస్తూ అడిగాడు మహారాజు.

"ఎద్దూఎద్దూ కుమ్ములాడుకుంటే లేగదూడల కాళ్లిరిగినట్లు అన్నలు ప్రెసిడెంటుని శిచ్చిస్తే అద్దెలిసి ఎర్రబుట్టలెన్నో వచ్చి పడి

నాయి గ్రామంమీదకి. వూరికే కూర్చుంటే తోస్తదా పోలీసుల్కి? వాళ్ల చేతులూ బుద్ధీ వొల్లకుంటాయా? ఆరాతీసే మిషతో గుడిసెల్లోకి రాడమూ... అందినవన్నీ దోయడమూ... పదును ఉన్న ఆడది కనిపిస్తే అత్యేచారం చేసేడమూ... పిల్లసచ్చినా పురిటి కంపు పోదంటారే... దొంగబాధ కంటే లింగ బాధెక్కువంటారే అలాగ. అన్నల పీడ అరగంటయితే పోలీసుల పీడ పదోరాలు పట్టి పీడించింది గూడేన్ని. ఇప్పుడక్కడొక్క గుడిసెలోనూ నిలవలులేవు. ఒక్క వయసాడదానికి శీలం మిగల్లేదు. పోలీసుకుక్కలు పదేళ్ల ఆడపిల్ల దగ్గిర్నుంచి ఆరుపదులవ్వ వరకూ అందరాడోళ్లనీ కుక్కల్లా ఎంగిలిచేసేశారు. ఒకసారికాదు... ఎన్నెన్నిసార్లో! ఇల్లుగాలితే బొగ్గులేరుకుపోయే బడాచోరులీళ్లు"

"ఈళ్లది నైటన్నుగానీ..." అంటూ కాస్త గొంతు తగ్గించి "అన్నల పన్లుమాత్రం బాగున్నయ్యా?" అడిగాడు కిల్లోడు. అతని ఉద్దేశంలో తన స్నేహితుడు అన్నీ తెలిసిన సర్వజ్ఞుడే.

"ఆళ్లేమీ తక్కువ దింటంలేదు. ఎంతసేపూ టెలిఫోనెక్స్చేంజీలూ బ్యాంకులూ తగలెట్టడమూ... వ్యాపారులని చంపడమూ... బస్సులు అంటించడమూ ఇలాటి గాతుకాలే. ఇవన్నీ ప్రభుత్వ ఆస్తులు అంటే ప్రజల ఆస్తులు. ప్రజలపక్షమంటూ ప్రజలసొమ్మునీ ప్రజల ప్రాణాలనీ తియ్యడం ఏటిసబబో అన్నలకే తెలియాలి. దమ్ముంటే ఎదురు నిలబడి పోలీసుల్తోనూ ప్రబుత్వంతోనూ పోరాడాలి. అంతేకాని ఈ దొంగచాటు పనులేమిటి? మరోటిదెలుసా మీకు?"

"ఏటి?"

"సందట్లో సడేమియా అని కొందరు బయలుదేరారు. తాము అన్నలమనీ డబ్బిమ్మనీ బెదిరించి లాగేస్తున్నారు. నకిలీ నక్సలైట్లన్నమాట. అసలు దొరలు బయటకు రారు కనుక ఈ వేషగాళ్లు మోసంచేస్తూ ఉత్తరాలు రాస్తూ అమాయక పిరికి వాళ్లదగ్గర్నుంచి డబ్బులు పిండేస్తున్నారు. టౌన్లలో ఇదొక ఆటయిపోయింది. నకిలీగాళ్లకి యాపారమైపోయింది. ఇల్లు కాలుతుంటే కోడిపెట్టల నెత్తుకుపోయేరకాలు"

"బలేగుందే" అన్నాడు కిల్లోడు సారాకాయ నోటికందించి.

"ఆమధ్య కేడీపేటవతల ఎన్‌కౌంటరు జరిగి యిద్దరు పోలీసులూ ముగ్గురు నక్సలైట్లూ సచ్చారు. కొయ్యూరు బ్యాంకుని కొల్లగొట్టారు. పదిరోజులు తిరగకుండనే నక్సలైట్లు ఎక్కడో మీటింగు పెడతారని ఉప్పంది ఆ కొండవూరి దగ్గర నిఘావేశారు పోలీసులు. ఆళ్లూ ఈళ్లూ ఎదురయిపోనారు. తుపాకిల్తో కాల్చుకున్నారు నువ్వా నేనా అని. సచ్చినోళ్లు సచ్చారు. న్యాయానికి పోలీసులు నక్సలైట్లని తప్పనిసరై పోతే తప్ప కాల్చి చంపకూడదు. కాని అనుమానం కలిగి... అవకాశం దొరికితే చాలు కాలుస్తారు పోలీసులు. అందుకే నక్సలైట్లు చంపటం"

"ఎలా సంపేత్తారో మనిషిని చూస్తూ చూస్తూ! జంతువునే చంపబుద్ధి కాదు మన కోపట్టాన"

"మనం సదువూ సంద్యాలేని కొండోళ్లం... ఆళ్లు టౌనోళ్లుకదా? మనవి విల్లంబులూ, ఆళ్లవి తుపాకీలూ. పోలీసులు, నక్సలైట్లూ ఉప్పూనిప్పూ. మధ్య నలిగి సచ్చేది మనం. మన భూమ్మీద ఆళ్ల పోరాటమంటే సెడిపోయేది మన ప్రాంతమే. సెడిపోతూందికూడాను" కొర్ర తన దగ్గర విశేషాలయిపోయినట్లు సారాకాయ తీసుకున్నాడు. కిల్లోడు కొర్రతో నేస్తం కట్టింది వాడు మంచి కబుర్లు కాయ అనే. తరచుగా తిరుగుతూంటాడెక్కడెక్కడో. లోక

సంచారి. తాను కన్నవీ విన్నవీ ఎవరికేనా చెప్పేవరకూ వాడికి నిద్దరపట్టదు. ఎక్కడెక్కడి సంగతులూ చెబుతాడు. రాజుపాకల తరచుగానే వస్తారు. ఈ కబుర్లవల్లే కొర్ర మహారాజు కుటుంబంలోని అందరికీ స్నేహితుడైపోయాడు.

ఒకసారి కిల్లోడూ అతనూ కలసి అడవిలో నడుస్తున్నారు కబుర్లు చెప్పుకుంటూ.

ఎప్పుడూ అందంగానే ఉండే అడవి ఆవేళ మరింత అందంగా ఉంది. పైకంటా పెరిగిపోయిన చెట్లు... నేలమీంచి ఆకాశంలోకి ఆకుపచ్చ తారాజువ్వ వెళుతున్నట్లుగానూ... ఆకుపచ్చరంగు పెన్సిలుతో నిలువునా గీతలు గీసినట్లుగానూ, ఎనుబోతు ముడుచుకుని పడుకున్నట్లు, పెద్దపెద్ద చెట్ల మానులు పక్కలకి దట్టంగా వ్యాపించిన కొమ్మలూ రెమ్మలూ... వాటికి ఆకుపచ్చని ఆకులూ, మోదుగలాటి కొన్ని ఆకులు విశాలంగా ఉన్నాయి. టేకు చెట్ల ఆకులయితే అన్నం తినే కంచాలకంటే పెద్దవి. బొడ్డ చెట్టు ఆకులూ పెద్దవే. ఆ చెట్లమానులకూ కొమ్మలకూ అల్లుకుని, అడ్డమొదలయిన తీగెలు, ముదిరిన ఆకులు పెద్దవిగా ఉన్నాయికానీ... చిన్నవి మాత్రం జంటలుగా పాపలు చేతులు జోడించి లేత చేతులతో దణ్ణం పెడుతున్నట్లే ఒకదానికొకటి దగ్గరై ఉన్నాయి. రాళ్లమధ్యనుంచే తీగెలూ తుప్పలూ అల్లిబిల్లిగా అల్లుకున్న అనేక పేరులేని లతలు. వాటిలో కొన్నిటికి పూలు... రకరకాల రంగులపూలు. ఆకులు పరచుకున్న అడవిపైకప్పు ఆకు పచ్చదనంలోంచి అక్కడక్కడ జల్లెడలోంచిలా కనపడుతున్న ఆకాశపు ముక్కలు.. తెల్లగా బూడిదరంగులో నీలంగా విచిత్రంగా అడవిలోని ఆకులన్నీ పచ్చనే. కానీ ఒక్కొక్క ఆకుదీ ఒక్కొక్క రకపు ఆకుపచ్చరంగు. ఒక్క ఆకు పచ్చలోనే ఎన్ని ఛాయలు! ఎంత వైవిధ్యం!

ఏవేవో పిట్టలు... తమాషా అరుపులు. కొన్నయితే ఎందుకో ఒక్కసారే అన్నీ కంఠాలెత్తి బృందగానం. అక్కడక్కడ కోతుల గుంపులు.. తమలో తాము కోతితగవులాడుకుంటూ... కిచకిచలాడుతూ. ఎక్కడినుంచో కోయిల కుహూ అంటూ, మరో మూలనుంచి గుడ్లగూబ శిశువు ఏడుస్తున్నట్లు అరుస్తోందెందుకో. తామేనా తక్కువ తిన్నదంటూ పట్టపగలే గుంటనక్కలు ఊళలు వేస్తున్నాయి. వాటికే కళేబరం దొరికిందో! ఆ చెట్టునిండా కొండ ఎలుకలే. ఆ చెట్టుకింద పుట్టలోంచి ఆరడుగుల నాగరాజు అందంగా బయటికొస్తున్నాడు షికారుకి కాబోలు. ఆ నెమలి వర్షం వచ్చే ఛాయలు లేకపోయినా గాలికే పురివిప్పి రంగుల నాట్యాలు చేసేస్తుంది. అడవిలో ఎండపడినా దాని రంగులోనూ ఆకుపచ్చని ఛాయ, నీడా ఆకుపచ్చదనం సంతరించుకునే ఉంటుంది. అలాటి అటవీ సౌందర్యంలో, అటవీ సంగీతంలో విహరిస్తున్నారు వారు. మనసు తీయగా మాటలాడుకుంటూ నడుస్తున్నవారు అటు చూసి ఆగారు.

ఒక పెద్ద చెట్టు. దాని మొదలు దగ్గర చదునయిన పలకరాయి. దానిమీద మరీ పెద్దదీ మరీ చిన్నదీ కాని నల్లనిరాయి. కంఠమూ ముఖమూ మాత్రమేగల విగ్రహంలా. దానిమీద పసుపు కుంకుమల మెత్తులు. పూజ చేయబడిన పూలూ పత్రీ దేముడు!

"ఒరేయ్ కిల్లోడా! దేముడ్రా!"

"ఔన్రా కొర్రా"

ఒక్క నిముషం నిశ్శబ్దం... కొర్ర అడిగాడు, "నేస్తం కడదామా మనమిద్దరమూ? "

"ఓ!" అంతకంటేనా అన్నట్లు ఉత్సాహం చూపాడు కిల్లోడు.

పక్కనున్న కొండకాలువలో ఇద్దరూ స్నానాలు చేశారు. శుచిగా దేముడి వద్దకు

వచ్చారు. నమస్కరిస్తూ కళ్లుమూసుకున్నారు.

"దేముడా! నేనూ కిల్లోడూ నేస్తం కడుతున్నాం. ఇకనుంచి మేమిద్దరమూ కష్టాల్లోనూ సుఖాల్లోనూ ఒకరికొకరంగా ఉంటాం. మామధ్య ఏవిధమయిన రహస్యాలూ ఉండవు. అన్నివిధాలుగానూ మా మనసులు ఒకటే. ఒకరినొకరు రక్షించుకుంటూ ఒకరి సుఖం కోసం ఒకరం సాయం చేసుకుంటాం"

దేముడి ముందు ఒకరిచేతిలో ఒకరు చేయి వేసుకుని బాస చేసుకున్నారు. దేముడి ముందు ప్రమాణం చేశారు. ఒకరి చేతిలో ఒకరి చేయిలానే కౌగలించుకున్నారు. అంతేవాళ్లు నేస్తాలు అయిపోయారు.



"జాగర్త... అన్నల స్నేహం పాములతో సాహసంకంటే ప్రమాదం. వాళ్లు మనని పలకరిస్తారు. బుజాలమీద చెయ్యేస్తారు. ఇళ్లకొచ్చి భోంచేస్తారు. అయినా ఎప్పుడు తుపాకి పేలుస్తారో తెలవదు. నేను పోతున్నా శలవిప్పించండి. అన్నలనూ నమ్మకండి, పోలీసులనీ నమ్మకండి. చివరకి మన బతుకులని ఇలా దినదినగండం చేసి వదిలినారంతా కలసి" అని వెళ్లిపోయాడు కొర్ర. వాళ్లు మళ్లీ సారాలో మునిగిపోడం మొదలెట్టారు.

"ఇయ్యాళ లాట్రిబల్లలో పది రూపాయలొచ్చినయ్ నాకు" గర్వంగా ఆనందంగా చెప్పాడు అర్జున.

"మరేటి జేశావవి? " అడిగాడు కిల్లోడు.

"సారా తెచ్చాను" విధి నిర్వర్తించినట్లు చెప్పాడు కిల్లోడు.

"ఓరి నాయన్లారా! ఎరిగిమరిసి ఎప్పుడూ లాట్రి బల్లలకి పోమాకండిరా. అవొట్టి మోసాలు. అందులోనూ మననయితే కొండోళ్లమని లాట్రిబల్ల ఆడేటొనోడు మరీ అలుసుజేసి డబ్బుల్లాగేస్తాడు. కళ్లు మూసి జెల్లకొడతడు. ఈతూరి పదిచ్చిండంటే వొచ్చే సారి వందలాగేడనే. అనుభవమీజెప్పేను. అవతల మీయిష్టం" మందలిస్తున్నట్లే అన్నాడు మహారాజు.

"అలాగేలే" నిర్లక్ష్యంగా అన్నాడు అర్జున. వాళ్లందరూ కలసి సారాకాయలు కాళీ చేసేశారు. చిరుతిళ్లు తినేసి పొట్లాం కాగితాలు విరజిమ్మేశారు. వాళ్లకి మత్తెక్కేసింది. ఎక్కడివారక్కడే వాలిపోయారు. ఆడామగా, పిల్లాపాపా, పెద్దాచిన్నా వళ్లెరక్కుండా... వంటిమీద గుడ్డ చెదిరినా ఎరగకుండా శవాల్లాపడి నిద్రపోసాగారు సారా నిషాలో. ప్రపంచం ఏమైపోయినా ఇక వారికి పట్టదు, మళ్లీ తెలివొచ్చేదాకా.



పూజారి మనిషి గంభీరంగా ఉన్నాడు. అతని ముఖంలో చెప్పరాని వేదన. ఏం చెప్పాలో ఏం చెప్పగూడదో తేల్చుకోలేక సతమతమవుతూనే సభముందు నిలుచున్నట్లు కనిపిస్తున్నాడు. అందరూ సమావేశమయ్యారు. రాజుపాకలగూడెంలో పదేళ్లు దాటిన ఆడామగా అందరూ... కాక ఇతర గూడేలనుంచి నాయకులూ తదితర ముఖ్యులూ కూడా చేరారక్కడ.

పూజారి మెల్లగా మొదలుపెట్టాడు.

"సోదరసోదరీమణులారా! మీ అందరికీ నా ఆశీస్సులు. నిజానికి నా జీవితంలో ఇది అతి విచిత్రమయిన దినమూ... బాధా భయమూ పెడుతున్న దినమూ కూడా. ఎందుకంటే యిప్పుడెదురయినది మనందరకీ జీవన్మరణ పరీక్షే. మనముందు రెండు మార్గాలున్నాయి. రెండింటిలో ఏది ఎక్కడికి దారితీస్తుందో ఏమీ తెలియదు. అసలు మనకి ఎన్నుకునే అధికారమూ... మనం

ఎన్నుకున్నట్లే జరుగుతుందనే భరోసా ఉన్నాయో లేవో నేను అర్థం చేసుకోలేకపో తున్నాను. అయినా ఈ తతంగమంతా ఎందుకూ అంటే... నిజంగానో, మాటవరు సకో ప్రభుత్వాధికారులు మన నిర్ణయం అడి గారని. ఇవాళ నేను కొంచెం ఎక్కువే మాట్లాడవలసి ఉంది. ఎప్పటిలా నా ధోర ణిలో బాసలోకాక కొంచెం బిగించే మాట్లాడ వలసి ఉంది. కనుక కొత్తగా అనుకోకండి నా మాటలని.

మనముందు రెండు తోవలున్నయ్. మొదటిది మనమెప్పటిలాగే ఇక్కడి కొండ మీదే గూడెంలోనే ఉండిపోవడం. ఇదే అయితే మనజీవితాలలో మార్పేమీ ఉండ దనే చెప్పొచ్చు రెండవది కొండ వదిలి... కొండదిగి కింద వూళ్లకి వెళ్లిపోవడం. మన అభిమతమిదే అయితే... దీనికే మనం అంగీకరిస్తే... మనజీవితాలలో పెద్ద మార్పులే జరుగుతాయని నిస్సందేహంగా చెప్పొచ్చు ఆ మార్పులెలా ఉంటాయనేది కాటికికాళ్లు జాచుకున్న నేనుకాక వివే కులూ... నాలుగూళ్లూ తిరిగి నాలుగూ చూసినవారూ చెబుతారు. ఏదయినా ఎంపుకి మనకి హక్కుందనే విశ్వాసంతో ఈ కార్యక్రమం కొనసాగిద్దాం. తరతరాలుగా ఉంటూ వస్తున్న జన్మభూమిని అది కొండే అయినా, కోనే అయినా, పల్లే అయినా, పట్నమే అయినా విడచిపోడం... శాశ్వ తంగా విడచిపోవడం అంత సులభమేమీ కాదు. ఎంతో యోచించాలి. ఆ యోచన కూడా ఒక్కరుకాదు, ఎందరో చేయాలి. ఎన్నో విషయాలు బేరీజువేసి చూసుకో వాలి. ఇదిగో... ఇందుకే ఈ సమావేశం. జరగబోయే సమావేశాల పరంపరలో ఇది మొట్టమొదటిది. మిగిలిన గూడేలవారు వారి సమావేశాలు వారు జరుపుకున్నా, వాటి సారాంశం ఇక్కడకొచ్చి మనకి తెలియ జేస్తామన్నారు. ఈ సమావేశాలనీ... సభలో చెప్పే విషయాలనీ మీరత్యంత శ్రద్ధతో అర్థం చేసుకోవాలి. ఎందుకంటే మనం తీసుకునే నిర్ణయం విలువ మన జీవి తాలే. ఇప్పుడు విజ్ఞుడయిన భీమన్న కొంచెం చెబుతాడు"

సా(చా)వడి క్రిక్కిరిసి ఉంది. అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు. భీమన్న బండవద్దకు వచ్చాడు. "అందరికీ నమస్కారాలు, పూజారి నామీద అభిమానంతో నన్ను కొన్ని విషయాలు చెప్పమని ఆజ్ఞాపించి నాకీ అవ కాశమిచ్చారు. ఏ సమస్యయినా దాని దగ్గర లోని పరిసరాలకేకాక విస్తృతమయిన ప్రదే శానికీ అవధికీ చెందినదికూడా అయి వుండ వచ్చు ప్రస్తుతపు సమస్య కూడా విశాలమ యిన ప్రాతిపదికమీద ఆలోచించవలసినదే. భూమికోత తగ్గాలన్నా, వర్షాలు కురవా లన్నా, వాతావరణం సమంగా ఉండాలన్నా అడవులు భూభాగంలో కనీసం మూడోవం తుండాలి. మనదేశం అడవులను నాశనం చేస్తూ రావడంవలన ఈ నిష్పత్తి చాలా తగ్గి పోయింది. ఇది గుర్తించే వన సంరక్షణ, సామాజిక అడవుల పెంపకంవంటి కార్యక్ర మాలను రూపొందించసాగింది ప్రభుత్వం. అయితే ప్రతి ప్రభుత్వ ప్రణాళికలాగే దీని మీద పెట్టే ఖర్చుకి తగిన ఫలితం మాత్రం కనిపించడంలేదు. దళారీల వంటి ప్రభుత్వా ధికారులకు చిత్తశుద్ధి కొరవడడంవల్ల ప్రజలు దీనిని ఎక్కువగా పట్టించుకోడం లేదు. ఇది ఇలా ఉండగా దేశం మరింత పారిశ్రామికం కావాలని ప్రభుత్వం తలపె ట్టింది. పరిశ్రమలకు ముఖ్యావసరం విద్యు చ్ఛక్తి. సీలేరులాగే ఇక్కడా నీటినుంచి విద్యు త్తుని జనింపజేసే ప్రాజెక్టును నిర్మించాలని సంకల్పించింది. అందుకు రోడ్లుపడాలి. ప్రాజెక్టుకి ఎంతో జాగాకావాలి. కార్యాల యాలు కట్టడానికి కూడా స్థలాలుకావాలి. ఎన్నో ఎకరాలు అంటే మనం గిరిజనావాసా లను ఖాళీచేసి పోవాలి. అంటే మన ఉనికీ

మనికీ (మనుగడ విధానం) మారతాయి. ప్రభుత్వం మనం నిర్వాసితులమైనందుకు ఆర్థిక రూపంలో కొంత పరిహారమిస్తుంది. కొండదిగువ వూళ్లలో మనకి ఆవాసాలు చూపుతుంది. అర్హులయిన వారికిక్కడి ప్రాజెక్టులో పనులు చూపుతానని వాగ్దానం చేస్తుంది. రోడ్లు వేయడం... నిర్మాణం వంటి కార్యక్రమాలలో మనకి ఉపాధి కల్పి స్తానంటుంది. మనకోసం విద్యాలయాలు, వైద్యాలయాలు వంటివి ఏర్పరచుతానం టుంది. ఈ స్థలం స్వరూప స్వభావాలు సాకల్యంగా మారిపోతాయి వారు చెప్పేవే నిజమయితే. ఇళ్లు, బజార్లు... ఎన్నో వెలు స్తాయి. పట్నాలనుంచీ పైవూళ్లనుంచీ ప్రజలు వివిధ విధాలయిన పనుల మీద ఇక్కడకు వస్తుండడమూ మకాంపెట్టడమూ చేస్తారు. నాగరికత త్వరితగతిని అభివృద్ధి చెందుతుంది. స్థూలంగా ఇవీ జరిగేవి. అయితే మనం కొండ దిగిపోయినా కొండ మీదే ఉన్నా మన జీవనవిధానంలో అనేక అనూహ్య మార్పులు చోటుచేసుకుంటాయి. అవి ఎలా ఉంటాయనేది తరువాత మరొ కరు చెబుతారు. మనని ఆటవికులంటారు నాగరికులు" అని గంటందొర వేపు చూశాడు భీమన్న. అతను లేచి నిలుచుని చెప్పసాగాడు.

"నాగరికత ఎంతో ఆకర్షణీయమైనది. మనలాటివారినిట్టే ఆకట్టుకుంటుంది రెక్కల పురుగుని దీపంలాగ. ఇన్నాళ్లూ మీకు చెప్ప నిదొక విషయం చెబుతాను.

మీకు జ్ఞాపకముండే ఉంటుంది గున్నమ్మ అనే నా మనమరాలు. రాణిజిల్లానుంచి ఒక పెళ్లిసంబంధమొచ్చింది. ఒక్కగానొక్క మన మరాలు, తల్లీతండ్రీలేనిది, కలకాలం సుఖప డాలని వాళ్లడిగిన డబ్బిచ్చి పెళ్లి చేశాను. తంబుల్లి గ్రామం వాళ్లది. పైకి బాగానే కని పించారనే దూరపు సంబంధమని కూడా చూడలేదు. నాకు కళ్లుమూసుకుపోయా యనే ఒప్పుకోవాలి. ముందు ఎంతో మెత్తగా మంచిగా ఉన్నవాళ్లు మనువయ్యాక అసలు రూపాలు ప్రదర్శించడం మొదలుపె ట్టారట. అతగాడు శీలాన్ని శంకించాడట. ఓ పెద్ద బండరాయినామె తలమీదపెట్టి నేరం అంగీకరించమని నానాహింసలూ పెట్టాడు. ప్రాణం మీది భయంతో ఆమె చేయని తప్పుని ఒప్పుకుంది. అంతే ఆమెను వేలానికి పెట్టేశాడట మొగుడు నడిబజా రులో పదిమంది మధ్యా. మంచి ధర పల కాలని నవవధువు అందాన్ని తానే పొగు డుతూ ఆ మొగుడు మొగాడు తన ఆడ దాన్ని తానే బట్టలు వలిచి పదిమందికీ ఆ అందాలు బహిరంగంగా పరచిచూపి పొగు డుతూ మరీ వేలంవేశాడు. వేలం పాటలో ఎక్కువ పాట పాడినవాడిదేకదా సరుకు? డబ్బుకలవాడెవడయినా పెద్ద పాట పాడొ చ్చుకదా? ఎక్కడినుంచోవచ్చిన ఎవరికీ తెలి యని ఒక ముసిలాడు, వయసూ మనసూ ఉడిగినవాడు, డబ్బు మాత్రం పుష్కలంగా కలవాడు అతి ఎక్కువ ధర పాడి అక్కడిక క్కడే ఆమె మొగుడికి పాట మొత్తం చెల్లిం చేసి అప్పటికప్పుడే అటునుంచటే దానిని పట్టుకుపోయాడు. పండక్కి మోదకొండమ్మ పండక్కి పిల్లనీ అల్లుణ్ణీ ఇంటికి తెచ్చుకుందా మని వెడితే అక్కడెవరేనా ఉంటేకదా? వాళ్ల ఆచూకీ తెలిస్తేకద? వేలంలోవచ్చిన డబ్బు పట్టుకుని వాళ్లు మరే పట్నమో పోయారట. వాళ్ల జాడాలేదు, ఆనవాలూ లేదు. ఎవరూ చెప్పలేకపోయారు. ఏంచె య్యాలో నాకు తోచలేదు. ఊరుకాని ఊరు. దూరాభారం. నేను పిలిచినా ఎవరు పలు కుతారని? ఎవరికి చెప్పుకునేది నా గోడు? ఎవరు వింటారు? లబోదిబోమని గుండెబా దుకు ఏడ్చాను. ఈనగాచి నక్కలపాలు చేసి నట్లు తల్లీతండ్రీలేని పిల్లనన్నాళ్లూ కంటికి రెప్పలా కాపాడుకుని కళ్యాణం చేసింది ఇలాటి కసాయివాళ్లకప్పగించేందుకా!



ఏమైంది నా గున్నమ్మ? ఎక్కడుంది? ఎలా ఉంది? జవాబురాని ప్రశ్నలు. వెర్రి ముఖమూ ఏడుపు మొహమూ వేసుకుని వెనక్కివచ్చేశానింకేమీ చేయలేక. దొంగలత ల్లికేడవ భయమని నేను చేసిన పని ఎవ రికి చెప్పుకోగలను? ప్రాణంలో ప్రాణమూ, మనసులో మనసూ అయిన మహారాజుకి మాత్రం చెప్పుకుని మనసు బరువు కొంత తీర్చుకుని నోరుమూసుకుని చచ్చినట్లు మళ్లీ మనుషుల్లో పడ్డాను చావలేక. తానెంతో జగమంత. అలాగే తన కెంతో అందరికీ అంత. ఇలా జరిగాక నేను పట్నాన్నీ పట్న వాసులనీ ఎలా నమ్మగలను? నా అనుభ వమింత విషమయ్యాక టౌన్లనీ టౌను మనుషులనీ ఎలా విశ్వసించగలను? ఈ కొండమీద గూడెంలో ఏ ఆడపిల్లకీ ఎన్నడూ ఇంత అన్యాయం జరగలేదు. ఆడపిల్ల నిజంగా తప్పేచేసినా ఆ మొగాడు దానినొ దిలేసే వాడు తప్ప ప్రాణాలు తీసే హింసా పెట్టలేదు, వేలాలూ వెయ్యలేదు. కాకపోతే ఓలి, మగనాలి వసూలు చేసేవాడు. పట్న మంటే ధనదాహం. పట్నమంటే మాన వత్వం లేకపోడం. పట్నమంటే అమాయ కుల పాలిట ఉరిశిక్ష... పట్నమంటే దగా... వంచన... మోసం... కుట్ర... కుటిలత్వం.

నా ఆధీనంలోనే ఉంటే... నా అభీష్టమే నెరవేరేటట్లయితే చచ్చినా నేనా పాపిష్టి పట్నంవేపు కన్నెత్తయినా చూడను. నిజా నికి గున్నమ్మ బతుకలా అయిందని తెలి శాక- ఎట్టి పరిస్థితుల్లోనూ పట్నపు పాపకూ పంలోకి అడుగుపెట్టరాదని ప్రమాణం చేసు కున్నాను, నాకు నేనే"

"ఇందుకా పూజారి పాడేరు కూడా రాడు' అనుకున్నారా విషయంలో, ఇన్నాళ్లూ ఆశ్చ ర్యపోతూ వొస్తున్న కొందరు.

"...అయితే ఇది నా మేరకు మాత్రమే. నేను పూజారినే కావొచ్చు అంత మాత్రం చేత నా అభిప్రాయాన్నీ, నిర్ణయాన్నీ అందరి నెత్తిమీదా రుద్దే ఉద్దేశమూ నాకు లేదు. అధికారమూ లేదు. ఇది చాలా ముఖ్యమయిన విషయం. నా గురించి పట్టించుకోవద్దు. నేను నేడో రేపో రాలిపో బోయే పండుటాకునీ, ఎండుటాకునీ. నాకు వర్తమానమూ లేదు, భవిష్యత్తూ లేదు. నేనొక జీవచ్ఛవాన్ని. నన్ను పరిగణించ కండి. మీమీ అభిప్రాయాలను స్పష్టం గానూ, సంకోచించకుండానూ చెప్పండి" అని కళ్లు తుడుచుకుంటూ కూర్చుండిపోయాడు.

శ్రోతలు గుండెలు భారంకాగా కొన్ని నిముషాలపాటు అవాక్కయ్యారు. అప్పు డొక యువకుడు లేచి నిలుచున్నాడు.

"పూజారిగారికీ, పెద్దలకీ నమస్కారాలు. నేను పెద్దవాణ్ణీ కాను, చదువుకున్నవాడినీ కాను. అయినా పంతులు చదివే పేపరు విని కొంత ప్రపంచజ్ఞానం గ్రహిస్తూవొస్తు న్నాను. పెద్దలు పెద్ద మనసుతో క్షమిస్తా రని నా ఉద్దేశం చెబుతున్నాను.

మనం- గిరిజనులమే అయినా... విసిరే యబడ్డట్లు కొండమీదా అడవిలోనూ ఉన్నా భారతీయులమే. భారతదేశవాసులమే. కనుక మనకి దేశంపట్ల బాధ్యతా ఉంది, దానిలో భాగమూ ఉంది. భారతదేశ పౌరు లుగా దేశంపట్ల మనందరికీ కర్తవ్యముంది. దేశంకోసం చస్తే ఏం? అనుకోవాల ఉత్తమ పౌరుడు. దేశం నాకేమిచ్చిందనికాక దేశానికి నేనేమివ్వగలుగుతున్నానని ఆలోచించాలట నిజమయిన పౌరుడు. అలా ఆలోచించి చూద్దాం కొంచెంసేపు. భారతీయలందరూ మన సోదరీసోదరులు. టౌనువాళ్లు మనని తక్కువగా చూసినా, కొండోళ్లంటూ తేలికగా తీసేసినా, వాళ్లకి మనం తమ్ముళ్లం అనిపిం చకపోయినా మనకి వాళ్లు సోదరులు. ఇవాళ మనదేశం ప్రపంచదేశాల్లో చాలావా టికంటే చాలా వెనకబడి వుంది. మన గిరి జనులలో సరయిన వైద్య సదుపాయాలు లేక శిశుమరణాలూ, వ్యాధిమరణాలూ,

ప్రమాద మరణాలూ అధికంగా ఉన్నాయి. మనమెక్కువ సంతానాన్నేకన్నా జనాభా పెరగడం లేదుకాని... కొండ దిగువ మాత్రం జనాభా తెగపెరిగిపోతోంది. ఇది దేశానికి తీవ్ర సమస్య అయింది. అధిక జనాభావల్ల నిరుద్యోగం, ఆహార కొరత, వసతి కరువు మొదలయిన అరిష్టాలెన్నో కలుగుతున్నాయి దేశానికి. దీనికి నివారణ పారిశ్రామికంగా ముందడుగు వేయడమే అని నిర్ణయించింది ప్రభుత్వం. భీమన్న తాత చెప్పినట్లు పరిశ్రమలకు అత్యవసరమ యింది విద్యుచ్ఛక్తి. విద్యుచ్ఛక్తి పుట్టించా లంటే సమృద్ధిగా నీరుండాలి. అది మన కొండమీదుంది. అందుకే ప్రభుత్వం ఇక్కడ ప్రాజెక్టు కట్టాలని యోచిస్తున్నది. ప్రభుత్వ పథకం ఆచరణలోకి రావాలంటే మనం ఈ ప్రాంతాన్ని ఇవ్వాలి. మననేమీ ఊరికే ఇమ్మనడంలేదు. బోలెడు విధాలుగా ప్రతి ఫలం ఇస్తానంటూంది. మరొకచోట నెలవు చూపుతానంటోంది. దీనివలన మనమూ కొండదిగువకి నాగరికతలోకి వెళ్తాం. మన బతుకుల రూపురేఖలూ, భవిష్యత్తూ బాగు పడతాయి. జాతీయ జీవనస్రవంతిలో ఏకం కాగలుగుతాం. గిరిజనులు, షెడ్యూల్డ్ ట్రయిబ్స్ అంటూ వెలివేయబడుతూ విడిగా చూడబడం. మనకీ అందరు మనుషుల్లా గౌరవమూ, ప్రతిపత్తీ లభిస్తాయి. ఒకవేపు దేశానికి సేవ, మరొకవేపు మన అడవి బతుకుల్లో మంచి మార్పు ఒకే దెబ్బకు రెండు పిట్టలు. ఇలాటి బంగారు అవకా శాన్ని వొదులుకోవడం వివేకం అనిపించుకో దేమో? నన్నడిగితే- వెళ్ళిపోవాలనే అంటాను" అని కూర్చున్నాడు.

అక్కడి శ్రోతలలో కొందరు- నిజమే... ఇతను చెప్పిందీ సబబే. ఎన్నాళ్ళిలా కొండల్లో బండబతుకులు బతుకుతాం? ఎంతకాలం ఈ అడవిమాలోకం బతు కులు? పట్నంపోవాలి తెగించి. కొత్త బతుకు బతకాలి. అదే మంచిది. తెగిస్తేనే, సాహసం చేస్తేనే స్వర్గమందేది. అయినా ఇక్కడేటుందని, బూడిదా, బండలూ. కొండ లొదిలిపోతే అన్నల బెడదేనా తప్పు తుంది...

అనుకుంటూండగానే వారికి అన్నల జ్ఞాప కాలు మెదడులో మెదిలాయి.



రాజుపాకలలోని సారా వ్యాపారి అధిక ధర వసూలు చేస్తే ఇల్లు తగలెట్టేస్తామ న్నారు అన్నలు. అతగాడు ప్రాణాలకు భయపడి వ్యాపారం ఎత్తికట్టేసి... కట్టెల కడవికిపోవడం మొదలుపెట్టాడు. మరి సారా ఎలా? అని నలుగురూ అడిగితే-

"మీ సారా మీరే కాచుకోండి" అని సలహా ఇచ్చారు. చేతనయినవాళ్లు విడి గానూ, చేతకానివాళ్లు కొందరు కొందరు కలిసే గూడెం బయట తోటల్లో సారాబ ట్టీలు పెట్టుకున్నారు. ఇదే బాగుంది. అని చంకలు గుద్దుకున్నారు మొదట్లో కడుపు పట్టినంత సారా తాగుతూ. కాని వారం గడిచిందో లేదో చిక్కులు మొదలయ్యాయి. తేనెపట్టులు, జీడిమామిడి పళ్లు మాత్రమే ఎరిగిన ఎలుగుబంట్లు సారా రుచి ఎలా తెలుసుకున్నాయో మరి. రాత్రయ్యేసరికి కొండదిగి వొచ్చేయడమూ, మిగిలిపోయిన అడుగూ బొడుగూ సారాని నాకేయడమూ. మడ్డి, కల్లూ అవీ కానిచ్చీడమూ. నిషా ఎక్కి కుండలూ అవీ పగలగొట్టడమూ. పొయ్యిలు పాడు చేసేయడమూ. ఆ అల్లరీ, ఆగడమూ చాలనట్లు తూలుకుంటూ గూడెంలోకొచ్చి అల్లరిచేసి ప్రజలని నిద్రపో నివ్వకుండా భయపెట్టడమూ మొదల యింది.

ఎలుగుబంటిదీ కొంత కోతిజాతే.

జీడిమామిడి పళ్లసీజనులోనూ... పనస పళ్ల సీజనులోనూ మాత్రమే వొచ్చేవవి

మునుపు. ఆ పళ్లు కూడా ఎక్కువ తింటే నిషాయే. అవి తెగతిని అల్లరిచేసి పోతూం డేవి. పళ్లకంటే బాగున్నట్లుంది మడ్డికల్లూ, సారా. ఎంత జాగ్రత్తగా పెట్టినా బట్టీని ముట్టడించడమూ అదీ ఇదీ అని లేకుండా పులిసిన బెల్లంపాకం వగైరాలన్నీ కానిచ్చేసి, తప్పతాగి తందనాలు ఆడడమూ జరుగు తుంది. గూడెంమీదపడి పంటలూ అవీ ధ్వంసం చేయడంతోపాటు ఒకరిద్దరినవి గాయపరిచాయి కూడా. రాత్రయ్యేసరికి మత్తుకోసం మందలు మందలుగా దిగిపో వడం మొదలుపెట్టాయి.

ఎలుగుబంటిని చంపబుద్ధి కాదు గిరిజను లకి. మొదటి కారణం- అది రామబంటు అనే నమ్మకం. శ్రీరాముడి బంటుని చంపితే మహాపాపం, రాముడికి కోపమొస్తుందను కుంటారు. అదీగాక ఎలుగుబంటిని చంపడం చిరాకయినపని. దట్టమయిన బొచ్చుతో, దాని చర్మం దళసరి, ప్రాణం గట్టిది. దానిది మూర్ఖపుబలం గోళ్లతో చీరేసి వొదులుతుంది. మాంసాహారి కాక పోయినా గోళ్లదురద తీర్చుకుందుకేమో- శత్రువునెదుర్కోడం మహా ఉత్సాహం దానికి. మిగిలిన మృగాలనుంచయితే చెట్టెక్కి తప్పించుకోవచ్చు కోతి లక్షణాలు కల దీనికి చెట్టెక్కే కళ కూడా వచ్చు. బుర్ర కిందకీ కాళ్లు మీదకీ భంగిమల్లో చెట్టెక్కే స్తుంది. ఒక పట్టాన చావదు. చావుదెబ్బలు తిన్నదో, అది అరిచే ఆర్తనాదాలు మను షులు వినలేరు. ఇన్ని బాధలున్న ఎలుగు బంటి ఇప్పుడు సారాబట్టీలకు ప్రథమ శత్రువు. జనం తమ కష్టాలు చెప్పుకున్నారు అన్నలకి సలహా ఇచ్చింది వారే కనుక.

"ఆంధ్రదేశంలో మద్యపాన నిషేధో ద్యమం మొదలుపెట్టారు మహిళలు. అది చాలా మంచిదీ అవసరమూ. నిజానికి మీ బతుకులిలా నీరుకారిపోతున్నాయంటే. ఎక్కడ వేసిన గొంగళీ అక్కడే అన్నట్లయినా కాకుండా దినదినానికీ దిగజారిపోతున్నా యంటే పడే కష్టమంతా వృథా అయిపో తూందంటే- కారణం మీ సంపాదనంతా సారా తాగేయడమే. ఇక మీరు సారా జోలికి పోకండి. అది అన్నివిధాలా మంచిది" అన్నారు అన్నలు.

చిర్రెత్తుకొచ్చింది గిరిజనులకి. కోపం పట్ట లేకపోయారు. అన్నల తుపాకిలకు భయ పడి బయటపడకపోయినా... మనసులో మాత్రం 'మారాజు మారాజంటే మర్రెండు వడ్డించమన్నట్లే చెప్పారు' అని మండిప డ్డారు. సారా మానమనడంకంటె మరొక కోపకారణం ఉండదు గిరిజనుల విష యంలో. తరవాత అన్నలకి తెలియనివ్వ కుండా వాళ్ల సారా తిప్పలేవో వాళ్లే పడసా గారు.



మీటింగులో జనం రెండువర్గాలుగా చీలి పోయారు. యువకులూ... నడివయసు లోపు వారూ, కుర్రాళ్లూ టౌనే పోదామని ఉవ్విళ్లూరారు. వయసు మళ్లినవారూ, స్త్రీలూ అధికశాతం ఉన్నచోటు వదిలిపోరా దని భావించారు. వారిలో వారికి వాగ్వివా దాలూ, వాదోపవాదాలూ చెలరేగసాగాయి. కొంచెంసేపు వారిని మాట్లాడుకోనిచ్చి పూజారి లేచి నిలుచున్నాడు.

"మరెవరికీ ఈ విషయంలో మాట్లాడా లనే అభిలాష లేదనుకుంటాను. సభ ముగించబోయేముందు ఒకటి రెండు ముక్కలు చెప్పవలసిన విధి నామీదుంది. ఇప్పుడే అయితే మనం ఉపన్యాసాల వేడి లోనూ, ఉద్రేకంలోనూ ఉంటాం. ఆవేశమె ప్పుడూ ఆలోచననణచి వేస్తూనే ఉంటుంది. ముఖ్యమయిన నిర్ణయాలను నిదానంగానూ, శాంతంగానూ తీసుకోవాలి. సావడిలో సంకు దేముడి పక్క రెండు బుట్టలుంచుతాము రేపటినుంచీ. మీ అందరికీ పూసలిస్తామి

ప్పుడు తలొకటి. ఇక్కడే ఉండాలనుకునే వారు తమ పూసని సంకుదేముడి విగ్రహా నికి దగ్గరున్న బుట్టలో వేయాలి. అడవిలో ఉండాలనే వారికోసం ఆ బుట్టకు ఆకుపచ్చ రంగువేయబడుతుంది. రెండోబుట్టకు రంగుండదు. టౌను పోదామనుకునేవారు తమ పూసను అందులో వేస్తారు. ఎవరి ఇష్టం వారిదే. మొత్తంమీద ఏ బుట్టలో ఎక్కువ పూసలు వేయబడ్డాయో లెక్కించి దానినే రాజుపాకల అభిప్రాయంగా తీసు కుందాం. ఇది మీ అందరికీ ఆమోదయో గ్యమే అనుకుంటాను"

ఔనన్నారందరూ... పూసలను భీమన్న నుంచి అందుకుని జాగ్రత్త పెట్టుకుంటూ, "మన గూడెమేకాక ఇతర గూడేలు, చుట్టుప క్కలగూడేలు కూడా ఇలాగే సావడి సభలు పెట్టి పూసల పద్ధతిన అభిప్రాయం తీసు కుందుకు అంగీకరించాయి. ఉత్సాహమున్న వారు మాతో కలిసి ఆ గూడేలకు రావొచ్చు. ఆ రాత్రికక్కడే భోజన వసతులేర్పాటు చేయబడతాయి. ప్రభుత్వాధికారులకు మనం త్వరలో ఏ సంగతి చెప్పెయ్యాలి కనుక- మిగిలిన గూడేలలో కూడా త్వరత్వ రగా సభలు జరుగుతాయి. రేపు బంద పాలెంలో సభ జరుగుతుంది అని ముగిం చాడు. అప్పటికప్పుడే వారు ఎవరెవరు బందపాలెం వెళ్లాలో తేల్చేసుకుంటున్నారు. సందుడు మాత్రం ఇరకాటంలో పడిపో యాడు. అతను రేపే వేట పెట్టుకున్నాడు. సందుడికి తుపాకి ఉంది. దానికి లైసెన్సూ ఉంది. చేతికింద ఇద్దరు మనుషులూ ఉన్నారు. అతను పొట్టప్పుడు అడవికీ, పను లకీ వెళ్లినా ప్రధాన వ్యాపకం మాత్రం వేటే. అడవంతటా అన్నిరకాల జంతువులూ ఉండవు. అడవి చివర్లలో కోతులూ కొండ ముచ్చుల వంటివి తప్ప పనికొచ్చే వేటజం తువులు ఎప్పుడోగానీ దొరకవు. ఒక్కొక్క అటవీప్రాంతంలో ఒక్కోరకం జంతువులె క్కువ లభిస్తాయి. వేట విషయంలో గిరిజ నులకి కట్టుబాట్లున్నాయి. అవి వారు కచ్చి తంగా పాటిస్తారు.

★ ★ ★

ఏప్రిల్ ప్రాంతంలో అంటే... చైత్ర మాసం దగ్గరలో చుక్కముహూర్తగాళ్లు నిర్ణ యించిన ఒక శుక్రవారం విటికెల పండగ చేస్తారు గిరిజనులు. గిరిజనుల పండగలు చాలావాటికి శుక్రవారమే రోజవుతుంది. కొత్త సంవత్సరంలో వ్యవసాయానికి రైతులు జరుపుకునే ఏరువాక పండగలా టిదే వేట ప్రారంభానికి గిరిజనులు చేసు కునే ఈ విటికెల పండగ కూడా. పండగ నాటి ఉదయం స్నానాలూ అవీ చేసి ఉద యమే కోళ్లు కోస్తారు. ఇది ప్రధానంగా మగవారి పండగ. వేటాడేది వారు కనుక. కొంతమంది కొత్త బట్టలు ధరిస్తే- కొంత మంది ఉత్సాహవంతులు పుటంపురుగు ధరిస్తారు. పుటంపురుగంటే చెట్లకొమ్మలతో చేసిన ముసుగు అనవచ్చు. ఆకులతో కూడిన కొమ్మలను అనువయిన పొడ వున... అంటే సుమారు నాలుగడుగుల పొడవులో నరికి ఆకులు పాదాలవరకూ కప్పేలా కొమ్మల పైభాగాలను తమ మెడ

వద్ద చేర్చి పరికిణీ బొందులాగ ఆ కొమ్మ లను తాడుతో కడతారు. దానితో అది ఆకులూ రెమ్మలతో చేయబడిన గాగరాలా ఉంటుంది. ఈ ఆకుల ముసుగు ధరించి, నెత్తిమీద కంచు చెంబు బోర్లించుకుని ముందుగా సంకుదేముడిని కొలుస్తారు. తరువాత పూజారి యింటికి వెళ్తారు. ఇలా ఊరేగుతూంటే, హోలీపండగలోలా... ఆడ వాళ్ళు మగవాళ్ళమీద రంగునీళ్ళు జల్లి వినో దిస్తూంటారు. అప్పుడందరూ ఒక కాళీ స్థలంలోకి చేరుతారు. అక్కడ నేలమీద ఒక టిరెండడుగుల ఇసుక కుప్ప పోసి... శంఖాకారం చేసి... దానిపైన ఒక కోడిగు



డ్డును నిలువుగా నిలబెడతారు. యిసుకలో అది స్థిరంగా నిలబడి స్పష్టంగా కనిపిస్తూంటుంది తెల్లరంగు వలన. దానికి సుమారు ఇరవై పాతిక గజాలదూరంలో... తుపాకి కాని విల్లంబులు కాని పట్టుకుని గిరిజన పురుషులు నిలబడతారు. గిరిజనులలో కొందరికి తుపాకులూ ఉంటాయి, వాటికి లైసెన్సులూ ఉంటాయి. డప్పు ఒక పద్ధతిలో మోగుతూంటుంది. తుపాకి కలవారు తుపాకితో, విల్లంబులు మాత్రమే కలవారు బాణంతో గురి చూపి గుడ్డును కొట్టడం మొదలుపెడతారు గురిగాళ్ళు. ఏ గిరిజనుడికయినా విల్లంబులుండి తీరతాయి. గిరిజనుడి సహజ ఆయుధాలు అవే. గురికి తగలకపోతే ప్రేక్షకులు గురిగాడిని ఆటలు పట్టిస్తూ అరుస్తారు. గురికి తగిలిందో- డప్పు దరువు మారిపోతుంది. విజేతనభినందిస్తూ పాత బాణీ వొదిలి- కణుజు గజడి అనే దరువులో డప్పుగాడు వాయిస్తాడు. ఇది అయ్యాక- వేటగాళ్ళు దగ్గరలోని అడవిలోకి వెళ్తారు చిన్నవేటకి. సాయంత్రానికల్లా అందరూ వొచ్చేస్తారు వేట దొరికినా మానినా. వేట దక్కించుకొచ్చిన మగవాళ్ళు ఆడవాళ్ళమీద రంగునీళ్ళు జల్లుతారీసారి.

మరుసటి దినం- శనివారం. పారుమోడి వివసడం అని చేస్తారు. వివసడమనే గిరిజన పదానికర్థం నారి సారించడమని. పూజారి పూజ చేస్తాడు. ఆదివారం- దగ్గరలో కల అడవిలో తొలి వేట జరుగుతుంది. సోమవారం నుంచే అసలు వేటా... పెద్దవేట ప్రారంభమౌతుంది.

అడ్డోలి... సెంగాం... సింత గున్నల మొదలయినవి వేటకు పేరు పడిన ప్రాంతాలు. వేటగాళ్ళు ఎక్కడ కలుసుకోవలసిందో ముందుగానే నిర్ణయించుకుంటారు. గిరిజనులకి ముహూర్తం పట్టింపు చాలా ఎక్కువ కనుక... నిర్ణయించబడిన సమయానికి, అనుకున్నచోట అందరూ కలసి వేటకి పయనమౌతారు. ఔను. నిజంగా ఒక్కొక్క వేట పెద్ద ప్రయాణమే. బయలుదేరినవారు వేటనుంచి తిరిగి రావడానికి రోజులకి రోజులే పడుతుంది. దీనిని పెద్ద వేట (అ)ంటారు.

చిన్న వేటను పంపురు కాయుట అంటారు. నలుగురైదుగురు మాత్రమే... వారిలో ఒకరిద్దరికే తుపాకులుంటాయి. అలాగా చిన్న మంద వెడితే పంపురు కాయడానికెళ్ళడం అంటారు. పెద్ద వేటకయితే దాదాపు గూడెంలోని అర్హులందరూ వెళ్తారు. వారి సంఖ్య నలభై వరకూ కూడా ఉంటుంది. వారు అడవిలోనే ఉండిపోతారు రాత్రి. దగ్గరలోని గూడేనికి కూడా పోరు సాధారణంగా. వంటలు, స్నానపానాలూ అన్నీ వేట స్థలంలోనే కనుక వేటగాళ్ళు గింజలు, వంటపదార్థాలు, టీ పొడి, చుట్టలు, బీడీలు, మందులు మొదలయినవన్నీ మోసుకువెళ్తారు. ఈటెలూ బరిసెలూ బల్లేలూ పట్టుకుంటారు కొందరు. ఒకప్పుడీ ప్రాంతంలో అడవిదున్నలు ఉండేవి కానీ యిప్పుడవి మచ్చుకి కూడా మిగలలేదు. అంతరించిపోయిందాజాతి. వీరికి- అడవి పందులు, అడవి మేకలు, ఏదుపందులు, ఎలుగుబంట్లు మొదలయినవి దొరుకుతాయ్. అన్నిటిని వేటాడే విధానమూ ఒకలా ఉండదు.

జింకలు... లేళ్లు... దుప్పులు అనే వాటిని వీరు అడవిమేకలంటారు. అవి గుమ్మడు కాయలు (గుమ్మడికాయలు కాదు), ఉసిరి కాయలు, కరక్కాయలు వంటివి తింటాయి. అవి ఏ చెట్టువద్దకు వొచ్చి తింటున్నాయో వీరు కనిపెడతారు. చెట్టుకొమ్మలు, కాయలు, చెట్టు దిగువ కాలి జాడలనుబట్టి దానికి దగ్గరలో ఉన్న చెట్టు మీద బడ్డికాస్తారు. బడ్డి కాయడమంటే- రెండు కొమ్మలు కలుపుతూ రాటలువేసి వాటిమీద కూర్చోడం. తాపీపనివారు





పరంజీ కడతారే అలాగన్నమాట. తెల్లవార కముందే... నాలుగు ఐదు గంటలకీ మధ్యనే బడ్డికాయడం మొదలుపెడతారు. జంతువుకోసం ఎంతో జాగ్రత్తగా సహనంగా నిరీక్షించాలి. కూర్చున్నవారు కూర్చున్నట్లే ఉండాలి. బొమ్మలా కదలకూడదు. మాట్లాడకూడదు. దగ్గకూడదు. పొగ తాగకూడదు. ఇలాటివేం చేసినా, గాలిలో కదలిక వచ్చి జంతువు మనిషి జాడ కనిపెట్టేస్తుంది. మరి అటురాదు. అడవిమేకని తుపాకితో పేలుస్తారు. గురితప్పిందో- శరం కంటే వేగంగా పారిపోతుందది. అందుచేత రెండవవారు కూడా అదేక్షణంలో పేలుస్తారు. వేట దొరికాక దానిని తమగూడేనికి తీసుకెళ్ళే విధానం కూడా చిత్రంగానే ఉంటుంది. కర్రలతో పాడెలాగ కట్టి... దానిమీద మృత జంతువుని పండబెట్టి మోస్తూ, డప్పులు కొడుతూ, సంతోషంగా కేకలు వేస్తూ, సావడికి తెచ్చి అందరికీ చూపిస్తారు. తరువాత దానిని కోస్తారు. జంతువుని కొట్టినవాడికి- చట్ట (వెనుక కాలూ తొడా), వెన్ను, కాలేయం యిస్తారు. రెండో గుండు వేసిన వాడికి మెడకాయా, గుండె భాగాలూ యిస్తారు. వేటకెళ్ళినవాళ్ళు పంచుకుని ఊరివారికి కూడా కొంతకొంత చొప్పున పంచి పెడతారు. మునుపయితే చర్మాలు వొలిచి భద్రపరిచేవారు. కాని యిప్పుడు జీవకారుణ్య, పర్యావరణ నిషేధాల రీత్యా అది నేరం కనుక- పోలీసులకీ ఫారెస్టు గార్డులకీ వెరచి చర్మాలు తీయడం లేదు. పూర్వం జింకచర్మంతీసి- కూర్చుందుకు చాపగా, కిటికీలకూ, ద్వారాలకూ తెరలుగా ఉపయోగించేవారు. స్వాములూ, భక్తులూ పూజలు చేయడానికి కృష్ణాజనం (జింకచర్మం) మీద కూర్చునేవారు. చర్మంతో డప్పులు, మద్దెలు తయారుచేస్తారు. లేడికొమ్ములని గోడలకు కొట్టి హాంగర్లుగా వాడేవారు.

అనుకున్నదానికంటే ఎక్కువ వేట లభిస్తే, మాంసాన్ని ముక్కలుగా చేసి, ఎండబెట్టి వొరుగుచేసి దాచుకుంటారు. అవసరమైనప్పుడు దానిని వండుకుంటారు. ఉప్పు రాసీ వరుగులు చేసి మాంసాన్ని నిలువ జేసుకుంటారు.

మంచి వేట లభిస్తుందన్న ఆశ కలిగి... తమవద్దనున్న తుపాకిలు చాలవనిపిస్తే, దగ్గరలోని గూడెంవారిని తుపాకులతో వొచ్చి కలవమంటారు. దొరికిన వేటలో భాగమిస్తారు వారికి. గిరిజనులలో, తుపాకి ఉండడం సదుపాయమేకాక స్థాయికూడా. వేటకి వెళ్ళేది బృందంగా. వేటను పంచేది ఊరంతా. వీరిలో సంఘీభావం చాలా ఎక్కువ. గూడెంమేరకు వారిది విశ్వమానవ సౌభ్రాతృత్వమే. ముందుగా కాని చిరువేట దొరికితే- దానిని ఎవరో ఒకరికిచ్చి గూడెం పంపివేస్తారు, నిలవుంటే చెడిపోతుందని.

ఎలుగుబంటిని కొట్టడానికంత యిష్టపడరు. కాని, పిల్లల బంటుతో మహా చెడ్డ చిక్కు. ఇట్టే కంగారుపడి దూసుకొచ్చేస్తుంది మనుషులమీదకి. దానిని చంపి తీరవలసిందే. లేకపోతే గోళ్లతో చీరేసి, నరాలు తెంపేస్తుంది. ఎలుగుబంటి మాంసం తింటారు. దాని కొవ్వుని వాతనొప్పులకి ఔషధంగా వాడతారు. పెద్ద వేటగాళ్ళు చెవుల పిల్లులను పట్టించుకోరు కానీ అడవి పందులను చంపాలని తెగకోరుకుంటారు. ఏదుపంది (ముళ్ళపంది) కనపడితే వీళ్లకి సరదా. మామూలుగా ఆట్టే పెద్దదుండని యిది- ప్రాణాపాయమనేసరికి తన ముళ్ళని విప్పేస్తుంది. ముళ్ళఉండలా తయారౌతుంది ఎదుర్కొందుకు. దాని పొలుసులు, పొట్టుని మందులలో వాడతారు. నాలుగైదంగుళాల పొడవులో ధృడంగా ఉండే ఆ ముళ్ళని కొందరు 'నారదులవారు' అంటారు. ఏ రెండిళ్ళమధ్యనయినా నేలలో ఆ ముల్లుని పాతితే ఇక ఆ రెండిళ్ళవారూ



కలహాలతో కొట్టుకుచస్తారట అంతవరకూ ఎంత స్నేహితులయినా.

ఎక్కువమంది ఉన్నప్పుడు... వేటగాళ్ళు మినహా మిగిలినవారు వలయంలా ఏర్పడి డప్పులు మోగిస్తూ కేకలు వేస్తూ జంతువులను తుపాకీలు పట్టి సిద్ధంగా ఉన్న వేటగాళ్ళవేపు తరుముతారు. చుట్టూ మనుషులే కనుక జంతువు, తప్పించుకుపోలేదు కేంద్రంవేపు పరుగెత్తడం తప్ప. కనుక అది వేటగాళ్ళ వేపే వొస్తుంది విధిగా. దగ్గరకు రానిచ్చి తుపాకితో కాలుస్తారు.

చెవులపిల్లుల వంటివి ఒక పొదలో ఉన్నట్లు పసికడితే- దాని చుట్టూ ఉన్న పొదలలోంచి డప్పులు వాయిస్తారు. అవి కంగారుపడతాయి శబ్దాలకు. పైకి పరుగెడతాయి. వేటగాళ్ళకి దొరికిపోతాయి.

అతి రుచిగా ఉండే అడవి కోళ్ళనూ... నెమళ్ళనూ పట్టేందుకు మరోరకం ఉపాయాలు పన్నుతారు. అవి తిరిగే ప్రాంతంలో అవి ప్రీతిగా తినే గింజలను ఒక చెట్టుముందు జల్లి వేటగాళ్ళు ఆ చెట్టు వెనుకే కూర్చుంటారు. ఆ పక్షులు గింజలు మేయడానికి వస్తాయి. అవి మేతలో మునిగి ఉండగా వల విసిరి పట్టడమో కాల్చి చంపడమో చేస్తారు. మగ నెమలి ఈకలకే కాక మాంసానికీ పనికొస్తుంది. అడవి గువ్వలను తుపాకితో కొడతారు. కొంతమంది గిరిజనులు తుపాకి గుళ్ళు కొంటే ఎక్కువ ఖర్చు అని రవ్వలూ, మందూ విడిగా కొని తామే గుళ్ళు తయారుచేసుకుంటారు. డబల్ బ్యారెల్ గన్స్ కలిగిన గిరిజనులు కూడా ఉంటారు.

వీటన్నిటికంటే విచిత్రమూ అత్యంత ప్రమాదభరితమూ అయినది కారెపోయడం. ఇదొక వేట విధానం. పెద్ద జంతువులయిన కొండమేకలు... కణుజులు... అడవి పందుల వంటివాటిని యీ పద్ధతిలో చంపుతారు.

అడవి నడుమ... జంతువులు మసిలే చోట ముందుగా ఒక పగటివేళ వృత్తాకార స్థలం ఏర్పరుస్తారు. దీనిని కళ్ళం అంటారు. కళ్ళం చుట్టూ సహజంగా అడవిలా కనిపించేలా మొక్కలూ కొమ్మలూ పెడతారు. కళ్ళం మధ్యగా ఒక గొయ్యి తీస్తారు రెండు మూడడుగులు మించకుండా. ఆ గోతికి దగ్గరగా చదునయిన రాయిని ఏటవాలుగా ఉంచుతారు. కళ్ళం అవతలినుంచి మగవారు ఈ రాతిమీదకు మూత్రవిసర్జన చేస్తారు. ఆ మూత్రమంతా రాతిమీదుగా జారి గోతిలో నిలవౌతుంది. కారెపోయడానికి ఐదారు రోజుల ముందు నుంచీ వీలయినంతగానూ కళ్ళం అవతల నుంచి, కంతలోంచి, రాతిమీదుగా, గోతిలోకి మూత్రాన్ని విసర్జిస్తూనే ఉంటారు. వృత్తాకారంగా ఉన్న కళ్ళం ఒకవేపు మాత్రం సన్నగా బల్బులా ముగుస్తుంది. ఆ చిన్న ద్వారం మొక్కలు కొమ్మలతో నింపుతారు. ద్వారానికివతల మరొక వృత్తాకారపు స్థలముంటుంది కళ్ళంలాగే కొమ్మలూ మొక్కలూ కంచెగా. దీనిలో మనుషులు పట్టే స్థలముంటుంది. పులులూ సింహాలూ వంటి వాటిని మినహాయిస్తే, మిగిలిన అనేక జంతువులకి రొచ్చు కంపంటే అతి యిష్టం. కళ్ళంలోని గోతిలో నాలుగయిదు రోజులు నిలువయిన మానవమూత్రం దుర్వాసన అతిదుర్భరం. వాసన పసికట్టే... ఘ్రాణశక్తి అధికంగా ఉంటుంది కనుక జంతువులు గాలివాటంలో దీనిని సులభంగా పసికట్టి, యిటు ఆకర్షించబడతాయి. కళ్ళంలో మనిషి కనపడకుండా చుట్టూ మొక్కలు అవతలి వృక్ష గుడారంలో మనుషులున్నా రొచ్చు వాసన విపరీతంగా గుప్పుతూ నరవాసనను కప్పేస్తుంది. అందుచేత జంతువులు అనుమానించకుండా రాత్రివేళ కళ్ళంలోకి వొచ్చి రొచ్చు నాకడం

ప్రారంభిస్తాయి. ఇదిగో యిప్పుడే వాటిని కాల్చాలి. కళ్ళం చివర బల్బులా ఉండి కొమ్మలతో కప్పబడిన ద్వారం దగ్గరున్న వేటగాడు కొమ్మల సందులోంచి చూస్తూ, తుపాకి గొట్టం జొనిపి కాల్చాలి. కళ్ళంలోకి లైటు వేయడానికి కుదరదు. అందుచేత మృగం రొచ్చు నాకుతున్న శబ్దాన్నిబట్టి, గురి చూసి కాల్చాలి. అంటే అతగాడికి శబ్ద వేది విద్య తెలియాలన్నమాట. పొరపా టున గురితప్పిందో, మృగానికి సరయిన దెబ్బతగలలేదో ఆ మృగం ద్వారంవేపు నుంచి యిటువేపునున్న మొక్కల ఆవరణ లోకి వొచ్చేస్తుంది ఎదురయిన వారిని ఎదు ర్కుంటూ. యిటువేపు మనుషులు మాటు వేసి ఉంటారు తుపాకితో ఒకసారి మృగం యిటువొచ్చిందో వీళ్ళు పారిపోడానికీ తప్పిం చుకుందుకూ కూడా ఉండదు. మెకంతో నేరుగా తలపడవలసిందే. అందుకే కారెపో యడానికి అందరూ సాహసించరు. సాయంత్రమే వెళ్ళి మాటులో కూర్చో వాలి. కదలకుండా... మాట్లాడకుండా... పొగ పీల్చకుండా, మృగం వొచ్చేవరకూ సహనంతో ఎదురుచూడాలి. దానికేమాత్రం అనుమానం కలిగినా అది రాదు. అర్ధరాత్రి వేళ ఎర్రమోవిలి, నల్లమోవిలి వొస్తూం టాయి. ఎర్రమోవిలి, నల్లమోవిలిలు గిరిజ నుల దెయ్యాలు. అడవి మధ్యంలో కారెపో యడానికి వొచ్చి మాటువేసే వారినవి అర్ధ రాత్రి... "వెనక్కిపో... చంపేస్తా" అంటూ వికృతమైన నవ్వుల్తో మొర్రోమనే ఏడుపుల్తో అడవి నిశ్శబ్దాన్ని చీల్చుకువొస్తూంటాయి.

"పారిపో... లేకపోతే పీక పిసుకుతా" అంటూ అదరగొడుతుంటాయి. గుండె నిబ్బరం లేకపోతే వాటికి అదిరి భయంతో రక్తం కక్కుకుని చస్తారు. రొచ్చు కంపు, నిశ్చలన భంగిమ, మౌనం, నిరీక్షణ, దెయ్యాల ఝడిపింపులు, యివన్నీ అధిగ మించాలి. గిరిజనుల ఆహార సంపాదన యింతకష్టంతో కూడుకున్నది. వీళ్ళ జీవి తాలు పూలపాన్పులు కావనేది ఇందుకే! వాళ్ళు సంవత్సరంలో అధిక భాగం వేటాడే తిండి సంపాదించుకోవాలి.

అయితే ఏ కొండమేకో (లేడి), కణుసో కాని దొరికిందో వారు అంతవరకూపడ్డ కష్ట మంతా మరచిపోతారు. పెద్ద జంతువును చంపామన్న గర్వంతోపాటు, ఎక్కువ రోజు లపాటు రుచికరమయిన తిండి కూడాను. అడవి పందే అసలు రుచి. సారా మీద దాని మాంసమయితే మజాయే మజా. నిజానికి పేదరికం మూలానా, దగ్గరలో దొరకకపోవడానా వారు మసాలా సామ గ్రిని మాంసం వంటకాలలో కూడా అట్టే వాడనేవాడరు. అవిసె, ఆముదం నూనెలు తప్ప మంచినూనె వాడనేవాడరు. అయినా అడవిపందీ, కణుసూ వంటివి అలా వండినా అద్భుతంగా ఉంటాయి.

ప్రాణమన్నాక మనిషిదీ ప్రాణమే, జంతు వుదీ జీవమే. ఏ ప్రాణికయినా బతుకు తీపి. ప్రాణం కాపాడుకుందుకది ఎంత యినా తెగిస్తుంది.

మనిషికి జంతువులాహారం, కొన్ని జంతు వులకి మనుషులు ఆహారం. ఆటవికులదీ, అడవి జంతువులదీ ఒకటే సూత్రం, అనవ సరంగా ప్రాణం తీయకపోడం. మనిషి అంతరాత్మకి తెలుసు జంతువుల వల్లనే తన జీవితం నిలబడుతోందని. అందుకే అమెరి కావంటి దేశంలో రెడ్ ఇండియన్లు ఒక ప్రాణిని ఆహారం కోసం చంపేముందు దానికి నమస్కరించి "ఆకలి తీర్చుకుందుకు నిన్ను చంపవలసి వస్తోంది. అందుకు నన్ను క్షమించు. నీవు నాకాహారమై ఆకలి తీర్చుతున్నందుకు నీకు చాలా కృతజ్ఞతలు. దేవా! నాకు ఆహారం లభింపజేస్తున్నందుకు నీకు నా నమస్కారములు" అని భగవ

ధ్యానం చేసి మరీ చంపుతారట దేనిన యినా.



సందుడు తన అనుచరులతో కూడా వేట కెళ్లడానికే నిశ్చయించుకున్నాడు. మర్నాడు రాజుపాకల నుంచి పూజారీ, భీమన్నా, మహారాజూ, చాలామంది యువకులూ, యువతులూ బిందపోలం బయలుదేరారు కాలికడకనే. ఆరాత్రి అక్కడ సభ అయ్యాక పడక చేసి పొద్దున్నే రావాలని నిర్ణయించు కున్నారు. బిందపోలం రాజుపాకలకు మరీ దూరమేమీకాదు రెండు మైళ్లే. బిందపోలం చిన్న గూడెమే అయినా ఇద్దరు పూజా రులు. చీకటి పడేవేళకి అన్నిగూడేలనుంచీ జనం బిందపోలం చేరుకున్నారు. సావడిలో పెట్రోమాక్స్‌లైట్ పెట్టారు. పూజారి సభ ప్రారంభించి ఒక నడివయస్కుడిని ముందుగా మాట్లాడమన్నాడు.



**తూర్పు** కనులు తెరిచి యోచన చేస్తుంది. ఉషస్సు ఉర్వీమీదకురకాలని ఉబలాటపడు తోంది. నిదుర బద్ధకంనుంచి కర్మలోకీ... నిశ్చైతన్యంలోంచి చైతన్యంలోకీ అడుగులువే యాలని ఆరాటపడుతోంది.

నాగరికత అయితే నడిరేయి దాటాకకాని నిదురపోదు. ఆటవికత మాత్రం మంచి బాలుడిలా పొద్దువారగానే పక్క పరచుకుం టుంది.

గూడెం నిదుర అంచున తచ్చాడుతోం దింకా. కార్యరంగంలోకి దూకడంలేదు. బద్ధ కమూకాదు, నిర్లిప్తమూకాదు. అడవిలో చీకటి తెరలు పూర్తిగా విడితేతప్ప దినము ప్రారంభంకాదు.

పక్షులు నిదురను రెప్పలనుంచి రెక్కల మీదుగా విదిలించుకుంటూ... మేతకు బయలుదేరడానికి సన్నాహమౌతున్న సూర్యోదయాత్పూర్వ సమయంలో ఆటవిక నియమావళినుల్లంఘించడానికి కూడా వెర వక ఆమని రాకనే ఆరాటపడి ఆలాపనకు దిగే కోయిలలా ఆకాశం మేఘావృతం కాకుండానే ఆటకు పురివిప్పిన నెమలిపి ట్టలా... రేయినిదుర కనురెప్పల సందుల నొదిలిన చిహ్నాలను చెరువులోని నీటితో కడిగేసుకుని... నిదుర ఛాయలనుంచి చల్లని నీటితో విముక్తులై... ఒక కొండ దొర.. అతని కూన నడుస్తున్నారు.

ఇరువురికీ నడుముకు పైన కానీ మోకా లికి దిగువనకాని వస్త్రంలేదు. ఆచ్ఛాదన లేదు. ఉన్నవి అచ్చంగా అంగవస్త్రాలే. నెత్తి మీద అపర శివుని జటాజూటాలవలె గుండ్రంగా బిగించిన శిఖలు. నొసటనేమో సింధూర తిలకాలు. భుజాలకు జోలెలు. దండలకండలకి పాము పిల్లలు చుట్టుకు న్నట్లు వేరులు వొంచి వలయాలుగా మల చిన అలంకారాలు. పాదాలకు రక్షలులేవు.

మృదువుగానే అయినా మందలిస్తున్నట్లు న్నాడు కొండదొర. "బిడ్డా! అతి చురుకొద్దు. చీకటింకా చిక్కగానే చెదరకనే ఉంది. కాలు చూసుకుంటూ నిదానంగా వెయ్యాలి. కిర్రు చెప్పులో, పాకోళ్లో (కర్రచెప్పులు) కాలికుంటే ఆ దారివేరు. ఏ పురుగు (పాము) మీద యినా కాలు పడిందో కాలుమీద కాటుప డిందే"

చిన్నవాడు తక్కువ తిన్నాడా? కౌజుపిట్ట కూసినట్లే బదులు చెప్పాడు. "అయ్యా! మన మంటే ఎలాటి బుస్సయినా (పామయినా) తుస్సే. కాటువేసేవరకూ కీలుకట్టుక్కూకుం టానా? తోకిచ్చుకుని లేపి గాలిలో గింగి రాలు తిప్పి టపీమని దాని తలను రాతికో, చెట్టుకో బాదనూ? "

వాడిది చెవులపిల్లిలా ఛంగుఛంగున చెంగనాలు వేసే వయసు.

"సెబాస్! అదీ కొండదొరంటే... నువ్వు పులిబిడ్డవిరా" మెచ్చుకున్నాడు కొండదొర.

అతని కంఠంలో పుత్రోత్సాహం పగలబూ సిందొక్కసారి. నిన్న సాయంత్రం... చేరు వకు పిలిచి చెంతకు చేర్చుకుని కళ్లల్లోకి చూస్తూ అడిగాడు "పట్నం వొస్తావా బిడ్డా? "

పక్షి పిల్లను పిలిచి "ఆకాశంలోకెగురు తావా? " అంటే ఏమంటుంది?

అప్పటికే సింగడు నేస్తాలనుంచి పట్నం విశేషాలెన్నో విని... ఎప్పుడెప్పుడు పట్న వోసం చూద్దునా అని ఎంతో తహతహలా డిపోతున్నాడాయే. "ఓ!" అరిచాడు అత్యు త్సాహంగా.

"ఎప్పుడు? " ఆరాటంగా చూశాడు నాయి నవేపు.

"రేయి మలిగాక.. తొందరగా లేపుతాన యితే"

ఆకర్ణాంతమూ నారిసారించి విడిచిన. శరంలాగే దూసుకుపోయాడు సింగడు తన నేస్తగాండ్ర దగ్గరికి. "రేపు నేను పట్నం బోత" సంబరంగా చెప్పాడు. సాహసగాం డ్రకి చెప్పి పాకకొచ్చి సంకటి తిని అయ్య పక్కన చేరాడు.

"అయ్యా!"

"ఏటి? "

"పట్నమెట్లుంటది? మనగూడెంకంటె..."

"శానా పెద్దది. బలే పసందుగుంటది. పెద్దపెద్ద మిద్దెలు, మేడలు. బాట్లమీద తురుతురు మోటార్లు. టుప్‌టుప్‌బళ్లు. ఆడే పాడే అందాల బొమ్మలు"

"విప్పసారా దొరుకుద్దా? జీలుక్కల్లు చిక్కేనా? "

"విప్పసారా కాదు. గొప్ప సారాల్దొరుకు తయ్. చిన్నబుడ్డి... పెద్దబుడ్డి... ఈ మజ్జన బస్తాలొచ్చినయ్‌లే... సారా బస్తాలు"

"సారానీ మూటలు కడతరా!"

"నీళ్లని కూడ ప్యాకెట్లలొ పెడతరు. పట్న మంటే మరేటనుకొన్నవ్? "

"కబళించేందుకు కణుసు మాంసం దొరు కుద్దా? "

"కోడిమాంసం, వేటమాంసం, మేక మాంసం, ఎద్దుమాంసం... ఓహ్! బలే లభి స్తాయి. మీటనొక్కితే చాలు వెలుతురు ఉరుకుద్ది. గాలి హోరు మనొస్తది. పట్నంలో యినబ్బద్దీల మీద పరుగెత్తే గుప్ గుప్‌పొగ బళ్లుంటాయి పెద్దవి. రైళ్లంటారు వాటిని. గాల్లో ఎగిరే..."

"గుమ్మటాలా? "

"అహ ఇమానాలు. పెద్ద పిట్టలు. మరేమొ పట్నంలో సముద్రముంటాది"

"మన పెద్ద కాలువంతుంటదా సము ద్రము? " కుతూహలంగా అడిగాడు.

"చస్! మన కాలవేడ? సముద్రమేడ? శానా పెద్దది. ఈ వొడ్డున్నిలబడి జూస్తే ఆవొడ్డగుపించదు. అంత పెద్దది. సము ద్రంలో పొగోడలు తేలుతూబోతాయి. మరి సినేమాలు... అంటే ఆడేపాడే తైతక్కల బొమ్మలు"

"నేనెన్నడూ సూళ్లేదయ్యా" తన పుట్టుక పనికిమాలినదైపోయినట్లు ఓగులుగా అన్నాడు సింగడు.

దానికి అతని తండ్రి నవ్వేసి,

"నక్కబుట్టి నాలుగాది వారాలు కాలేదు గాని యింత గాలీవానా ఎరగనందట. నీ ముడ్డి కిందకు నిన్నంటే నిన్నగద పట్టుమని పందొమ్మిదేళ్లొచ్చినయ్? అందుకేగద రేపు పట్నం బోతన్నవ్? నేనక్కడికెళ్లాక అన్నీ చూబిస్తన్లే. అదేమయిన బెమ్మవిద్యా? "

ఆరాత్రి సింగడికి తిండి తినకుండగనే కడుపు నిండిపోయింది. కళ్లనిండా పట్నం కలలైపోయి కంట కునుకుకే జాగాలేకపో యింది. ఎప్పుడు తెల్లారుతుందా ఎపుడు

పట్నంలో పడతామా అని ఒకటే తొందరా ఆరాటమూ. అందుకే కుర్రాడి నడకలో అంత వడి.

"నిలువు బిడ్డా"

విధిలేక నిలిచాడు. విధేయత కూడా గిరి జన సంస్కృతిలో ఒక భాగం. అయ్య దిశ చూసి కుర్రాడు ఆశ్చర్యపోయాడు. "అయ్యా! రేతిరేళ సెట్లు నిదరోతాయనీ... సీకటడ్డాక చెట్టు మీద పక్షులూ నిదర చేస్తా యనీ... చీకటడ్డాక చెట్టుమీద చెయ్యెయ్యరా దనీ నువ్వే చెప్పావు, జ్ఞాపకం లేదా? ఇంకా తెలవారలేదు. చెట్టు నిదర తీరుంటదే. చెట్టె క్కడం పాపం కాదో? "

"తప్పనిసరిగదరా! తప్పుకాయమని దణ్ణ మెట్టాన్లే! నువ్వా ఎక్కు. చేతికందినన్ని మంచి కాయలు కొయ్..." తన మాటకు తిరుగులేదన్నట్లే చెప్పాడు.

"బాబా!" బిత్తరపోయాడు బుడ్డోడు. "నేనెప్పుడేనా ఆకలికి మించి అదనంగా మరో కాయ తెంపితే-చెట్టు కష్టపడి చెమటోడ్చి కాసే కాయను ఎవరికీ కొరగాకుండా కొరికి పాడుచేయడం పాపమూ నేరమే. చెట్టు నున్న కాయనయితే పిట్టేనా తింటుంది-అని కూక లేసేవాడివే. ఆ నువ్వేనా అయ్యా యీ పొద్దు నీనోటే చేతికందినన్ని కాయలు చిక్కించుకోమంటున్నది? "

అతను కుర్రాడి భుజం తట్టాడు. "సెబాస్ చిన్నోరా, సెబాస్. పిట్ట బాగానే కూత పట్టింది. వెన్ను వేలెడు లేకపోయినా పలుకు మెలుకవగానూమేలుగానూ ఉంది. మనిషంటే అలాగే ఉండాలి. మాట తకరా రుని మన్నించరాదు- ఎదుటివాడు మహాను భావుడే ఐనా. ఈ వొక్క పాలికీ, నీపాపం నేన్దీసుకుంటాను. తప్పు కాయమని అడవిత ల్లిని ప్రార్థిస్తాను. తాత్సారం చెయ్యక కానీయ్. తూరుపు తెలవారకనే మనం శానా పనులు చెయ్యాలి"

కాయలుకోసి, భుజాలకెత్తుకుని... నడుస్తూ- నది వద్దకు చేరారు. నాగరికత అడవిని మలినం చేయకుండానూ, ఆటవి కత నగరం వేపు జారిపోకుండానూ అడ్డుకో డానికా అన్నట్లు అదెప్పుడూ అతిలోతుగా పారుతూంటుంది. దానిని చూపి- "మన కొండా అడివీ మిగిలిన ప్రపంచంలా పాడైపోకుండా ఉండడానికి కారణం ఈ నదే. ఇదే లేకపోతే- నగరవాసులు తెగ వొచ్చి అడవి ప్రజలకు డబ్బు జబ్బుని అంటించిపోయేవారు. ఆటవికులకు డబ్బు జబ్బు అంటించబట్టే..." అతని కంఠం గద్గ దికమైంది. జ్ఞాపకాల తెరలు కదిలి మనసు వేదనా భరితమయింది. డబ్బుకోసం తమ చేతులతో తామే అడవిని తెగ నరికి నాగరి కులకందించారు. కలపకోసం, ముందు చూపు లేకుండా చెట్లను కూలదోసి తమ జీవనాన్నీ ఆవాసాన్నీ నిలువునా నిప్పెట్టుకు న్నారు. నిర్భాగ్యులయారు. నాగరిక విలాస పురుషులు విసిరిన కాగితాల డబ్బుకోసమో...వాళ్లందించే కానుకలకో సమో, కొండ స్త్రీలు శీలమిచ్చి వ్యాధులు తెచ్చుకుని నాశనమయ్యారు. ఎన్ని అడ వులూ ఎందరాడాళ్లూ నశించిపోయారో అలాగ! అడవులు తగ్గిపోబట్టే వాతావర ణమూ వర్షపాతమూ అస్తవ్యస్తమూ అయో మయమూ ఐపోయాయి.

"నది దాటాక? " అడిగాడు సింగడు.

"నాగరికతకు నాంది... నా హస్తం పట్టు కుని ఈదు. తెప్పకింకా తెల్లవారదు"

"ఈతలో నేనెంతటివాడినో నువ్వే సూడు-" కుర్రాడు దూకుడుగా నీటిలోకి గెంతాడు నెత్తిమీద తట్టెడు సామానుతోనే. తనకంటి ముందు మాయమై అవతలి వొడ్డున నిలబడిన బిడ్డను చూసి అయ్య మనసతితియ్యనయింది.

కొడుకు చేయి పుచ్చుకుని గ్రామంలోకి

నడిపించాడు. మైదానం కనుక సూర్యుడు త్వరగా వొచ్చేశాడు.

అయ్య చేస్తున్నదేమీ అర్థంకాలేదు కుర్రాడికి. "కాయలూ, పళ్లూ కరక్కాయలూ, తేనెతుట్టెలూ, తీపి బొప్పాసలూ యిస్తున్నావు, కరకుకాసులూ కాగితమ్ముక్కలూ తీసుకుంటున్నావు! జోలెలకొద్దీ కాయలు-చెయ్యేనా నిండని కాగితాలు... ఇదేటిది? " బుద్ధిబూరెలు తింటూందా అన్నట్లే చూశాడు. తియ్యతేనెయిచ్చి- ఉప్పో, అగ్గిపెట్టెలో, సిరసనూనో (కిరసనాయిలో) తీసుకుంటే అదో దారి. కాగితం ముక్కలు తీసుకోడమేమిటి, తెలివితక్కువ అనిపించింది వాడికి. అదే అడిగాడు. "దీన్ని డబ్బంటారు. మనం దుడ్డంటాంకదా అదే,సొమ్ములని అంటారు"

"గాలేస్తే ఎగిరిపోయే కాగితమ్ముక్కలూ... మోటుగా పట్టుకుంటే చిరిగిపోయి చీలికలయ్యే కాగితమ్ముక్కలు... ఆకలేస్తే కొరుక్కు తిండానికేనా కొరగాని కరకు కాసులు... బిళ్లలు... ఇదా డబ్బు! ఈ దుడ్డుకంటె రాతి బెడ్డనయం. నోట బెట్టుకుంటె ఉప్పగా నయినా తగుల్తుంది నాలిక్కి. సొమ్ములంటే పశువులు కాదా? "

"పల్లెల్లోనూ, పూర్వమూ అంతే. ఇప్పుడు సొమ్ములంటే డబ్బులూను" అంటూ కొడుక్కి డబ్బు... నాణాలూ... విలువా గురించి వివరించాడు బస్సొచ్చేలోగా. సింగడు బస్సుని ఒకసారి దూరంనుంచి చూశాడు. దాని గురించి కొంచెం తెలుసు. కాని ప్రత్యక్షంగా చూడడమూ, స్వయంగా ఎక్కడమూ వేరుకదా!"

"ఎర్రేనుగు నాగుంది" అంటూ బితుకు బితుకుమంటూనే ఎక్కాడు.

"సెట్లు ఎనక్కి లగెత్తుతున్నాయేటీ? బస్సు కొండని గుద్దీదా? దానికిష్టంనేకపోతే గాడిదలా కిందపడేసి తొక్కేదా? మనం కూకున్నది మెత్తగుందేల? సుకంగుందేల? బస్సోడు అంత బిక్కగా ఉన్నాడే, అంత పెద్ద బస్సు ఆడు చెక్రందిప్పితే తిరగబడకుండా ఎందుకింటూందీ? "

"వాడు అయ్యనడిగే ప్రశ్నలకు బస్సులో వాళ్లు చాలామంది పడీపడీ నవ్వులు. పద్దెనిమిది నిండేసరికే బలిష్ఠంగా వికసించిన ఆరోగ్యవంతమయిన సింగడి శరీరమూ ఆకృతీ చూసి, ఆకారం భీకరమేకాని బుద్ధి వొట్టి సూకరం అనుకున్నారు. అయ్య ఓపిగ్గా తనకి తెలిసినవి చెబుతున్నాడు. సింగడి కడివయితే కొట్టిన పిండే కాని నాగరికత ఆట్టే తెలియదు. వయసు వినేకాల మధ్య సంబంధం పరిసరాలను బట్టికూడా పరిగణించకపోతే పద్దెనిదేళ్ల వాడి అడవి వయసు పదేళ్ల పట్నపోడుకి కూడా సాటి రాదు. నెలవు తప్పితే నరులు తెలియని వారు కావొచ్చు వొల్లకో... వాగక, వదరక మెల్లనమీద నీకే అన్నీ తెల్లమౌతాయి..."

వినిపించుకోలేదు సింగడు. "ఆళ్లెవళ్లో వొస్తే మనని లేపి నిలబడతారేం? నువ్వా డబ్బిచ్చినవ్‌గా? మనమెందుకు నిలబెడాల? తక్కువిచ్చావా దుడ్డు? "

"వాళ్లు గొప్పవాండ్రు"

"గొప్పంటే? "

"వొంటినిండా బట్ట, చేతినిండా దుడ్డు"

"నీ దగ్గరా దుడ్డుందిగా? " నువ్వు గొప్పవాడివి కావా అన్నట్లే చూశాడు. బట్టలు గొప్పగా అనిపించలేదువాడికి. చల్లని మంచు... చక్కనిగాలి... వెచ్చని ఎండ...కొండకాలువలోనీరు... చెవులపిల్లి వొళ్లు, తగులతూంటే ఎంత హాయిగా ఉంటుందీ! మొలగుడ్డా, రొమ్ము పీలికా ఆడాళ్లకీ; గోచీగుడ్డ మొగాళ్లకీ సాలదూ? ఆహాయెదులుకుని ఉల్లిగడ్డ రేకుల్లా... గంగిరెద్దులా గుడ్డలు దిగేసుకోడం ఏంగొప్ప? సిగ్గు కప్పుకుందుకు సిన్నపీలిక సాలదూ?

కాళీ అయితే కూచోడం... లేకపోతే నిలు



చోడం, అలాగే సాగింది బస్సుప్రయాణం. నగరంలో వాళ్లు దిగేసరికి, చీకటిపడకుండానే చీకటి పడిందన్న భ్రాంతిని కలుగజేస్తూ విద్యుద్దీపాలు. నగరాలకి చీకటంటే... రాత్రంటే మక్కువ ఎక్కువ. వాళ్ల వ్యాపారాలూ విలాసాలూ ఎక్కువగా సాగేది చుక్కలొచ్చేకే. బార్‌లకి రాత్రి... వ్యభిచారానికి రాత్రి, దొంగలకురాత్రి, దొంగ వ్యాపారాలకి రాత్రి, సినిమాలకు రాత్రి, చీకటి పనులకి రాత్రి. వాళ్లకి పగలంటే బెదురు. కర్మసాక్షంటే కలవరం.

"బాబా! సూడు సూడు... ఆకాశంలో వెలుగు పువ్వులు"

"వెలుగు పువ్వులూకావు, నచ్చత్రాలూ కావు ఇలాయిబుడ్లు, వెలుగ్గొట్టాలు, అంటే కరంటు దీపాలన్నమాట. అడుగెయ్ వడిగా"

సింగడు శీఘ్రంగా ఎలా నడవగలడు?

ఉక్కిరి బిక్కిరిగా ఉంది వాడి పరిస్థితి. ఎటు చూస్తే అటే వింత. మేడలు, మిద్దెలు, విద్యుద్దీపాలు.. బస్సులు...

రంగు రంగుల దీపాలలో కదలికల వ్యాపార ప్రకటనలు. షోకేసుల్లో చిత్రంగా కదులుతున్న- మనుషులేమో అనిపించే మర బొమ్మలు... తేనెటీగల్లా ముసురుకునే మనుషులు, ఇందరు జనమేమిటి? ఏంచేస్తారు వీళ్లంతా? వాడికి, చూడడానికి రెండు కళ్లూ చాలడంలేదు. మెదడు ఉక్కిరి బిక్కిరి ఐపోతోంది. అన్ని చిత్రవిచిత్రాలకా లేతమనసు ఏమూలకీ చాలడంలేదు. అందుకే అడుగులో వెనకబడుతున్నాడు.

"దిక్కులు చూడకు, తోవ తప్పావు" తండ్రి మందలింపు.

అంతలోనే పరుగెడుతూ వొచ్చిన బండీ, పాటా. ఆ పాట తమాషాగాఉందర్థంకాకపోతున్నా. అక్కడికక్కడే చిందులు వేయాలనిపించేస్తూందిపాటకి.

"పాటలబండీలే, పదపద... చాయ్ తాగితే వెచ్చగా ఆయిగా ఉంటది. చురుకొస్తది. పట్నమంతా చెక్కర్లు కొడదం..." అంటూ రోడ్డుపక్క బడ్డీకాడకు నడిపించాడు.

"రొండు బన్నులు టీలు" అడిగాడు బడ్డీ వాడిని.

"దుడ్లు యివ్వు"

ఇచ్చాడు కొండదొర. సింగడికి వెంటనే అనుమాన మొచ్చేసింది "అయ్యా! అందరూ చాయ్‌లు పుచ్చుకున్నాక దుడ్డులిస్తే నిన్నేల అతడు ముంగలే అడిగినాడు? "

"మన్దగ్గర డబ్బులు లేవేమో అని అనుమానించి దుడ్లు చేత బెట్టినగాని వస్తువు మనకివ్వరు పట్నమోళ్లు. డబ్బులివ్వనిదే వొస్తువివ్వరుకదా"

"అనుమానమేల? లేనిదున్నదని అసత్యమాడతామా! మనమూ మనుషులమే కద? " విడ్డూరపడ్డాడు.

"పట్నంలో కొందరు నిజంగానే అబద్దాలాడతరు. మనం కొండవాళ్లమూ కోయవాళ్లమూ. మనవి గోసీ యేషమూ యాస బాసా. మన దగ్గర సొమ్ములుంటాయంటే వాళ్లకి నమ్మకం సాలదు"

సింగడికి కల్లు రొట్టె కమ్మని వాసనతో అమిత రుచి అనిపించింది. జీవితంలో తొలిసారిగా తాగుతున్న పట్నం టీ లొట్టవేయించింది. ఆ రొట్టె, టీ అద్భుతమే అనిపించాయి.

"అదేమిటి బాబా? "

"అదీ తిండి వేంద్రమే. హోటేలంటారు"

"హోటేలా! ఎలా గుంటదది? "

"తళ తళ బల్ల. ఎత్తుకురసీ పీట. మెరుపు (స్టీలు) కంచంలో వరి కూడు. కిందపడినా పగలని (ప్లాస్టిక్) గ్లాసులతో మంచినీళ్లు. నెత్తిమీద చల్లగా తిరుగుడు

చక్రం (ఫ్యాన్). ఎన్నెల గొట్టాం ( ట్యూబ్ లైట్) మచ్చులగచ్చు (మొజాయిక్ ఫ్లోర్).

"నన్నాడకే కొనిపోలేక పోనావా? "

"ఆడ కూడు అతి కరీదు. చాలా దుడ్లు చెల్లించాలె. అది, గొప్పోళ్లకిలే బిడ్డా"

కొండమీద అన్నమమ్ముకోరు. కొనుక్కునే వాళ్లూ ఉండరు. ఇక్కడ అన్నమమ్ముకోడం, సింగడికి నచ్చలేదు. ఆ అమ్ముకోడంలోనూ ఇన్ని తిరకాసులా!

"పట్నమంటే ఇదేనా? "

కులికినట్లే కిసుక్కుమన్నాడు తండ్రి. "నువ్వింత దనుక సూసిన పట్నమేమో సీమతలకాయంత, సూడవలసిందేమో ఏన్గు బుర్రంత. లగెత్తు. సినేమా బొమ్మకి పోదారి, యేళమించి పోకండ"

కిటికీ లోంచి చెయెట్టి డబ్బులందించి రంగు కాగితమ్ముక్కలు రెండట్టుగొచ్చిన నాయనను చూసి, 'ఇవేనా రంగుల సినేమాలు? " అడిగాడు సింగడు.

"ఇవి టిక్కెట్లు. పదపద" గేటువేపు లాక్కుపోయాడు.

గేటుమనిషి టిక్కెట్లు చింపి ముక్కలు వెనక్కివ్వగా, " ఇలా చించుకునే కాడికి అంత పెద్ద టిక్కట్లివ్వడమేం? " అడిగాడు తన సందేహాన్ని.

అయ్య చెప్పలేదు. బస్సులోనూ అంతే. ఓచోట బస్సు తోవకడ్డంగా రైలుపట్టాలు... గేటేసేశారు. బస్సాపేసేరు. ఎందుకలాగ అని ఆరా తీస్తే " బస్సెళ్లి రైలుని గుద్దేస్తే- కరీదైన రైలు చెడిపోతద"ని అన్నాడు. ఎందుకో బస్సులో వాళ్లంతా నవ్వారు అయ్య మూతి ముడుచుకున్నాడు

చటుక్కున దీపాలారిపోయేసరికి సింగడు బెదిరిపోయాడు.

"పర్నేదు. సీకట్లోనే బొమ్మ సక్కంగా అగుపిస్తుంది" వాడి చేయి పట్టుకున్నాడు తండ్రి. సినిమా మొదలయింది. ఒక ఆటవికుడు తన జీవితంలో మొట్టమొదటిసారిగా చూసే చలన చిత్రం ఎంత అద్భుతంలో, ఆనందంలో, అనిర్వచనీయానుభూతులలో ముంచగలదో అంతగా ఆ సినిమా సింగడిని ముగ్ధుడిని చేయసాగింది.

"వాడే ఎన్టీవోడు"

"పట్నం మనిషి గదా! కోయవాడిలా ఉండాడే? "

"మారేషంలే. ఇంట్రబెల్ తరువాత శీరాముడైపోతాడు"

"ఇంటర్బెల్లేటీ? "

"గంట కొడుతారు. అదే బెల్లు. ఇంటర్బెల్... చూడుచూడు సినేమా"

కళ్ళూ వొళ్ళూ మనసూ అన్నీ పెద్దవి చేసుకుచూస్తూ సినీమాలో లీనమైపోయాడు సింగడు. అది అయి... బయటకొచ్చి నడుస్తూంటే- "బాబా! సినేమాలో కొందరు మిద్దెలాటి మిట్టన కూచుంటే మనమేల కింద అంత లోతున కూర్చున్నం? "

"ఆళ్ళిచ్చిన దుడ్లెక్కువ"

"ఏందడిగినా దుడ్లే అంటావు. అందరు జూ సేదా సిణేమాయేగంద? ఎత్తున కూచుంటే వొక బొమ్మ, దిగువన కూకుంటే మరివొక బొమ్మ కాపిస్తాయా? సొమ్ము-బొమ్మకా, కూసోడానికా? "

"కూర్సోడంలో సుకం కోసంలే"

"మన కర్రబల్లమీన మాత్తరం సుకంగ నేదూ? "

"గొప్పోళ్ళకా సుకం చాలదు. ఇంకా కావాలని ఎత్తున బోయి కూకుంటారు. దుడ్లెక్కువలే"

"సుకానికెంతయితే సాలుతుంది? ఆశక

యినా హాయిుకైనా అంతుండాలిగద? "

★ ★ ★

తండ్రీ కొడుకులు నగరపు వీధులలో నడుస్తున్నారు. నడిరేయి సమీపిస్తోంది. షాపులు దీపాలార్పుకుంటూ... స్మశానంలో ఆరుతున్న చితులను తలపింపజేస్తున్నయ్. అలంకారాలూ పై మెరుగులూ తీసేసుకుని బోసిపోతున్న భోగం స్త్రీలా ఔతోంది నగరం. రోడ్లు దాదాపుగా నిర్జనమౌతున్నాయ్. వీధిదీపాల వెలుగుకి షాపుల దీపాలు గుడ్ బై చెప్పడంతో అవి వొంటరిగానూ దిగులుగానూ వెలగలేక వెలగలేక వెలుగుతున్నట్లూ దుఃఖిస్తున్నట్లూ ఎర్రగా ఉన్నాయ్.

"నాయనా! ఎన్టీవోడు శ్రీరామచంద్రుడు కాక శ్రీకృష్ణుడయ్యాడేం? "

"ఎవరయినా దేముడేగా? "

"అదేమన్నమాట? అలాగయినట్లయితే అందరు దేముళ్లెందుకూ ఉండడం? ఎన్టీవోడు మరేటయినా బాగుండిపోనుగాని శ్రీకృష్ణుడవడం నాకేమీ బాగునేదు"

"ఏమీ? ఎన్టీవోడు అందంగా లేడా? "

"అందం కాకేమీ? కాని... క్రిష్ణుడేషానికి నప్పదు"

"బిడ్డా!" త్రుళ్ళిపడ్డాడు తండ్రి. "నీకు తెలవదుగాని క్రిష్ణుడే ఎన్టీ... ఎన్టీయే క్రిష్ణుడు. అంటారందరూ, తెలుసా? ఊరందరిదీ ఓ దారీ ఉలిపికట్టె దొక్కర్తిదీ ఓదారీ ఔద్ది నువ్వుగాని ఎన్టీ కృష్ణుడు బాగులేదంటే"

"మనసులోని మాట చెప్పడమే తప్పా"

"మనసుకేనా మాటకేనా సబువుండాలి కద? " అతనేమో ఎన్టీఆర్ గాఢాభిమాని మరి.

"ఇనకనే సబువో కాదో సెబుతావా? "

"ఐతే సెప్పు"

"భీముడెలాగుంటాడు? బొమ్మలే అనుకో. నిజం భీముణ్ణి ఎవలమూ సూళ్లేదు"

"మాంచి దిట్టంగా బందోబస్తుగా ఉంటాడు"

"సన్నటోడు భీముడేషం కడితే? "

"అసయ్యంగుంటుంది"

"క్రిష్ణుడే తీరునుండె? "

"ఆడపిల్లమాదిరి... ఓ పాలి అరికదలో అలాగే సెప్పారు పురాణాలూ అవీ సదివి. పొదమాటున దాక్కుంటే కాపడేవాడు కాడట. ఆడపిల్లకంటే నేవళంగా ఉండి చక్కంగా చిందులేసేవాడంట"

"మరిహనేం? ఎన్టీవోడు భీముళ్ళాగున్నాడు. రాజులా ఉన్నాడు. కాని క్రిష్ణుళ్లా లేడు. అంత పొడవూ వొడ్డూ క్రిష్ణుడా! ఆ యేషానికీ విగ్రహంనప్పలా"

"ఏడిశావుగానీ నోర్ముయ్" అన్నాడు తండ్రి తన అభిమాన నటుడి గురించిన నిజం భరించలేక!

సింగడు అయ్యకోపానికి పకపకలాడాడు. మళ్ళీ కదిలారు.

"తడకలుమూసుకున్నారేం? "

"తడకలు కావవి. తలుపులు. మూసుకోపోతే సొమ్ములు దొంగ లెత్తుకుపోతారు"

"పట్నంలో దొంగలా! మన గూడెంలో గుడిసెలకీ పాకలకీ తలుపులుండవే!"

"గూడెంలో దొరికేవేటి? గోసిగుడ్డలు. గోసిగుడ్డలు దోచుకుపోడమొకటా? "

"అల్లదిగో చాయ్ బండి. తాగి... తొంగుందుకు జాగ జూసుకుని వొళ్లు జేరేద్దాం. ఈ రేతిరి నీకంతా జాగారమే. శానా సెప్పాలి"

"ఏటో? "

"బతుకు మాటలు"

"ఒక్క చాయ్ తాగిందనక నువ్వెంతసేపు రెప్పెయ్యొద్దన్నా సైయ్" హుషారుగా

అన్నాడు. ఇద్దరూ టీ తాగి... కొంత తిరిగి... ఒక దుకాణం మెట్లు ఆక్రమించు కొని, పండుకుని మంతనాలాడసాగారు. అక్కడ, వీధి దీపం వెలుగు పడకుండా చీక టిగానూ, మంచు పడుతూ చల్లగానూ ఉంది. కొండదొర- మొల్లోంచి రెండు బీడీలు తీసి సింగడి కొకటిచ్చి తానొకటం టించాడు.

"అయ్యా!" ఆశ్చర్యంగా చూశాడు వాడు తండ్రివేపు.

"ఇది పట్నం. నువ్వా పెద్దోడివయినట్లే లెక్క. అదీగాక బతుకు మాటలాడుకుంటూ బీడీగాల్చకపోతే ఎలా? "

"బతుకు మాటలా!"

"అవును" ఒక్క బీడీ దమ్ము లాగి "బిడ్డా! నువ్వు పుట్టినాక పద్దెనిమిది వర్షాలు గూడేన్ని తడిపెళ్ళినయి. అమ్మ పోయినా అడివమ్మ నిన్నిన్నాళ్లూ కంటగాసింది. ఆకలి దీర్చింది. ఆట, పాట నేరిపింది. కొమ్మలో కొమ్మ, రెమ్మలో రెమ్మ, ఆకులో ఆకు, పువ్వులో పువ్వు. అడవి నువ్వూ, నువ్వడవీ అయి విజ్యా నేర్చావు, వివేకమూ ఎరిగావు. ఏజన్మ జేసిన పుణ్యానో మోదకొండమ్మ చల్లని చూపుకీ కొండదేవర కరుణకీ పాత్ర మయ్యావు. శుభమస్తు. నీకు తెలవనిది కాదు నేను లింగాలగూడెం పెద్దనని. మన గూడేనికి పద్ధతుంది, హద్దుంది. ఎవరుబడితే వారు తురుతురు పట్నం పో వీల్లేదు. స్వాతంత్రం నేదు. ఆ స్వేచ్ఛ నీ వొక్కడికే. నువ్వు నా కూనవి కన్న. ఐతే- స్వేచ్ఛకే బాధ్యతుంటుంది. అదికారానికే ఆంక్షలుంటయ్. గూడేనికీ పట్నానికీ వొంతెన వెయవలసిన వంతు మనది. గూడెం పట్నంతో ఏం జెప్పాలన్నా నా గొంతులోంచే పలకాల. అట్టాగే అట్నించిటూను. అందుకే నేనెన్నో కార్యాల మీద గూడేనికీ పట్నానికీ మధ్య మగ్గంలో కండెలా తిరగతావుండేది"

"ఎందుకు? " అడిగాడు సింగడు బీడీ పారేస్తూ.

"అటు అడవి, యిటు పట్నం. ఒకట్లేనిదే మరొకటుండలేదని కాదు. నాగరికతా ఆట వికతా నేస్తంకడితే యిద్దరూ మరింత సుకంగ ఉండొచ్చు పట్నంనుంచి గూడేనికి ఉప్పు... అగ్గిపెట్టెలు, సిరసనూనె అలాటివి కావాల. గూడెంనుంచి పట్నానికి కరక, కుంకుడు, సింతపండు, అడవితేనె, తుమ్మ జిగురు, వనమూలికలు అలాటివి కావాలి. అవి మనకక్కర్లేనంత అదికం. తాగలేని పిల్లి వొలకబోసుకోనేలా? ఆకలీ అవస రమూ ఉన్న మరో జీవికందించొచ్చుగా? "

"ఔను. అది న్యాయం. అదే న్యాయం"

"సంపదంతా సర్వజనులకూ సమానంగా అందితే ఆ సౌబాగ్యం మరో తీరునుండేది"

ఆ ఉలుకూ పలుకు సింగడికి కొత్తగా కని పిస్తున్నయ్ అయ్యలో.

"సుకపడు. ఇంకా సుకపడు... ఆది మానవుడినుంచీ నేటి మానవుడి వరకూ జీవన సూత్రం యిదే. తప్పు లేదు. ఐతే ఆ సుకం అర్థం ఒక్కడిదనికాదు, అందరిదీ అని. ఒక్కడిదే అయితే స్వార్థమౌతుంది. ఆ స్వార్థమే మానవ సమాజానికి సమస్యలు తెచ్చింది. విద్య- మనిషి నొంటిపిల్లి రాకాసి నేసింది. ఎందులో కానీ, యితరులకంటే ఆదిక్యతే తపనయిపోయింది. విద్యా, శాస్త్రమూ మనిషినెంతఎత్తుకెగరేశాయో అంత అగాధంలోకీ తోసేస్తున్నాయి. సర్లే. సోదెందుకు... నగరమూ గూడెమూ సహ కరించుకుంటేనే సుకంగా గడుస్తుంది"

"అవ్. పది గడ్డిపోచలు పేనితేనే బలమ యిన వెంటి అయ్యేది"

"కలకండ పలుకే పలికావ్... సెబాస్... అలా తలిచే నేను పెద్దరికం వొప్పుగున్నాన

ప్పుడు. నువ్వు నా సంతానానివి. కావాలను కుంటే నా పెద్దరికానికీ వారసుడివవ్వొచ్చు నా బరువు బాధ్యతలకావిడి భుజాన కెత్తు కుంటే నాకు పొంగే. బలవంతమూ బందీ లేవుసుమా. ఓ సారి ఊ అన్నావో నీకర వయి వర్షాలూ నీ కూనకి పద్దెనిమిదీ ఏదో వొకటి రావాలి బరువు దించుకుందుకు. అంతవరకు ప్రాణముందో ప్రెజాసేవే. ఇదీ సంప్రదాయం. నీ యీడు పోరగాండ్లలో నీవే చురుకూ పరుగూనట. నీ అబీష్టాన్ని కాదనేమీ జరగద్సుమా"

"నేన్నీ బిడ్డని బాబూ! మాటకీ మనుష లకీ మనుగడంకితం జేసుకోడం మన వంశంలోనే, పుట్టుకలోనే, రక్తంలోనే ఉందయ్యా, అడివమ్మ ఆలన పాలనలో ఉందయ్యా. సందేహించకు బాబూ... బుడ్డో డినని బతుకుతెలీదనీ అనేసుకోకు"

"ఆలోచనెప్పటికీ అపకారి కాదు మనిసికి. నేస్తాలకూ అడివమ్మకీ అప్పుడప్పుడు దూర మౌతుండాలి. పట్నంలో నెగ్గుకురాడమంటే పాము పుట్టలమీద పరుగు"

ఆలోచించుకోమన్నట్లే అన్నాడు. ఒక క్షణ మాగి అన్నాడు సింగడు. "పెద్దోడినయ్యా నుగా. ఇంకా అమ్మ వొడి పట్టుకు వేలాడ తానంటే ఎలా కుదురుద్ది? అయినా అప్పుడూ అప్పుడూ అడివమ్మని చూసుకోరా దనే ఆంక్షేమీలేదు. సావాసగాళ్ళ సంగతీ అలాగే"

"కాని ఇందుకు యీ సేవకి నీకు ప్రతిఫ లమేమీ ఉండద్సుమా. నరజన్మమెత్తినం దుకు నలుగురికీ ఉపయోగపడుతున్నాననే తృప్తి. అంతే. నీ బతుకు నీ కష్టార్జితంమీద వెళ్ళదీయవలసిందే. నీ తిండీ వస్త్రమూ నీ చెమటతోనే సంపాదించుకోవలసిందే"

"నావాళ్ళకి నేను జేసుకునే సేవకు బదులు కోరే బంఛేత్ (నీచుడు) ఎందుకౌ తానయ్యా? నామీద నీకు నమ్మకంలేదా" సింగడి కళ్ళల్లో నీళ్ళూ, కంఠంలో గద్గది కతా.

"ఉంది చిన్నోరా... ఉంది. కాని నా ఆత్రమూ ఆరాటమూ నావి. పల్లెకు గూడెం ఆటవికత. పట్నానికి పల్లె ఆటవికత. నగ రానికి పట్నం అనాగరకత. మానవవికా సంలో యివన్నీ దశలూ స్థాయిలే. ఏదీ అల్పమూ కాదు, అధికమూ కాదు. నిద్దరొ స్తూందా? అద్దరేతిరి యీ మాటల దరువు వేటనిపిస్తూందా? "

"లేదయ్యా... లేదు. మాటకడ్డొస్తున్నానని మండి పడకుగానీ... సాయంత్రం జూశాను. దుక్కముక్కలాటి వాడు బండీలో కూర్చుంటే బక్కచిక్కిన వాడు రిచ్చా తొక్క డమేటీ? "

"అదే ధనలీల. ధనమే పట్నపులీల"

"కష్టపడితే కాసు సంపాదించొచ్చునన్నదీ నువ్వే. కనిపించేదేమో మరొకటీ. శ్రమకీ సిరికీ నిజంగా సంబంధమేమిటి, ఎంతవ రకు? "

"ఆ కిరికిరి మహామహులకే అర్థంకాదు. నువ్వూ నేనూ అనగా ఎంత? ఆc... ఇంతకీ నీకు పెద్దరికం... రాయబారి తనం... మనస్ఫూర్తిగా అంగీకారమేనా? ఇప్పుడే తేల్చీయక్కర్నేదు. ఇయాళ పంచమి. శుక్ల పంచమి. పది రోజుల్లో పూర్ణచంద్రుడు. ఆలోగా తేల్చుకో. నచ్చక పోతే నగరంనుంచి లగెత్తుకొచ్చెయ్"

"అలాగే. నువ్వెక్కడుంటావు? "

"ఇంకెక్కడ? అడవిలోనే. మనగూడెం లోనే"

"నేను పట్నంలో ఎలా బతికేదీ? " అడి గాడు సింగడు.

"అడవిలో పుట్టి అడవిలో పెరిగిన నీకు బతకడం ప్రత్యేకంగా నేర్పాలా? "

"మనిషి పక్షిలాగో జంతువులాగో ఔతే

మహబాగే. పుట్టిన నాల్రోజులకే అవి వేట విద్యకి సిద్ధమైపోతాయి. మనిషి నడకా పలుకూ రాడానికీ ఏళ్ళూ పూళ్లూ. ఎన్నేళ్లు గడిస్తే సొంత కాళ్లమీదకీ సొంత బతుక్కీ ఎదగగలడని? "

"నిజమే. జాగర్తగా చూస్తె అదే సత్యమేమో. చదువుకుంటున్న మనిషి మరోమనిషికి మరింత దూరమూ ఎడమూ ఐపోతున్నాడు. తన డబ్బుకి తానే బాంచేన్ దొర, నీ కాల్మొక్త ఔతున్నాడు. స్వార్థమూ వంచనా పెంచుకుంటున్నాడు. చిన్దొరా! సదువు నేక పోయినా సింత పడక్కర్నేదు. కొండ జల తాగిన నీనోరు సెలయేరంత తేట. అడవిలో తిరిగిన నువ్వు పువ్వంత స్వచ్ఛం. సహజమయిన గాలి పీల్చిన నీ గుండె అడవిగాలంత నిర్మలం. నా బతుకుకి నేను హస్తాలు చూశాను, నాడి జూశాను... మూలికావొయిద్యం చేశాను"

"నాకు శాస్త్రమేమొచ్చునని? "

"కావలసింది శాస్త్రంకంటే స్వచ్ఛతే. సంకల్పం సరళమై కళ్లు మూసుకుని కొండ దేవరకు చేతులూ, మనసూ జోడించావో కాగలకార్యం గంధర్వులే తీర్తురు. నీనోటి దేవుడే పలుకు. నీ చేత దేవరే నెరవేర్చె కాని.. పొరబాటున కూడా కల్లాకలతా నోరు జారనీకు. మాటా, మనసూ ఎన్నెల్లూ, ఎన్నలూ కురిపించాల. సాముద్రికం వెలుగువేపు అడుగువేయించే ఆత్మధైర్యానికి గాని అంధకారం వేపుతోసే అధైర్యం కోసం కాదు. అంతకీ కాకపోతే నీ కండలే అండ దండలు. కాయకష్టానికి కబళం కిట్టక పోదు. కండ కరిగితె తిండికలదోయ్!"

సంచిల్లాటి పెద్ద జోలెలు తలకింద భద్రంగా అమర్చుకుని రొంటినున్న డబ్బు చిక్కం (చిన్నగుడ్డసంచి) సరిజూసుకుని మేను వాల్చారిద్దరూ మెట్లమీదే.

"బస్సులు మసలవుగందా? కింద పడుకున్నమ్. బస్సులు మీదకి రావుగదా? "

"పాములకి పట్నంలో చల్లగాలి దొరికితే కదా? చిక్కం జాగర్త. పట్నమెత్తుకు పోద్ది. దేముడికి దణ్ణమెట్టుకుని... మరి మాటలు సాగదియ్యక కన్నుమూసుకో"

వాళ్లు నిద్రలో మునిగారు. తెల్లారకముందే సైరన్ మోతకి త్రుళ్లిపడి కళ్లు తెరిచారు. నిద్ర తీరకుండానే లేచారు. అది కూడా పక్షుల కూతలకు సున్నితంగాకాక ఒకేసారి చెవులు చిల్లులు పడేలాటి సైరన్ కేకతో! సింగడికిదేమీ నచ్చలేదు. పైగా అంతలోనే "లేలే.. ఫోఫో.. మా మెట్లే దొరికాయా నీకు కరాబు చెయ్యడానికి? " అంటూ ముఖంమీద చీపురుపెట్టి గద్దిస్తున్న కుర్రాడు.

వాడెందుకలా చెవికోసిన మేకలా అరుస్తాడు. పడుకుంటే ఏమయిపోయిందీ? మెట్టు అరిగిపోయిందా, విరిగిపోయిందా తరిగిపోయిందా? ఇంత యిరుకేమిటి! పట్నంవాళ్ల మనసులూ, మంచితనాలూ?

పక్కన అయ్యలేడు. జోలె మాత్రముంది. వారసత్వపు మూట! పట్టుకుని లేచాడు. నడవసాగాడు. ఎవరో ఎదురయితే, "దొర! జలం ఎక్కడ దొరికేనిక్కడ? " అని అడిగాడు.

వాడెందుకో నవ్వేస్తూ యాస తెచ్చిపెట్టుకుంటూ "జలము పంపుకాడ లభించును" అని చక్కాపోయాడు.

సింగడికి పంపంటే తెలియలేదు. తిరిగి తిరిగి వెదికి వెదికి ఒక చిన్న చెరువుని పట్టుకున్నాడు. అది నిజానికి దొరువు మాత్రమే. దానిలోనే కాలకృత్యాలు తీర్చుకుని నీటి అద్దంలో ప్రతిబింబం చూసుకుంటూ సిగముడీ, సిందూరబొట్టూ, నెలవంకా ముఖాన దిద్దుకుని తోవలో టీ తాగి బజారునపడ్డాడు. అయ్య వదిలిన వారసత్వపు మూటలో సింధూరం... సినిమా

నటులతో కోయల ఫొటోలు, వనమూలికలు, గోళ్లు, కొన్ని డబ్బులు ఉన్నాయి. భుజాన జోలెలాంటి సంచి తగిలించుకుని తిరగసాగాడు. సాయంత్రం వొచ్చేసిందికాని పైసాయేనా సంపాదన రాలేదు. దుప్పి భోజనం తప్పదనుకుంటూ బస్‌స్టాండ్ ప్రాంతంలోకొచ్చాడు. అక్కడెవరో

"మూటలు మోస్తావా?" అని అడిగారు. సింగడికి చిన్నప్పటి ఆటలోని మాట 'నూక లిస్తాను మేకల్నికాస్తావా?' గుర్తుకొచ్చింది. "జీ" అన్నాడు. బస్తాలను భీముడిలా అవలీలగా ఎత్తిపారేశాడు. ఆ ఆసామీ నోట్లివ్వబోతే, "ఉంటే బిళ్లలివ్వస్వామీ" అని అడిగాడు. కాగితమ్ముక్కలకంటే బిళ్లలే కొంత నమ్మదగినట్లు కనిపిస్తాయి. వాడు వాటిని లెక్కపెట్టుకుంటూంటే డేగల్లా వొచ్చిపడ్డారు ముగ్గురు.

"ఎవడ్రానువ్వు? ఎంత ధైర్యంరా! మా ఏరియాలో బిజినెస్ స్మగ్లింగట్రా. మన్తోపెట్టుకున్నావంటే మరి శాల్తీ మిగల్దు. పుచ్చె ఎగిరిపోద్ది" అంటూ ఆ డబ్బుల్లాగేసుకున్నారు. చేసిన తప్పేమిటో అర్థంకాలేదు. కష్టపడ్డాడు, కాసులు తీసుకున్నాడు. ఈళ్లేటిలా అరుస్తారు? దుబ్బుజుత్తులూ.... చెంపల్నిండిన ముఖాలూ.. ఆ చదరం మీసాలూ అడవి జంతువులకంటే భయంకరంగా.. ఎలుగుబంటికంటే అసహ్యంగా ఉన్నారు. అయ్యసెప్పిన రౌడీలు ఈళ్లే కాబోలు. వాళ్లుముగ్గురూ తనొకడూ అని కాదుకానీ విషయమర్థంకాకుండా పట్లుపట్టి కుంయిక్కుమనిపించడానికి తనకి చేతు ల్రావు.

"తప్పని తెలవదు. ఆకలికి తాళలేక.. పన్దొరికిందేచాలని" విన్నవించుకున్నాడు.

"మరికాని మా ఏరియాలో కనిపించావో మటాషైపోతావ్" ముగ్గురూ టెంకి జెల్లలిచ్చి మరీపోయారు. పోతూపోతూ "కొండోడివి.. సాముద్రికం చెప్పుకో, మూలికల మ్ముకో, కూలికెగబడకు" అని ఉపదేశం కూడా చేశారు.

అడవి ఎవరి సొంతమూకాదు. అందరిదీని. ఎవరేపనయినా చేసుకోవచ్చును కష్టపడి. వీళ్లేమో కష్టపడడమే తప్పని దండించారు. పట్నం అడవికంటే గొప్పంటారే, నాగరకతంటారే... ఇక్కడి పద్ధతులిలా అద్వాన్నంగా ఏడుస్తున్నాయేమిటీ? కడుపులో కామన్న మరీ యిదిగా గంతులేస్తుంటే తప్పనిసరయి వారసత్వంలోంచి డబ్బుల్దీసి బన్నూ టీలతో కడుపు నింపుకున్నాడు. మర్నాడు కార్యక్రమం మార్చాడు.

శివుని జటాజూటంలా సిగముడి. నొసట నెలవంకలో సింధూరంబొట్టు, చెవులకు వేర్లతో కర్ణాభరణాలు, చేత గొడుగు, భుజాన జోలె, దండలకు వనమూలికల కడియాలు.

"కొండదేవర పలుకు కొండమ్మ దీవెన... జాతకాలు చెబుతాం, ప్రశ్నలు చెబుతాం..." అంటూ బజార్లు వదిలి నివాసగృహాలున్న వీధులలో పడ్డాడు. వాడి పంటపండడం మొదలెట్టింది.

"లాటరీ యోగముందా?" అని ఒకరడిగారు చేయిచూపుతూ!

సింగడికి లాటరీ అంటే తెలియదు. అయినా సమయస్ఫూర్తి వాడిని కాపాడింది. "లచ్చి కుప్పలు తెప్పలుగ కురుస్తద్దొర! కొండదేవర కరుణ" అనేశాడు.

"ప్రమోషనొస్తుందా?"

ప్రమోషనంటే తెలియదు. అయినా "ఆరు నెలల్లో అదృష్టం జెర్రిగొడ్డులా పరుగెడుతుంది" అన్నాడు.

"మా ఆయన మరోసెటప్... చిన్నిల్లు పెట్టుకున్నాడు. వారూ వారి మనసూ నాదయ్యే మంత్రం చెప్పావో డబ్బు... వస్త్రం... బియ్యం" ఆశ పెట్టిందో ఇల్లాలు.

"వారంపాటు సాయంత్రం తలంటి శ్రీమహాలక్ష్మిలా తయారయి ఈ కుంకుమెట్టు. ఆదివారం అభ్యంగనస్నానం విసర్జించు. మగాడి ముందు మాట మృదువు చెయ్యి, రూపం ఘనం చెయ్యి. రతిమన్మథ రసికే మంత్రం జపించు. మాసంపోయాక నీ వాడు వొళ్లోవాలుతాడు" అని ఓదార్చేడు.

ఏభై దాటినాయనొకరు పిలిచాడు. "మగతనం పెంచేమూలికలున్నయ్యా? " అనడిగాడు మెల్లగా. సింగడికి సిగ్గేసింది అతన్ని చూసి. మగపోడిమి మనిషి వయసుబట్టి, శరీరతత్వంబట్టి, ఆరోగ్యంబట్టీ ఉంటుంది. వయసుమీరిన వేళ వక్రమార్గంలో దానిని రెచ్చగొడితే ఆరోగ్యమూ, ఆయుర్దాయమూ దెబ్బతింటాయిగదా!

"కుర్రాడివి, నీకు నా సమస్యలు తెలియవులే. పోనీ ఓ పన్జేస్తావా? కావలసినంత డబ్బిస్తాను..." మెల్లగా అడిగాడు.

ఏమిటన్నట్లు చక్రాల్లాటి కళ్లెత్తిచూశాడు సింగడు.

"సింగందొరా! అడవికి పోతావుకదా? ఓ ఎలుగుబంటిని చంపు"

"చంపి? "

"దాని పురుషావయవం పట్టుకురా. అది సన్నని ఎముకలా ఉంటుంది. కొమ్ములాగ"

"ఎందుకదీ? ఏం చేస్తారూ? "

"ఆ కొమ్ముని అరగదీసి ఆ గంధం తేనెతో సేవించామో శక్తీ ఉత్సాహమూ అబ్బుతాయి"

"నిజమా!"

"కాక! ఇదిగో ఈ వందా అడ్వాన్సుగా ఉంచు. నీ మీద నాకు నమ్మకమే. కొండదొరలు మాట తిరగరు. తొందర్లో పట్రా... నా అడ్రసిదిగో..."

సింగడికి ఆశ్చర్యమూ వేసింది, జాలీవేసింది, నవ్వూ వచ్చింది.

అడవి గురించీ జంతువుల గురించీ పట్నవాసులకెన్ని అపోహలు! అయ్య అనేవాడు, పైదేశాలవారు భారతదేశంలో రోడ్లమీద పులులూ రుషులూ తిరుగుతుంటారు అనుకుంటారు ఇప్పటికీ! ఈ మనుషులు డబ్బు పులులూ, సుఖం పులులూను. రుషులు మాత్రం ఎక్కడా కనిపించరు.

"అలాగే అంతవరకు మనసుపడీ, మమత పడీ, భ్రమత చెందీ పెద్ద వారడుగుతున్నారని కొండదేవర కరుణిస్తున్నాడు. ఈ మూలికని పాలతో అరగదీసి... వెచ్చని పాలూ, పచ్చకర్పూరమూ, జాజికాయ, కుంకుం పువ్వూ కలిపి పడకచేసేముందు పానం చెయ్. స్త్రీని కనులతోనేకాక మనసుతోనూ చూడు. అప్పుడు కమ్మని సుఖమందుతుంది"

అయ్య చెప్పిన మాట, "ఏదీ లేదనకు కాదనకు నిజంగా పనిచేసేది నీ మూలికలూకావు, జోస్యమూకాదు. వాళ్ల నమ్మకం అంతే... వాళ్లకి కొండదేవర పేరున, మోదకొండమ్మ పసుపున విశ్వాసమివ్వు. మిగిలినదదే చూసుకుంటుంది. పలికించేదీ పనిచేయించేదీ పరమాత్ముడు కొండదేవరే"

"పులిగోరుందా? "

"ఉబ్బసానికి పులిగుండె మందట"

"పక్షవాతానికీ, కీళ్లనొప్పులకీ పులికొవ్వు..."

"అజీర్ణానికి అరటి దుంపరసం"

ఇలా అడిగేవారందరితో తెలివిగా వ్యవహరించటంతో డబ్బులు బాగానే కిట్టాయి.

ఆ రాత్రి కాస్త ఖరీదయిన హోటల్లో వరన్నం తిన్నాడు. జొన్న, సజ్జ, దుంప, రాటిపిండిల జావా, తోపా, అంబలీ మాత్రమే ఎరిగిన సింగడికి వరన్నపు రుచి అమోఘంగానే అనిపించిందికానీ అది కొలత ప్రకారం పెట్టటమే అసహ్యమనిపిం



ంది. ఆకలికీ అన్నానికీ కొలతేమిటో? దాహానికి కూడా డబ్బు చెల్లించే మాటయితే ఇహ పట్నంలో ఎంత డబ్బూ చాల్దు. సినీ మాలు భలే బాగున్నయ్‌గానీ రౌడీలు మాత్రం ఏం బాలేరు.

మర్నాడు మధ్యాహ్నం రోడ్డుపక్క చెయ్యి చూస్తుంటే పోలీసొచ్చి వెనకనుంచీ లాటీ టకటకలాడించాడు. స్టేషనుకు పదమ న్నాడు. బొక్కలో దోస్తనన్నాడు.

"కొండోడిని.. బతుకు తెరువుకోసం చెయ్యిజూస్తున్నానే తప్ప చెడ్డపనేమీ చెయ్య డంలేదుకదా? " అని బతిమాలాడు.

నేరమేమిటో చెప్పడు, ఒకటే పాట... స్టేషనుకి పద, బొక్కలో దోస్తా అంటూ. తను ఆనాడు సంపాదించిందాంట్లో సగంపైనే ఒడికేసి "రోడ్డుపక్క ఒంటేలుకి కూచున్నా ఒల్లరాని నేరమే" అనేసి చక్కాపో యాడు.

తను బిక్క చచ్చిపోయాడు. ఏమిటీ పట్నం? మనిషి తనూపిరి తాను పీల్చుకుం దుకు లేదు. తన దాహం తీర్చుకోలేడు. సముద్రంలో మంచి తీర్థానికిలా యింత విశాలమయిన పట్నంలోనూ ఓ మనిషికి జాగా ఉండదు. ఎవరి ఏపనయినా డబ్బు కోసమే! అదేమిటో డబ్బే వీళ్ల ప్రాణమూ ప్రాణవాయువూలా ఉంది. ఏం పట్నమో, ఏం పద్ధతులో! అయ్యా నాలుగూళ్లూ తిరిగి నాలుగు రకాల మాటలూ తాను నేర్చి తనకి నేర్పడంతో సరిపోయిందికానీ లేకపోతే వీళ్ల భాష తనకీ తన బాష వీళ్లకీ కూడా ఓ సమస్యే. "సాముద్రికం చెబుతా ప్రశ్న చెబుతా" అని వీధుల్లో తిరుగుతూంటే "కొండదేవర ఆశ, మోదకొండమ్మ మాట" అంటూ అరుస్తూ నడుస్తుంటే ఓ స్త్రీ లోప లికి పిలిచింది. వీధిలోకి ఇల్లేమో సరాసరి ద్వారంలోంచి గదిలోకే! లోనకడుగు పెట్టడ



మేమిటి గడియవేసి అతన్ని వాటేసుకుంది. తెల్లబోయాడు, గింజుకున్నాడు. ఆమె కౌగిలి తన చుట్టూ ముళ్ల తీగెలాగ అల్లుకుం టూంటే కొండమ్మ గుర్తొచ్చి నిరోధించాడు.

"మొగాడివి కాదూ; మొనగాడిని కావూ?" అంటూ కవ్వింపు "మనిషివి కావూ? " అనీ అనేసింది.

"మనిషిని కనకే మనసుంది. అది మీట నొక్కితే దీపం వెలుగురికినట్లు ఏ ఆడదాని మీద పడితే దానిమీద వాలిపోదు. నీ కవ్వింపులు నన్ను కోతిని చేసి ఆడించలేవు. అయినా పందొమ్మిదేళ్లవాడిని నేను. పాతిక పైబడిన దానవు నీవు. ప్రేమతో తమ్ముడూ అని అక్కలా పిలవాలిగాని పక్కలోకి రమ్మంటావేం? ఉచితానుచితాల్లేవూ? "

మొలచిక్కంలోంచి డబ్బులు లాగేసిం దామె అప్పటికే. "పో అయితే పో" అంది.

"నా డబ్బు..." గట్టిగా అరిచాడు. అంత లోనే ఇద్దరు గూండాల్లాటివాళ్లు వచ్చేశారు. చెయ్యెత్తారు. "మర్యాదగాపో. లేకపోతే..."

"పోలీసుని పిలువ్" ఆ స్త్రీ సలహా. "బొక్కలో తోస్తారు"

ఇవతలికొచ్చేశాడు గోచీ పెట్టుకునీ, జోలె అందుకునీ. ఇవాల్టినుంచీ ఎలాగైనా పంచె కట్టాలి. పట్నంలో మగాడి శీలానికీ క్షణక్షణ గండమే. నయమే. డబ్బుతో పోయింది పీడ. పూటబత్తెం పుల్ల వెలుగులాటి తన బతుకునీ దోచుకుంది బోగంది. పవిత్ర సంపాదన కాస్తా పతితపాలయింది పట్టప గలే! తన గొడుగు లాక్కోలేదు, నయం.

రాత్రి- తిండిలేదు. టీ లేదు. సినిమా లేదు. బస్టాండులో బబ్బోబోతే ఎర్రబుట్ట లాటీతో తరిమాడు. రైలు ప్లాట్‌ఫారంమీద ఆర్పీయఫ్ వాళ్లట. పాడుపడ్డ సత్రంలోకి వాళ్లూ చేరనిచ్చారు కాదు జాగా లేదని. పేవ్‌మెంట్ పడక అయింది. పట్నమెంత పాషాణం. కడుపుకి తిండిలేదన్న చింత లేదు, కాని కంటికి సినిమా లేకపోయిందే

అని కలత. నిదురరాదు. పట్నంలో మనిషి మేలుకున్నంతసేపు ధనపు కాట్లూ, కన్ను మూస్తే దోమకాట్లూ! రెండూ దుర్భరమే. కంటికెదురుగా, చేతికందేస్తున్నట్లుగా తీపిమిఠాయిల ఉండల కొండలు. కాని ఆ చిటారు కొమ్మన మిఠాయి పొట్లం వొంచాలంటే చేతికి డబ్బుండాలి. అన్నాన్నీ, నీళ్లనీ, ఆడదాని మానాన్నీ కూడా డబ్బుకమ్ముకునే సిగ్గూ, శరమూ లేని నగరం! దీనికోసమా తను ఉవ్విళ్లూరాడు. ఉబలాటపడిపోయాడు. వీళ్లు డబ్బు చేసిన కోతులు. ధనపు చెదలు మనసుని తినేసిన కుష్టువాళ్లు. మతీ మానవత్వమూ చెడినవాళ్లు. అటవీన్యాయంకంటె నగర న్యాయం మరీ ఘోరం. అడవిలో బలమున్న జంతువుదే రాజ్యమయినా... అది శారీరకబలం కనుక గోచరిస్తూ ఎదుటివారికి హెచ్చరికగా ఉంటుంది. నగరంలో ఆర్థికబలం పైకి కనిపించదు. దొంగదెబ్బ తీస్తుంది. అడవిలో ఆకలి తీర్చుకుందుకే చంపుతాయి జంతువులు. నగరంలో మనిషి మనిషిని నిరంతరమూ వేటాడుతూనే ఉంటాడు రహస్యంగా. ఛీ! ఏం పట్నమిది.

సింగడు నిద్రరాక... మేలుకుని కూర్చుని... చూస్తూంటే- రోడ్డుమీద ఎవరో తాగుబోతు. "పేక నా పెళ్లాం. ఒక్కో పేకముక్కా ఒక్కో ప్రేయసీ. అహ్హహ్హా..." నవ్వుతూ జేబులోంచి నోట్ల కట్టలు తీసి పేకదస్తాల్లా కలుపుతున్నాడు. ఇంతలో వెనుకనుంచి మోటార్‌సైకిల్‌మీద ఎవరో వచ్చి ఆ నోట్లకట్టలు లాక్కుని వాడి నెత్తిమీద దేనితోనో మోది తుర్రుమన్నారు. వాడు. "అమ్మా!" అని ఓ ఆర్తనాదం చేసి కుప్పకూలాడు. ఆ తాగుబోతుని కాపాడాలని అటు ఉరికాడు సింగడు. పోయే ప్రాణాన్ని పట్టుకోవాలన్నట్లే వాడి తలని ఒడిలోకి తీసుకుని చూసేంతలోనే-

పోలీస్ విజిల్. అయినా సింగడు కదలలేదు. పోలీసొచ్చేసి... "ఎందుకు చంపావ్? డబ్బు కోసమేనా? పద స్టేషనుకి. బొక్కలో తోస్తా" అనేసరికి సింగడు హడిలిపోయాడు. ఎర్రబుట్ట... కుళ్లపాము కోర, పాపపునీడ. తప్పొప్పులు చూడకనే దండించే రాక్షసత్వం. చటుక్కున పోలీస్‌ని తప్పించుకుని పరుగెత్తసాగాడు. వెనుక పోలీసు ఊళ. ముందు సింగడు పరుగెడుతూ. దొరికితే జైలే. చిక్కితే శిక్షే. తను నేరం చేయకపోయినా.

పట్టుదలగా ప్రాణాలకు తెగించి... పరుగు పరుగు. ఎంతసేపో ఎంత దూరమో. ఎటువేపో. విజిలు వినిపించడం మానేసింది. ఆకాశంలో చందమామ. వాడి ముందు కాలువ. దిగి- నాలుగు గుక్కలు నీళ్లు తాగి ముఖం తుడుచుకుని కూర్చున్నాడు. నీళ్లు, రుచి, శక్తి. చందమామ... వెన్నెల... హామీ... గాలి... భరోసా; నిశ్శబ్దం నిబ్బరం. దూరంగా దీపాలు. నగరానికి దణ్ణం పెట్టేశాడు.

సినిమా. చాయ్... సిటి- సినేమా, చాయిా. అదెంతో నచ్చాయి. కానీ, ఆ మనుషులే. వారి ప్రవర్తనే ధారుణం. వాళ్లు తనని బతకనివ్వలేదు. కుడిఎడమల దగా చేశారు. దొంగ, వ్యభిచారి, హంతకుడు, అన్నీ చేయాలనుకున్నారు పోలీసులు తనని. వొద్దు. పట్నం వొద్దు. పతనం వొద్దు.

చందమామ నిండుగుండ్రానికి, పున్నమికి గడువుంది. తను నిర్ణయించుకుందుకూ వ్యవధుంది. తను తను... తను... నిర్ణయాన్ని కాదు. నిర్ణయమే తనను తీసుకుంది. తను అడవికి పోతాడు. అమ్మ దగ్గరకి పోతాడు. హాయి దగ్గరకు పోతాడు. అంతే!

అతను అడవివేపు దూసుకుపోయాడు ఆరాటంగా. ఆ చీకట్లో పోనీ వెన్నెలలోనే

ఎక్కడో ఉన్న అడవి ఎలా కనిపిస్తుందని?

తెల్లవారేవరకూ ఎలా గడిపాడో అతనికే తెలియదు. తూరుపు కొంచెం విచ్చుకోనారంభించింది. అతను నడవసాగాడు. టౌనులో కెళ్ళి బస్సెక్కుదామంటే భయం. పోలీసెక్కడ పట్టుకుంటాడో అని. చాలా దూరం నడిచి గ్రామం చేరుకున్నాక అప్పుడు ధైర్యంచేసి బస్సెక్కాడు.

అతనికి పట్నమంటే మొహం మొత్తేసింది. పట్నంమీద స్పష్టమయిన అభిప్రాయమూ ఏర్పడిపోయింది. పట్నం మంచిదే. కాని పట్నంలోని మనుషులూ, పరిస్థితులూ మంచివి కావు. అవి తనలాటి వారిని నిలవనివ్వవు. ఏవీటివారా వీడునే ఉండడమూ, ఏ గూటి చిలుక ఆ గూటి పలుకునే పలకడమూ. అదే మంచిదేమో. అదే సుఖమేమో. నెలవు తప్పితే విలువ మిగలదు. అందుకే పిల్లికి రొయ్యల మొలతాడూ పిశాచానికి పువ్వులదండా అనే సామెత. పూలదండ పిశాచం చేతిలో పడితే ఏమౌతుంది? పిశాచం, సున్నితమూ, సుకుమారమూ, సౌందర్యమూ ఎరుగదు కనుక పూలరేకులని చిదిపి పోగులు పెడుతుంది.

మళ్ళీ తన అడవిలోకీ, గూడెంలోకీ అడుగు పెట్టేసరికి సింగడికి ప్రాణం లేచి వచ్చినట్లయింది. తన వూరు తనవారు... తన బాష... తన యాస... పదిరోజులకే ఎంత వాచిపోయాడు. ఒక్కసారి నేస్తాలను కలుసుకుని వారితో అడివంతా తిరిగేసి వారికి తన పట్నం కబుర్లు చెప్పేసుకున్నాక ఇంకెప్పుడూ ఈ అడివినీ, ప్రాణమిత్రులనీ వొదిలివెళ్లనని మనసులో ఒట్టేసుకున్నాక మళ్ళీ మునుపటి సింగడయ్యాడు. పట్నమనేది పల్లెటూరి వారికి అప్పుడప్పుడు పనుల మీద వెళ్లి ఒకట్రెండురోజులుండదగినదే తప్ప శాశ్వతంగా నివసించదగినది కాదనుకున్నాడు.

"నేనే ఆ సింగడిని. నావే ఆ అనుభవాలు. నేను యౌవనంలో అడుగు పెట్టేముందరివవి.

నాదే ఆ కథా... అభిప్రాయాలూ. ఇప్పటికీ నా ఉద్దేశాలు మారలేదు సరికదా మరింత గట్టిపడ్డాయి అడపాదడపా పట్నమెళ్లి చూసివొస్తూండడంతో. పట్నం సినిమాలూ... టీలూ ఒకట్రెండు రోజులే బాగుండేవి. నన్నడిగితే గూడెమొదులుకుని పట్నం మకాం మార్చడం... గంధం చెట్టు వొదిలి గత్తరలో పడడమే అంటాను" అని పక్కకి తొలిగాడు సింగడు. చెప్పదలచుకున్నది అయిపోయినట్లు.



కిల్లోడు భార్య కామమ్మకి వాళ్లత్త జుత్తుకి డోలపిక్కలనూనె అంటి తలదువ్వుతోంది గుడిసెముందు కూర్చుని. అర్జున భార్య బిమ్మలమ్మ గుడిసెలో జొన్ననూక ఉడికించి "అత్తా! తాలింపు ఆమదం నూనెతో పెట్టేదా? అవిసె నూనెతో పెట్టేదా? " అని అరుస్తోంది.

మహారాజూ ఇద్దరు కొడుకులూ గుడిసె ముందే గోనెపట్టా పరచుకుని కూర్చున్నారు. వాళ్లేదో పెద్ద విషయమే ఆలోచన చేస్తున్నట్లున్నారు. ఇప్పుడా గూడేల ప్రజలందరికీ ఒకటే చర్చనీయాంశం. కొండమీదుండడమా, టౌన్లకి దిగిపోవడమా? అది వాళ్లకి చావు బ్రతుకుల సమస్యే! ప్రతి గూడెంలోనూ యువత, మగా, ఆడా కూడా పట్నం వేపు మొగ్గుతున్నారు. వయసు పెరిగిన వారు మాత్రం ఉన్నచోటే ఉందామంటున్నారు. గూడెం గూడెంలోనూ సావడి సభలు జరుగుతూనే ఉన్నాయి. అటు కొందరూ ఇటు కొందరూ మాట్లాడుతూనే ఉన్నారు చివరికెటు తేలుతుందో ఎవరూ ఊహించలేకపోతున్నారు.

దబుకు దబుకుమంటూ హఠాత్తుగా టముకు.

"ఏదీ కానివేళ ఎద్దీనిందని ఇప్పుడు దేనికి సాటింపు?" విసుక్కున్నాడు మహారాజు. బారికవాళ్ల గుడిసె దగ్గరలోనే నిలబడి గొంతెత్తి బిగ్గరగా చెప్పాడు సాటింపు సంగతి.

"సావడిలో సభుంది. అందరూ రావాలి సమయం లేదు"

అందరూ ఏమయిందో అని చావడికి లగెత్తారున్నవారున్నట్లుగానే. అక్కడ- అన్న లున్నారు! ఆ అన్నలు పెద్దలతో మాట్లాడు తున్నారు. "మీటింగన్నమాట" అనుకు న్నాడు మహారాజు.

"ఏమిటి మీరు సభలు పెడుతున్నారట?" అడిగాడో అన్న పూజారిని.

"అన్నలు కారీళ్లు, దున్నలు." విసుక్కు న్నాడు మహారాజు మనసులోనే.

"ఆమజ్జ గవరిమెంటోళ్లొచ్చి... గూడేలు కాళీచేసి పొండి. అదిస్తాం. ఇది చేస్తాం అంటూ చెప్పారు. దానిమీద నలుగురభిప్రా యమూ ఏటో తెలుసుకుందామని..."

"ఆళ్లెవరు మిమ్మల్ని పొమ్మనడానికి? గవ ర్నమెంటంటే మేము. మరెవళ్లూ కాదు. ఇక్కడ ప్రభుత్వం మేము" అన్నాడో అన్న.

పూజారి కాని, భీమన్నకాని ఏమీ అనలేక పోయారు. వాళ్లు అన్నలు, వాళ్ల దగ్గర తుపాకులున్నాయి. వీళ్లు తమ మాటేకాని ఎదుటివాళ్ల మాటే వినిపించుకోరు.

"సరే! ఎలాగుంది ప్రజాభిప్రాయం? ఏమంటారు గిరిజనులు?"

"ఇంకా ఎటూ తేలలేదు. ఇటూ ఊగుతు న్నారటూ ఊగుతున్నారు" అన్నాడు బీమన్న.

ఒక్కసారి ఓ అన్న కోపంగా లేచి నిలబ డ్డాడు, ఏదో చెప్పదలుచుకున్నట్లు. "చూడండి, మీరు గిరిజనులు. మీరిక్కడే కొండలమీదే, అడవుల్లోనే ఉండండి. ప్రభుత్వం వొట్టి తెలివితక్కువది. పదవులే ముఖ్యం కాని ప్రజలు కాదు. అది తల పెట్టిన పనులకర్థమూ పర్థమూ ఉండదు. కొండలమీదివారిని ప్లేన్స్‌లోకి తరలించడం ఎంత అజ్ఞానమో చూద్దాం. అసలే దేశమే విపరీతంగా పెరిగిపోతున్న జనాభాతో యిరుకయిపోతోంది. మీరు కూడా వాళ్ళ పీకలమీదకి తయారయితే దిగువ మీకు జాగా ఉండొద్దూ? అది మొదటిది. ఇప్ప టికే ప్రతి నగరానికీ మురికి వాడలు పెరిగి తలనొప్పుయి కూర్చున్నాయి. కాంక్రీట్ పైపు లలో కూడా కాపరాలుంటున్నారు కష్టజీ వులు. చిన్న పట్నాల పరిస్థితీ ఏమీ మెరు గ్గాలేదు. మంచినీటికీ మంచి గాలికీ కూడా కరువు పట్టిపోతున్నారు జనాలు. మీరు కూడా అక్కడికే వెళ్తే యింకెంత దారుణంగా ఉంటుందో ఆలోచించండి.

రెండవది ఇప్పటికే కంప్యూటర్ల ప్రవేశం, ప్రైవేటీకరణలతో ఉద్యోగాలు తగ్గిపో యాయి. దాంతో విద్యావంతులయిన నిరు ద్యోగులు కూడా రిక్షాలాగడానికీ, బూట్ పాలిష్‌కీ, కాఫీ హోటల్ క్లీనర్‌గా, బెల్ బాయ్‌గా, బార్ అటెండర్‌గా ఉద్యోగాలకు దిగజారుతూ చదువుకోని నిరుద్యోగుల పీక లమీదకి పోటీ ఔతున్నారు. నోటికి తిండి లేక పోవడంకంటే కూడా ఎక్కువ ప్రమాద కరం చేతులకు పనిలేకపోవడం. మరి మీరేం చేస్తారు కొండదిగి వెళ్ళి?

మూడవది... మీ తిండి, ఆచారాలు... అలవాట్లు అన్నీ అక్కడ మార్చుకోవాల్సిందే! ఇదేమీ సులభంకాదు. నాలుగోదీ అసలయి నదీ ప్రభుత్వపు ఆలోచన మౌలికంగానే లోపభూయిష్టమైనది. జాతీయ జీవన స్రవంతిలో మిమ్మల్ని కలుపుతామనడం- అర్థరహితమైన అందమైన వంచనా సమాసం. అంతే! కాశ్మీరంనుంచీ కన్యాకు



మారి వరకూ అంతా భారతజాతే. కొండలూ భారతదేశంలో భాగమే. గిరిజనులూ భారతజాతే. వీరిని మళ్ళీ జాతీయ స్రవంతిలో కలపడమేమిటి, అర్థంలేని మాట కాకపోతే? కొండలమీంచి మనుషులని కిందకి తరిమెయ్యడమా జాతీయ జీవన స్రవంతిలో కలపడమంటే? ఆడలేక మద్దెల ఓటిదంటే యిదే! లోపం... ప్రజలు కొండలమీద ఉండడంలోలేదు. ప్రభుత్వం, పాలకులు పట్టించుకోకపోడంలోనే ఉంది! మాటవరసకు గిరిజన గూడెంకంటే, ప్లెయిన్‌లో ఉన్న పల్లెలే ఎక్కువనుకుందాం. ఈ ప్రజలనక్కడికి బదిలీ చేయించినంతమాత్రాన ఏమౌతుంది! వీళ్లకి కొత్త విద్యలు రావాలి గదా! అక్కడి బతుకుతెరువుల కలవాటు పడిపోవాలి గదా! పల్లెకంటే పట్నం, దానికంటే నగరం... అంతకంటే మహానగరం. బొంబాయి జీవితానికీ బరంపురం బతుక్కి భేదముంది. ఉండి తీరుతుంది. అలాగని బరంపురం వాసులని బొంబాయికి బదిలీచేసేస్తారా? దానివల్ల వీరి బతుకులు బొంబాయి స్థాయికి చేరుకుంటాయా? కనుక యిలా గిరిజనులను మైదాన ప్రాంతాలకు బదలాయించడమనేది తీపిపూత తప్ప సమస్యకి పరిష్కారం కాదు. గిరిజనులు తొలినుండి ఉన్న కొండలమీదే సుఖంగా బ్రతికేలా వారికి సౌకర్యాలు చేయడమే అసలు పరిష్కారం. నిజానికి పాలకులకు మీమీదేమీ ప్రేముండి కాదిది తలపెట్టినది. ప్రభుత్వం ఏదయినా ధనవంతుల పక్షమే! వారికోసమే అది పని చేసేదీను! అంతే తప్ప బడుగు జీవులకై కాదు. విదేశాలనుంచి అప్పులు తెచ్చి ఏంచేసింది? కలర్ ట్యూబ్‌లూ... ఎయిర్ కండిషన్‌డ్ కార్లూలాటివి దిగుమతి చేసుకుని కలవారి సౌఖ్యాలు పెంచిందే తప్ప పదిమందికి ఉద్యోగాలూ పనులూ లభించే పరిశ్రమలను స్థాపించిందా! లేదు. ఎమ్మెల్యేల కొడుకులూ మంత్రులకొడుకులూ పట్టపగలు నడిరోడ్డులో మర్యాదస్తురాలయిన మహిళను మానభంగంచేసినా ప్రభుత్వమూ న్యాయస్థానాలూ ఆ దోషికే కాపుకాస్తాయి కాని ఆ స్త్రీకి న్యాయం చెయ్యవు. ఈ దేశంలో సౌఖ్యాలూ న్యాయమూ అన్నీ ధనవంతులవే. దీనిమీదే మా తిరుగుబాటు సోదరులారా! ఇది మీ జన్మభూమి. ఈ అడవులను కాపాడుతున్నది మీరు. పెంచుతున్నది మీరు. వీటిమీద హక్కు మీదీ. మిమ్మల్నిక్కడినుంచి పొమ్మనే హక్కెవరికీలేదు. ప్రభుత్వానిది కాకులను కొట్టి గెద్దలకేద్దామనే ఉద్దేశం. బడా పారిశ్రామికవేత్తల కోసం... వాళ్ళ ప్రాజక్టులకోసం మిమ్మల్నిక్కడినుంచి తరిమేయాలని ప్రభుత్వం కుట్ర. దీనికి మీరు లొంగొద్దు, మోసపోవద్దు. వారి ప్రలోభాలకి ఆశపడి నాశనం కావొద్దు. మరొక మాట. ఈ అభిప్రాయసేకరణలూ అవీ అనవసరం. ఎవరి అభిప్రాయమేదయినా సరే మీరిక్కడినుంచి వెళ్ళవద్దు. అది ఆత్మహత్యే కనుక ఇక్కడే ఉండండి"

అలా ఆ అన్న చెప్పేదేదో కరాఖండిగా చెప్పాడు. దానితో పరిస్థితి అందరికీ స్పష్టమైపోయింది. ఈ అన్నలు తమ ఉనికిని శాసిస్తున్నారు. ఇక్కడుండడానికికాని పోడానికికాని తమ యిష్టమేమీలేదు! టౌన్లులోకి వెళ్ళిపోవాలని కోరుకుంటున్న యువకులకిది మరీ కోపం తెప్పించింది. తమమీద అధికారం చెలాయించేందుకీ అన్నలెవరని పళ్ళు పటపటలాడించారు తమలోతామే. కాని, అన్నలు కబడ్దార్ చెప్పినట్లే చెప్పి వాళ్ళదారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

గిరిజనుల్లో కొందరికి అన్నలమీద విసుగేస్తోంది. అర్ధరాత్రులు రావడమూ... జబర్దస్తీగా మాట్లాడటమూ, చనువో, అధికారమో తెలియనివిధంగా వారి ప్రవర్తనా... వాళ్ళు హొదుల్చుకోవలసిన మంచి స్నేహితుల్లా తయారయ్యారనిపిస్తోంది వారికి! పైగా...

ఈమధ్య వారు గిరిజన మహిళలను మగ వారిమీదకి రెచ్చగొడుతున్నారు. సరసమ యిన ధరకు సారా అమ్మించకపోగా తాగు డుకి వ్యతిరేకంగా ప్రచారం మొదలుపె ట్టారు. మగవారి సంపాదనంతా సారాకి తగలేస్తుండబట్టే సంసారాలిలా పేదరికంలో మగ్గుతున్నాయంటూ ఆడవాళ్లకి పాఠాలు నేర్పి మగవారిమీదకు ఉసిగొల్పడం మొద లుపెట్టారు. ఆడవాళ్లలోనూ చాలామంది తాగేవారే కనుక సరిపోయిందికానీ లేక పోతే ఈపాటికి మొగాళ్ళూ వారి ఆడవాళ్లూ జుట్టూ జుట్టూ పట్టుకుని వీధిన పడవల సిందే. ఈ అన్నలు అటు ఆర్పే వారూ, ఇటు తీర్చేవారూ కూడా కావడంలేదు కానీ అనవసరంగా తమని యాతన మాత్రం పెడుతున్నారు. వీళ్ళతో చచ్చే చావొచ్చి పడుతోంది.

ఆ చికాకుని వొదుల్చుకుందుకు సారా తాగి యిళ్లకి పోయారు వారు.

ఆ మర్నాడు... మధ్యాహ్నమౌతోండగా ఆకుపచ్చని అడవిలో అపశకునంలా నాలుగు ఎర్ర బుట్టలు ప్రత్యక్షమయాయి. వాళ్ళు సరాసరి పూజారి యింటికే వొచ్చేసి బైఠాయించారు. జబర్దస్తీగా ఆసనాలాక్రమిం చుకుని "పెద్దల్నీ మిగిలినవారినీ కూడా పిలి పించు, మాట్లాడాలి. ఈలోగా మాకు జీలు క్కల్లుపొయ్యి. చాలా అలసిపోయాం నడచీ నడచీ" అన్నారు.

పూజారికి చిరాకేసింది. కాని... వాళ్ళ కాకీ యూనిఫారాలు, ఎర్ర టోపీలూ, భుజా లకి తుపాకిలూ చూస్తూనే మౌనం దాల్చాడు. అతని మనసు మాత్రం బాధగా ఆక్రోశించింది.

గూడేనికి ఏం జరగబోతోంది? అందరి దృష్టీ ఎందుకిలా ఈ పచ్చని అడవిమీదే పడుతోంది. వెదురు నరికేయడంతో బాటలూ, వాటిమీద కంట్రాక్టర్ల లారీలూ లేక ఫారెస్టుగార్డులాట్టే తిరగడంలేదని సంబ రపడుతూంటే... ఆ సంబరం మూన్నాళ్ల ముచ్చటే అయింది. రాజకీయాలవాళ్లు, మతాలవాళ్ళు, అన్నలు, పోలీసులు రావడం మొదలుపెట్టారు. ప్రభుదృష్టీ, దైవదృష్టీ పడ కూడదంటారు కానీ వీరి దృష్టులూ వాటి కంటే తక్కువ అలజడీ అశాంతీ రేపడం లేదు. చివరికేమౌతుందీ గూడెం? ప్రజల భవిష్యత్తేం కాబోతోంది?

భీమన్న, మహారాజు మరోయిద్దరు పెద్దలు వొచ్చేసరికి పోలీసులు తాగడమూ తినడమూ కానిచ్చి సిద్ధంగా ఉన్నారు. నలు గురిలోనూ ఒకరు మెల్లగా, రహస్యం చెబు తున్నట్టే చెప్పసాగాడు.

"నాకు మీ గూడెమంటే అభిమానం. ఎందుకంటే మీరంతా చాలా మంచివాళ్ళు మీకపకారం జరక్కూడదని. నాకు తెలిసిన రహస్యం మీకు చెబుదామని వొచ్చాను మిత్రులని వెంటేసుకుని. ప్రభుత్వం మిమ్మ ల్నిలాగయినా ఇక్కడినుంచి కాళీ చేయించా లని పట్టుదలగా ఉంది. ఎందుకంటే ఇక్కడ ప్రాజెక్టు కట్టడం అతి ముఖ్యం. మీకు తెలుసో తెలియదో కాని హెలికాప్టర్ల మీదా... మామూలుగానూ సర్వే జరిగిపో యింది. ప్లానులు కూడా గీసేశారట యింజ నీర్లు. మీరు కాళీ చెయ్యడమొక్కటే మిగిలిం దిక. అదీ ఓ పది పదేనురోజుల్లో జరిపిం చెయ్యాలని ప్రభుత్వం సంకల్పం. మనసులో దాచుకోండి నేను చెప్పే మాటలు. నేను చెప్పానని ఎవరితోనూ అన కండి. మీరు కాని మర్యాదగా కాళీచేయక పోతే గూడేలమీదకి రహస్యంగా పోలీసు లనీ టాస్క్‌ఫోర్స్‌నీ పంపడానికి కూడా తెగించేసింది ప్రభుత్వం. నక్సలైట్లని ఎన్ కౌంటర్ల పేరుతో చంపినట్లు, యిక్కడేదో గొడవ జరిగిందనీ కాల్పులు జరపక తప్పలే దనీ అంటారు. అయినా, ఈ కొండలలో ఏం జరిగితే ఎవరికి తెలుస్తుందవతలి ప్రపంచంలో? తెలిసినా పట్టించుకునే వారె

వరు? అందుచేత... నా సలహా ఏమి టంటే... చచ్చినోడి. పెళ్ళికొచ్చిందే కట్నమని... ఎలాగూ పోక తప్పనప్పుడు, ప్రభుత్వాన్నుంచి వొచ్చేవేవో రాబట్టేసుకు మరీ పోవడమే ఉత్తమం. ఏమంటారు? కాదని ఇక్కడే ఉందామనుకున్నా అదయ్యేది కాదు. కొండతో పొట్టేలు ఢీ కోడమే ఔతుంది. మన తల బొప్పికట్టించుకోడమే కాని సాధించేదేమీ ఉండదు. ప్రభుత్వమా, మజాకానా! బలం వాళ్ళది... అధికారం వాళ్ళది. అన్నీ వాళ్ళవే. మనదేటుంది బోడిగుండు తప్ప! జాగ్రత్తగా ఆలోచించుకోండి. ఏది మంచిదనిపిస్తే అది చెయ్యండి. ఒకటి మాత్రం నిజం. ప్రభుత్వాన్ని కాదన్నారో రెండిటికీ చెడ్డ రేవళ్లౌతారు. అన్యాయంగా దెబ్బతినేస్తారు.

అలా చెప్పి, వాళ్ళు తీరిగ్గా పనసకాయలూ, కొండకందులూ వంటివి మూటలు కట్టించుకుని పట్టుకుపోయారు.

భీమన్న దీర్ఘంగా నిట్టూర్చాడు. "ఇదొక రాజకీయ చతురత. ప్రభుత్వం మన నొకవేపునుంచి అలా బెదిరించింది. ఇపుడిలా మరొకవేపునుంచి సామరస్యంతో పరిష్కరించుకుందామంది సమస్యను. పోలీసులను ఇలా రాయబారంలా పంపి ఆ మాటలు మనకి చెప్పించడంలో అంతరార్థమదే. ఏంచేద్దాం?"

పూజారి విషాదంగానూ భారంగానూ నవ్వాడు. "ఏం చేయగలమనీ మనం?" అతని కన్నులలోంచి నీరుబికింది. ఆ అశ్రువులు తన గురించి కాదు. తన వారిగురించి తన కళ్ళముందే తనవారికేదేనా అయి కకావికలూ చెల్లాచెదరూ అయిపోతారేమో అని వారిపట్ల భయంవల్ల, ఆవేదన వల్ల.

"దుఃఖించకు పూజారీ! మనం మానవ మాత్రులం. భగవద్గీతలో కృష్ణపరమాత్మడేం చెప్పాడో తెలుసా? కర్మణ్యేవాధి కారస్తే, మాఫలేషు కదాచన. కర్మ, కర్తవ్యము చేయడంవరకే మానవుడి పాత్రా బాధ్యతా. ఫలితాలకతను బాధ్యుడు కాదు. వేదాంతం ఉండేది విషాదంలో మనిషి నాదుకుందుకే. మనసు సంబాళించుకో"

పూజారి ఆలోచిస్తున్నది వేరు. గూడేనికి ఒక్కరే పూజారి ఉండనవసరంలేదు. ఇద్దరు కూడా ఉండొచ్చు. మరొక పూజారిని కూడా గూడెం ఎన్నుకుని ఉంటే యివాళ యింత దుఃఖమూ తనువొక్కడే భరించవలసి ఉండేదికాదు. భాగం పంచుకుందుకు మరొకరుండేవారు. తనమీద ఎంతో విశ్వాసంతో పూజారిగా నియమించుకున్న గూడెం తన కనులముందే...

అతను కనులు తుడుచుకున్నాడు. విచిత్రమయిన పరిస్థితి ఇది. ఏదోజరగబోతోందనే తప్ప ఏం జరగబోతోందో కచ్చితంగా తెలియని అనిశ్చిత భవిష్యత్తు... ఎంత పిండుతూంది గుండెను!

భీమన్ననూ మహారాజునూ మిగిలిన పెద్దలనూ పంపేసి తాను యింట్లోకి వెళ్ళిపోయాడు. ఎందుకో అతనికి ఒంటరితనమూ ప్రశాంతతా కావాలనిపిస్తున్నాయి. అతనికీ గూడెంతో ఉన్న అనుబంధమింతా అంతా కాదు. వారసత్వంగా పూజారి స్థానం పెద్దరికాన్నిచ్చింది. గూడేనికతను తన సర్వశక్తులూ ధారపోశాడు. గూడెంవారు పూజారి మనుగడకిచ్చే పొలమూ వాటికీ- ఆ వితరణకు... ఋణం తీర్చుకునే ఉద్దేశంతో కాక వారిని తన వారిగా భావించుకుని సేవలు చేసుకుంటూ వొస్తున్నాడిన్ని సంవత్సరాలుగానూ. తన చేతనైనంతా చేయడంలోనే ఎంతో తృప్తి లభిస్తూవొచ్చింది. ఎలాటి ఆనందమని అది! మరో మనిషికి మనస్ఫూర్తిగా సాయపడడంలో లభించే సంతోషం మాటలకందనిదే. ఆ భాగ్యం తనకి కల్పించిన గూడేనికి తను సర్వదాకృ

తజ్ఞుడే. గూడెం తన గుండె, అడవి తన ఊపిరి, గిరిజనుల తన ప్రాణం.

ఆ గూడేనికి... గిరిజనులకి... ఏం రాసి పెట్టి ఉంది?

తను ఆ రాతను సరిచేయగలడా ప్రాణం ధారపోసి అయినా?

తనవశంలో ఏమయినా ఉందా? అదీ అతని ఆలోచన.

★ ★ ★

స్వేచ్ఛాజీవులూ, వినోదాభిలాషులూ అయిన గిరిజనులు సహజంగానే లలితకళ లలో అభిరుచితోపాటు అంతోయింతో ప్రావీణ్యమూ కలిగి ఉండడంలో ఆశ్చర్యమే మీలేదు. కథకళీ, ఒడిస్సీ, భరతనాట్యం, మణిపురి, భంగ్రా... ఇలాగ వివిధ రాష్ట్రా లలో నాగరీకుల వివిధ రకాల నాట్యరీతులు న్నట్లే గిరిజనులలో తెగ, ప్రాంతాలను బట్టి బంజారా, లంబాడీ వంటి రకరకాల నాట్యా లున్నాయి. పాడేరు, చింతపల్లి ప్రాంతపు గిరిజనులు థింసా నృత్య విశేషంలో నిపు ణులు. వాళ్ల భాషలో థింసానే గుమ్మలాట అంటారు. ఆ నాట్యం ముద్దుగుమ్మలు అందంగా ఆడే ఆటలాగే ఉంటుందిగనుక దానికా పేరు చక్కగా సరిపోతుంది. అమ్మా యిలు చాలామంది ఒకరి చేతులొకరు పట్టుకుని వలయాకారంలో నాట్యం చేస్తూ తిరుగుతారు. ఆ నాట్యానికి పాట ఉంటుంది. వీలునిబట్టి గిరిజన వాద్యాలూ వాయిస్తారు. డప్పు.. తుడుము (ఢంకా), నరిగె (చిన్నతరహా ఢంకా), సొనాయి వేణువు (వెదురుతో చేసినది), బిల్లీలకర్ర (సన్నగా చాలా పొడవైన కర్రగొట్టం) మూడడుగుల పైనే ఉంటుందీ వెదురు గొట్టం. దానికి మధ్యలో జొన్నకండెలాంటి చిన్న గొట్టం తిత్తిలా అమర్చుతారు. గొట్టా నికి స్వర నియంత్రణచేసే రంధ్రాలు ఉంటాయి. ఈ చిన్న గొట్టంలోంచి నోటితో గాలిపోస్తూ (వేణువుకి మాదిరి) ఊదు తారు. ఎంతో మృదువయిన, శ్రావ్యమైన రాగం వస్తుంది. మురళి రవానిక కొంత దగ్గరగా ఉంటుంది. నాగస్వరంను ప్రత్యేక సందర్భాలలోనే పాముకి సంకేతంగా ఊదు తారు. సంక్రాంతి నెలంతా గిరిజనులకు ఆటవిడుపులాంటిదే. ఆటపాటలతో సంగీత నృత్యాలతో అర్ధరాత్రివరకూ వినోదిస్తారు. గుమ్మలాటి జట్టు అంటూ కొందరేర్పడి ఉంటారు.

చింతపల్లి, పాడేరు, సీలేరులలో అతిథి గృహాలున్నాయి. మాడుగులనుంచి కొండ మీద పాడేరుకి వెళ్తూంటే మినుములూరు అనే చోట గెస్ట్‌హౌస్ ఉంది. పాడేరు శివా ర్లలో మరొకటుంది. ప్రభుత్వ అధికారులు, ఉద్యోగులు, వర్తకులు, సౌందర్య ప్రియులు, షికారీలూ... యిలా రకరకాల వాళ్లువచ్చి ఆ వసతి గృహాలలో విడిది చేస్తుంటారు. అడ వులలో అందునా కొండమీద అడవులలో పగలు తక్కువా, రాత్రి ఎక్కువా. చీకటిపడే సరికి అతిథి గృహంలో వీరికేమీ తోచదు. మందుకొడతారు. కొందరు రోమ్‌లో రోమ న్‌లా ఉండాలనుకునేవారు అక్కడ దొరికే జీలుగుకల్లు తాగుతారు. ఇంకా కాలక్షేపం కావాలనిపిస్తుంది. వాచ్‌మన్ చేతిలో పది రూపాయలో, నోట్లో నాగరిక విస్కీయో పోసి గిరిజన నృత్యం ఏర్పాటు చేయమం టారు. వాడు ఏజంట్లలాంటి మనుషులకి కబురందిస్తాడు. ఆ మానేజరు గిరిజనుడే అయ్యుంటాడు. గుమ్మలాట ట్రూప్‌ని తీసు కొస్తాడు. నాట్యకత్తెలయిన ఆ గిరిజన యువతులు సహజంగానే యవ్వనంలోనూ, సౌందర్యంతోనూ ఉంటారు. అయితే నలు గురూ నిజంగా నాట్యప్రియులుకారు, నాట్య కత్తెల దృఢశరీరాల మీదే వీరి చూపు. ఎలాగో నాట్యం భరిస్తారు ఎప్పుడు పూర్తవు తుందా అని. అప్పుడు మానేజర్‌ద్వారా డబ్బుతోనూ, సారాతోనూ వాడిని జయించి,

నాట్యకత్తెలను వాడిచేత ప్రలోభ పెట్టిస్తాడు. గదిలోకి తోసేస్తాడు. గిరిజన యువతులకీ నాగరిక మద్యం అంటే బలహీనతే. గాజులూ, రిబ్బన్లూ, జాకెట్లూ కొనుక్కుందు కని డబ్బిపిచ్చే విస్కీనిషాలో సులభంగా లొంగిపోతారు. అర్ధరాత్రివరకూ అక్కడ గడిపి తెల్లారేలోగా ఇళ్లు చేరుకుంటారు. ఈ గుట్టు తెలిసిన మరికొందరు నాట్యం రాక పోయినా కంటికి నదరుగా కనిపించేవారు ముఠానాయకుడిని మంచిచేసుకుని అతిథి

గృహాలను చేరుతూంటారు. ఇలాగ నాగరి కులు గిరిజన యువతులని ప్రలోభ పెట్టి వారి శీలాన్ని హరించడమేకాక గిరిజన గూడేల ప్రజల ఆరోగ్యాలనీ నాశనంచేస్తుం టారు. తమ సుఖవ్యాధులను గిరిజన యువతులకీ వారిద్వారా వారి భర్తలకీ వారి నుండి వారి అక్రమ సంబంధీకులకూ వ్యాప్తి చేస్తారు. ఇప్పుడు గిరిజన గ్రామాలలో ప్రధాన సమస్యలలో ఒకటి ఈ సుఖవ్యా ధులే! సరయిన చికిత్స చేయించుకుందుకు వారికి డబ్బా ఉండదు, శ్రద్ధా ఉండదు. ఆ మగవారికి డబ్బు అందుతూంటుంది కనుక వారూ ఏమీ ఎరగనట్లే ఉంటారు రచ్చకీడ్వ కుండా. చంపాకలి మాత్రం అటువంటివా రికి సడలింపు.



ఆవేళ... తూరుపు తెల్లవారకముందు నుంచీ వర్షమే. ఆకాశం నిముషనిముషానికీ నల్లబడుతుందే తప్ప కొంచెమయినా విడడ మూలేదు, పొద్దుని రానివ్వడమూలేదు. ఏనుగులమంద సరస్సులోలాగ ఆకాశంలో నీటిమబ్బులు ఆటలాడుకుంటున్నాయి. ఆవేళ సూర్యుడి ఆశలేనట్లే. అంటే ఎవరికీ ఏపనులూ జరగవనే.

చిదంబరం చికాకుపడుతూ తన బంగ్లా లోనే కూర్చున్నాడు పదవుతున్నా రాని సూర్యుణ్ణి శపించుకుంటూ. మద్రాసులో ఉండే ఒక యువరాజాకు చిదంబరం ఇక్కడి ప్రతినిధి. కలప కాంట్రాక్టులూ యితర పనులూ చూస్తూ యజమాని తర పున పనిచేస్తాడు. యజమాని వచ్చినప్పు డది అతనికతిథి గృహం. మామూలుగా చిదంబరానికి నివాసం. తననితానే రాజాలా భావించేసుకుంటూ గొప్పగా బతికేస్తుం టాడా కొండప్రాంతంలో. ఉండేది కొండల లోనే అయినా బంగ్లాలో చాలా ఖరీదయిన జీవితం అనుభవిస్తుంటాడు. వంటమనిషిద గ్గర రెండోసారి వేడివేడి టీ అందుకుని కప్పు పట్టుకుని కిటికీ దగ్గరకు నడిచాడు.

**అడవిలో** ఆకుపచ్చని దట్టమయిన మహావృక్షాలు ఆకాశంలోకి ఎదిగిపోయి, నగ్నంగా స్నానం చేస్తున్న సౌందర్యవతు లలా... తలారా స్నానం చేస్తూ నిలుచున్న తరుణీమణుల్లా... కనుపిస్తున్నాయి.

కోయిలలు మావిచివురులను మేయడా నికి వస్తున్నట్లు, నల్లమబ్బులు కొండ అంచు లను మేయడానికి గుంపులు గుంపులుగా దిగుతున్నయి దివినుండి. ఉండీఉండీ పెను గాలులు. కిటికీలోంచి విసురుగా వస్తూ మంచుసూదుల్లా ముఖాన్ని గుచ్చుతున్న చినుకుల జల్లులు.. ఆ చల్లదనమూ... టీ వెచ్చదనమూ గ్రీన్‌టీ మరీరుచిగా అనిపి స్తుంది.

ఈ రోజంతా బంగ్లాలో వర్షానికి బందీగా ఏంచేయాలి?

"డుంకీ!" అని పిలిచాడు. "లేడికూన ఉంటే మసాలా దట్టించి మంచివేపుడు చెయ్" అని ఆజ్ఞ జారీ చేసి సిగరెట్ అంటించి వచ్చి సోఫాలో కూర్చున్నాడు బద్ధ కంగా.

ఇంకా నైట్‌గౌనే మార్చలేదతను. పుస్తకం తీయబోయాడు కానీ చదవబుద్ధికాలేదు. లేచి వేడివేడిగా స్నానం చేసి పూల బట్టలు వేసుకున్నాడు వెచ్చగా. వర్షం ఆగి పోలేదు

కానీ కొంచెం శాంతిస్తోంది. ద్వారం అవతల ఘల్ ఘల్ టింగ్ టింగ్ లయబద్ధంగా గాజుల, మువ్వల, అందెల సంగీతం!

అంటే చంపాకలే!

అతని ఆనందం ఇంతా అంతాకాదు. తలుపు తెరిచాడు. నెత్తిమీద చక్రంలా ఈత రేకుల గొడుగు. దాని చివర్లనుంచి గుండ్రంగా కారుతున్న చిరుధారలు. వాటి మధ్య చంపాకలి. ఆమె భుజానికొకటి... మరో చేతిలో ఒకటీ పాత్రలు. వర్షం కడిగిన పుష్పంలా తాజాగా ఉందామె. కొలనులో కలువలా మహా అందంగా ఉంది. యవ్వనమూ, సౌందర్యమూ, కొంచెం చదువూ, భాషా, సంగీతమూ, నాట్యమూ ప్లస్ సరదా... అదీ చంపాకలి.

"దండాలు దొర! తమరికిష్టమని జీలు కళ్లు, యిప్పసారా తెచ్చినాను"

"లోపలికిరా"

వొచ్చిందామె. ఆమె వంటిమీద రవికె, గాగరా. గాగరాకి పూసలూ, అద్దాలూ కుట్టబడ్డాయి. చేతులకు దంతపు గాజులు. వర్షపు లయకనుగుణంగా ఆమె కదలికల వలన ఉత్పన్నమౌతున్న దంతపు గాజుల నిక్వణాలు.

లోపలికి వచ్చి "దీపమెట్టలేదేందొర?" అంది.

"ఎలాగూ నువ్వొస్తావుకదా అని" నిజానికి కరంటులేదు. ఇలాటి వాతావరణంలో అదెప్పుడూ ఉండదు.

"తొలుత యిప్పసారా పోతునా? జీలుగు కల్లుపోతునా?" అంటూ బీరువాలోంచి గ్లాసుల్దీసింది.

"నీయిష్టమే"

"నాదేముందిదొర?" నాట్యభంగిమలో వలె వంగడంలో నడుము సౌందర్యం సౌదామినే అయి కన్ను జిగేల్మంది కిటికీ అవతలి మెరుపుకి పోటీగా. అతనాలోచనలోనూ, ఆకర్షణలోనూ గిలగిల కొట్టుకుంటున్నాడు. ఆటవికుల ఆలోచనలూ, కట్టుబాట్లూ తమాషాగానూ ఉంటాయి, ప్రమాదకరంగానూ ఉంటాయి. మనసిస్తే ప్రాణమిస్తారు. తకరాఇస్తే తలతీస్తారు. ఎంతమంచివారో అంత చెడ్డవారూను. ఎంత పిరికివారో అంత తెగింపువారూను.

"చంపాకలీ!" ఆమెకి కూడా మధుపాత్ర అందించాడు. ఆమె కాదనలేదు. ఇక అక్కడంతా ఆనందమే. అడవిపిట్ట కూసినంత తీయగా పదాలు పాడింది. జానపదాలూ జానుపదాలూ. అతనికర్థమవకపోయినా అవి ఆపాత మధురాలు. నవజాత శిశువు రాగానికీ నర్తించే నెమలి క్రేంకారానికీ ఆకాశపు గర్జింపుకీ ప్రియురాలి కేరింతకీ స్వరమూ సంగీతమూ చాలవూ? సాహిత్యమే కావాలా? ఆమె పాటలు కొండకాలువలంత తియ్యనివీ చల్లనివీ గుండె ఝల్లుమనిపించేవీ. పాడుతూనే పదం పాడుతూనే ఆమె పాదాలూ కదిపింది. శాస్త్రమేదయితేనేం, అది నాట్యమే. సౌందర్య విన్యాసమే.

"దొరా! తపాల బంట్రోతు" అంటూ తంతిలాటి ఉత్తరం తెచ్చి అందించాడు. చదువుతూనే త్రుళ్లిపడ్డాడు చిదంబరం. అతని ముఖం రంగులు మారిపోయింది.

"పెద్దదొర వస్తున్నారు. పులిని వేటాడాలని స్నేహితుడితో"

చంపాకలి తెల్లబోయింది. "ఇక్కడ పులివేటా! ఈ చుట్టుపక్కల పులికాదు సరికదా పిల్లికూడా ఉందోలేదో! అడవులదేపనిగా నరికేశారు. అరణ్యం లేక పులులూలేవు. అడివి తెగనరికి ప్రాజెక్టు కట్టారుగా, రోడ్లువేశారుగా పులులెలా ఉంటాయి?"

"పెద్దదొరంటే పెద్దడబ్బు. అంతడబ్బు పులి యిక్కడ ఉండాలని ఆజ్ఞాపిస్తే పులి

చచ్చినట్లు ఉండవలసిందే"

"తప్పేదారీ ఏ బస్తరు కొండలనుంచో వస్తే తప్ప సచ్చిగింజుకున్నా తలకిందులుగ తపస్సు చేసినా ఇక్కడ పులి కనిపించదు యిప్పుడు" ఖచ్చితంగా అందామె.

"ఒకప్పుడుండేవా?" సిగరెట్ అంటిస్తూ అడిగాడు చిదంబరం.

"ఒకప్పటి మాటయితే- ఈ అడవిలో మనుసులకంటే పులులే ఎక్కువుండేవి. అప్పటికి నర్సీపట్నంనుండి బస్సుండేది కాని కచ్చారోడ్డే. సాయంకాలం ట్రిప్పుకైతే ఏ పులో రోడ్డుకడ్డంగా పడుకునేది. అది కదిలే వరకూ బస్సులోవాళ్లు రాంబజనే" ఒకసారాగి "ఎన్ని హారన్‌లు వేసినా ఎంత ఇంజన్ శబ్దం పెంచినా కదలడం మాత్రము పులిగారికి ఇష్టమైతేనే. అవి పులుల రోజులూ, పులుల్లాటి మనుసుల రోజులూ. ఆ రోజులే ఏరు" అంది అదో రకం బాధగా. "మాటాడితే సాలు ఎవరో దొరలు పులేటకి పొర్రావడమూ, మావాళ్లకి చేతినిండా పనీను"

"మీకేం పనీమధ్య?" జీలుగు కల్లు నోటి కఠదిస్తూ అడిగాడు. అతని కంఠంలో ఎంతో దిగులు.

"వాళకి తోవ జూపాలె. పులిమసిలే జాడ చెప్పాలి. మంచీ కట్టాల. మంచి చెడూ చూడాల. అవన్నీ మావాళ్లుగాక మరెవరు జేసేది?" చక్రాల్లాటి కళ్లు తిప్పింది. "అప్పుడిది చింతపల్లి కాద్దొరా, చిరుతపులి"

"ఇప్పుడు..."

"పులులు పోయి పిల్లులున్నాయి. పులులు బోయి పులేషాలు మిగిలాయి. పులి సంచారాలు పోయి పులిచెర్మాలు మిగిలాయక్కడక్కడ. అడవులెండిపోతే పులులకు బతుకెక్కడ?"

"నాకూ ఉన్నట్లు లేదు బతుకు"

"దొరా!" దెబ్బతిన్నట్లు చూసింది. అర్థం కానట్లు చూసింది. అయోమయంగా చూసింది.

"ఔనంతే. దొర వేటకిక్కడ పులి లేక పోతే- నన్ను కాల్చేస్తాడు తుపాకితో. పెద్ద దొర సంగతి నీకు తెలియదు జరగబోయే దదే. వేటే. పులో... నేనో..."

చంపాకలి కళ్లలో నీళ్లు తిరిగాయా మాటలకి. పరిస్థితి పూర్తిగా అర్థమైపోయిందామె చురుకు బుర్రకి. "అంతమాటనకు దొరా! భయపడకు. నీ ప్రాణానికి నా ప్రాణ మడ్డం... పులొస్తుంది, నువ్వెప్పుడెక్కడికి కావాలంటే అక్కడికి. పెద్దొర వేట జరుగు తుంది" వాగ్దానమే చేసిందామె స్థిరమయిన కంఠంతో.

"చంపా! మీ కోయలకి మాయలూ మంత్రాలూ ఎన్నయినా వొచ్చి ఉండవొచ్చు కానీ పులిని పుట్టించలేరు. మోదకొండమ్మ మహిమల కల దేవతే కానీ పులిని రప్పించడం దేవత తరమూ కాదు"

ఆమె నవ్వింది. "మాయలూ మంత్రాలూ దేవతా... అన్నిటికంటే శక్తి కలదీ మహిమ కలదీ మీరే చూద్దురుగాని... నా మాట నమ్మండి. పెద్ద దొరని వేటకి తీసుకురండి"

చంపాకలి ఎంత నమ్మకంగా చెప్పినా అతనికి మాత్రం అధైర్యంగానే ఉంది. అందరూ పులి వస్తుందేమో అని భయపడితే తనేమో పులిరాదేమో అని బెదిరి చస్తున్నాడు. ఇంతకీ ఆ వేట ఎవరిదౌతుంది? పులిదా, తనదా? చిదంబరానికి సందేహాలతో కలుగుతున్న ప్రాణభయంతో కంటిమీద కునుకు లేదు. ఈ గండం గడిచి వేటనుంచి బతికి బయటపడితే మేకని మొక్కుకున్నాడు మోదకొండమ్మకి. రోజులు గడిచాయి. చంపాకలి మళ్లీ కనిపించలేదే! ఏంచేస్తాంది? పులికోసం పూజలు చేస్తాందా? ఆవేళ ఉదయం ఒకామె నల్ల మారెమ్మలా

జుత్తు విరగబోసుకునీ ముఖంనిండా పసుపు కుంకుమలు మెత్తుకునీ వొచ్చి- "వంకమానుకాడికి సరిగ్గా అర్ధరేతిరి పులొస్తాదని కొండదేవత సెప్పమంది" అనేసి వెళ్ళిపోయింది హడావిడిగా.

రాత్రి ఔతూంది. వేటవేళ దగ్గర పడుతుంటే చిదంబరానికి గుండెల్లో రైళ్లు పరుగెత్తసాగాయి. మనసులో పులికోసం పూజలు చేస్తున్నాడు. "పులి దొరక్కపోతే నిన్నే షూట్ చేసేస్తానక్కడే" అని చెప్పాశాడు కూడా పెద్దదొర. జీపు బయలుదేరింది. అడవి అంధకార బంధురంగా ఉంది. జీపు కాంతి పడేమేర తప్ప ఏమీ కానరావడంలేదు. చెట్లు- కొరకంచులే దెయ్యాలై నిలుచున్నట్లున్నాయి. బాట ఐపోయేసరికి జీపు ఆగిపోయింది. ఇక టార్చిలైటు వెలుగులో కాలినడక. ఎండుటాకుల మీద కాళ్లుపడి చేస్తున్న గలగలకు జలదరిస్తూన్న పిరికి గుండె. వంకమానుకింద కట్టి వేయబడిన మేక- "మేమే"లు గుండెను పిండేస్తూ. చెట్టు ఎక్కి షికారీలు. క్షణాలను యుగాలుగా చేసే ఉత్కంఠపూరితమయిన నిరీక్షణ. చలికీ భయానికీ చిదంబరం రోమాలు నిక్కబొడుచుకుంటున్నాయి. పులి నామజపం చేస్తున్నాడతను. నిజంగా పులి వొస్తుందా? రాకపోతే? ఊహించలేకపోతున్నాడతను.

ఒక్కసారి గట్టిగా మేక అరుపులు. ఎటు వేపునుంచో గబ్బు వాసన. ఎండుటాకులూ పండుటాకులూ నలుగుతున్న చప్పుడు. ఎవరో వొస్తున్న అలికిడి- మెత్తగా పులి! ఒక్కసారి టార్చి వెలుగు. "షూట్" అన్న అరుపులు. "ఢామ్మ"న్న శబ్దాలు పులి గాండ్రింపు గర్జన. నేలకూలి... ఆర్తనాదం. అన్నీ క్షణాలలోనే ఐపోయాయి. చిదంబరానికి నమ్మశక్యం గాకుండా ఉంది.

"జీపులో వేయించుకురా. మేం వెళ్తాం" చచ్చిన పులిని అక్కడే వొదిలి పెద్ద దొర వెళ్లబోతూంటే... సరాసరి చర్మమూ గోళ్లూ తీయించుకునే వొచ్చేస్తాను. అదంతా బంగ్లాలో అయితే కంపుకదా..." అన్నాడు.

"అలాగే చెయ్" వెళ్ళిపోయారు వారు, వేట అయింది కనుక విస్కీకి డుంకీ... చిదంబరం ఉండిపోయారు, పులి పక్కన. పులి శవం పక్కన. ఇద్దరి చేతుల్లోనూ టార్చిలైట్లు. పులిలో మెల్లగా కదలిక.

"బాబోయ్" అరిచాడు పిరికివాడు చిదంబరం.

"భయంలేదు నేనే..." పులిలోంచి మెల్లగా మానవకంఠం. ఆడకంఠం. "చంపని"

"ఆ!"

ఆమె మెల్లగా తన చుట్టూ ఉన్న పులి చర్మాన్ని తొలగించుకుని బయటపడింది- రక్తసిక్తమయి కంపు కొడుతున్న దేహంతో "ఏమిటిది చంపా?"

ఆమె నవ్వింది. "ప్రేమకంటే ఏదీ ఎక్కువ కాదు. నా ప్రేమవి నువ్వు. నీకెదురయిన అపాయం తప్పించడానికింతకంటే ఉపాయం తట్టలేదు. మా తాత పులుల మీదే బతికేవాడు. ఈ చర్మం అతను దాచినదే. పులులు నశించిపోవడంతో పులి వేషాలు వేసేవాడు జీవనాధారం కోసం. అతన్ని చూసి నేర్చుకున్నవే పులి కదలికలు. గబ్బుకంపు రావడానికి కొన్ని అడవిపిక్కలు. పులినై... వొచ్చానలా. చీకటి కనుక నా ప్రవర్తన, కదలికలలో తేడాలున్నా మీ దొర గుర్తించలేకపోయాడేమో. ఏమైతేనేం గండం గడిచిందికదా? డుంకీ! ఈ రహస్యం గుండెల్లో పెట్టుకుని నన్ను కాపాడతావుకదా? దొరా! చర్మం శుభ్రపరచి రేపు పొద్దున్న పట్టుకుపోదువుగాని గోళ్లూ ఉన్నాయి" చంపాకలి రెండు కాళ్లల్లోను రెండు పెద్ద గాయాలు. తుపాకి గుళ్లు తగి

లాయి కాబోలు.

"ఎందుకింత సాహసమూ, త్యాగమూ చేశావ్ చంపా?" అప్రతిభుడై అడిగాడు. ఆమె నవ్వింది. "నీ కోసం దొరా! నీ ప్రేమ కోసం. పెళ్లి కాకుండా నిన్ను చేరలేను. పెళ్ళి చేసుకోవాలంటే నిన్ను ప్రేమతో గెల వాలి. ఇంతకంటే నా ప్రేమకి అవసరమూ, పరీక్షా మరెప్పుడొస్తాయి?"

"ఒకవేళ తుపాకిగుళ్లు తగలరానిచోట తగిలి ప్రాణంపోతే?"

"ఏ ప్రేమకేనా ప్రియుడికి ప్రాణం ఉప యోగపడడంకంటే సాఫల్యమూ, సార్థకతా మరేముంటాయి రాజా?" ఎంత సంతోషంగా నవ్విందని- ఏమీ జరగనట్లే.

ఈ దుస్సాహసంలో పులివేషంలో రెండు పాదాలూ దెబ్బతిని- కుంటిదైంది చంప. నడవగలదు కానీ... వంకర అడుగుల తోనూ మెల్లగానూ. ఈమె ఆ చంపాకలి. ఇప్పుడీమె వయసు నలభై దాటింది" చెప్పడం ఆపాడతను.

"చిదంబరం ఈమెను మనువాడలేదా?" శ్రోతలలో కొందరుండబట్టలేక ఆత్రంగా అడిగారు. కథకుడు బాధగానూ, భారంగానూ నవ్వాడు. "కథలాటి చంపాకలి జీవితమూ ప్రేమల తరువాతి భాగం, ముగింపు వారి మాటలలోనే వినండి" అని ఒక్క క్షణం నిశ్శబ్దం దాల్చాడు శ్రోతలను గతంలోకి తీసుకువెళ్లడానికన్నట్లు.

"చంపా! నువ్వు మనిషివి కావు. నా పాలిటి దేవతవు. నువ్వు చేసిన సాహసం అనన్యసాధ్యం. నీ త్యాగం నిరుపమానం. నువ్వు నా ప్రాణం నిలిపావు" అన్నాడు.

చంప నవ్వింది. "దొరా! ప్రేమలో అలాటి మాటలుండవు. ఉండకూడదు"

"నీకు పట్నం పంపి వైద్యం చేయిస్తాను. ఈ డబ్బుంచు" నోట్ల కట్టలందించబోయాడు చిదంబరం. కిలకిల నవ్విందామె అటువంటి పరిస్థితిలో కూడా.

"నేను కోరుకునేది డబ్బుకంటే చాలా విలువైనది దొరా! నీ ప్రేమ" ఆమె ఆ డబ్బు తీసుకోలేదు"

"నేను నిన్ను ప్రేమించగలను కానీ..."

"ఏమిటి?" భయంగా చూసిందతని ముఖంలోకి.

"నిన్ను పెళ్లిమాత్రం చేసుకోలేను. మనది అమలిన ప్రేమగా..."

"అంటే ఏమిటి? అసలు ప్రేమకి మలిన మేమిటి? గంగకి కల్మషమా! ఊహు!"

"నేను నాగరికుణ్ణి. నువ్వు గిరిజన స్త్రీవి. అందుచేత మనమధ్య ఎన్నో విధాలుగా ఎంతో అంతరం. నిన్ను వివాహం చేసుకుని అర్థాంగిగా మావాళ్ల మధ్యకు తీసుకెళ్లితే నవ్వులపాలే అవుతామిద్దరమూ. అదీకాక నువ్విప్పుడు కుంటిదానివి. సౌందర్యారాధకుడినీ, రసికుడినీ అయిన నేను ఒక కుంటిదాన్ని ఎలా చేసుకోగలనామె ముఖమెంత అందమయినదయినా. ఆమె కంఠమెంత తీయనిదయినా, ఆమె మనసెంత ప్రేమమయమయినా? తను వెవరిదైనా మనసు నాదయితే చాలనుకునే సినిమా ప్రేమ కాదు నాది. స్త్రీ అంటే తనువూ, మనసూ కూడా. మనసులేని తనువునయినా సరిపెట్టుకోగలనేమో. కాని తనువు లేని మనసుతో తృప్తిపడదు నా యౌవనం. నీ పాదాలిక నాట్యం చేయజాలవు. నువ్వు నాకు స్త్రీగానూ తోచవు" నిష్కర్షగా చెప్పేశాడతను.

"నువ్వు చేసిన మేలుకి- నువ్వు కోరిన డబ్బిస్తాను కావాలంటే. అంతే తప్ప ఒక కుంటిదానితో నేను శరీరమూ పంచుకోలేను, హృదయమూ పంచుకోలేను"

అలాగ ముగిసింది చంపాకలి వలపు ఘట్టం. తరువాత అతనక్కడ కొన్ని సంవత్సరాలున్నా ఒక్కసారి ఆమె ముఖం చూడలేదు. చంపాకలికి ఆత్మహత్యంటే మాత్రం

పరిమితమయిన భయమూ, అస హ్యమూ. చేతులారా ప్రాణం తీసుకోలేక జీవచ్ఛవంలా బతకసాగిందామె. మన గిరి జనులలో కొందరు ఆమె సౌందర్యానికి మురిసి, కుంటితనాన్ని క్షమించి ఆమెను మనువాడతామని ముందుకి వచ్చారు. కానీ, "ఒక విల్లులో ఒకే బాణం, ఒక స్త్రీ హృద యంలో ఒకే పురుషుడు" అంటూ వారి ప్రతిపాదనలను తోసిపుచ్చి ఒంటరిగానే ఉండిపోయింది.

శ్రోతలు కోపం పట్టలేకపోయారు "ఆ చిదంబరం ఎంత నీచుడు! ఎంత దుర్మా ర్గుడు! ప్రేమకోసం ప్రాణాలనే పణంపెట్టి సాహసం చేసిన చంపని కాదని కాలదన్నగ లిగాడా! వాడు మనిషేనా? " అంటూ ఆవే శాగ్రహాలు ప్రదర్శించారు.

"అతను మనిషే. కాని... నాగరికుడు. టౌనువాడు. గిరిజనుడు కాడు. అందుకే మనకర్థంకాక అతీతుడిగా అనిపిస్తాడు. ఇటువంటి సమయానుకూలతా, స్వార్థమూ- కృతజ్ఞతాలేమీ ప్రేమరాహిత్యమే నాగరికతా లక్షణాలూ, గొప్పతనాలూ!"

చటుక్కున కలుగజేసుకుంది చంప. "వొద్దొద్దు. మీకు దణ్ణం పెడతాను. చిదంబ రాన్ని నా దొరనేమీ అనకండి. నా దొర తాలూకు టౌనునేమీ అనకండి" చేతులెత్తి మొక్కిందామె సభకు- కన్నులనిండా నీటితో.

"ఇంత జరిగినా... ఇన్నేళ్లయినా ఇప్పటికీ ఎంత ప్రేమ ఆ తుచ్ఛుడిమీద. గిరిజనుల జీవితాలేకాక వారి ప్రేమ కూడా ఝురి అంత స్వచ్ఛమూ, పవిత్రమూనా!" గొణుక్కు న్నారు శ్రోతలు.

"నాగరిక తత్వానికీ, ప్రవర్తనకీ చంపాకలి సజీవ తార్కాణం. ఇప్పుడాలోచించండి. ఏ జీవితమెటువంటిదో- దేనివేపు మనం మొగ్గుచూపాలో... ఇక్కడ అక్కడలలో ఎక్కడ ఉండాలని నిర్ణయించుకోవాలో..." అని అతను చంపాకలిని నడిపిస్తూ సభ ముందునుంచి పక్కకి వెళ్ళిపోయాడిక చెప్పేందుకేమీ లేదన్నట్టు.

★ ★ ★

అతను గిరిజనుడిలాలేడు. అలాగని పూర్తిగా నాగరికుడిలాగానూ లేడు. అటు గుర్రమూ కాక యిటు గాడిదా కాక సంకర జాతి కంచరగాడిదంటారే... అలాగ ఆటవి కతకూ నాగరికతకూ నడుమగా ఉన్నాడు. అందుకే సావడిలో అందరిముందూ ఏదో చెప్పాలని నిలుచున్న అతన్ని కొంచెం ఆశ్చ ర్యంగా చూస్తున్నారు ప్రేక్షకులు. ఇతనికిక్కడ తమముందు మాట్లాడడానికి ఈ గూడెం పెద్దలూ పూజారీ సమయమూ అవకాశమూ ఎందుకిచ్చారా అని ఆలోచిస్తు న్నారు.

సాధారణంగా కొండలలో ఉండేటప్పుడు గిరిజనుడు గోచీ పెట్టుకుంటాడు. ఎక్కడి కేనా వెడితే గుండెలమీద బనియన్ వేసు కుంటారు, లేదా దుప్పటి కప్పు కుంటారు. తమ గూడేలలో గిరిజన స్త్రీలు గెంట్లాం కట్టుకుంటారు. గెంట్లామంటే కాస్త పొట్టిగా ఉండే చీర. జాకెట్ వేసుకోరు. గెంట్లాన్నే వక్షస్థలం కనపడకుండా చిత్రంగా తిప్పి కట్టుకుంటారు.

ఇతను బుష్షర్ట్ వేసుకున్నాడు. ప్యాంటు ధరించాడు. పాదాలకి జోళ్లు వేసుకున్నాడు. అవన్నీ నాగరకతా చిహ్నాలే అయినా శిధి లావస్థలో ఉండి పేదరికాన్నే చాటుతు న్నాయి. అతని ముఖం గుండ్రంగానూ... పెదవులు లావుగానూ, చర్మం నూనెరాసి నట్లు ఒకవిధమయిన నిగారింపుతోనూ ఉండి- యితను పూర్వాశ్రమంలో గిరిజనుడే సుమా అని పట్టియిస్తున్నాయి.

పూజారి అతన్ని సభ్యులకిలా పరిచయం చేశాడు. "కొండలను వొదిలి కిందకి పోవ డమా... లేక యిక్కడే ఉండడమా... ఏది

మంచిది? ఇది మన సమస్య. దీని గురించి రకరకాలుగా చర్చించుకుంటున్నాం. అయితే మనలో ఎవరికీ టౌన్లలో బతుకు గురించి పూర్తిగా తెలియదు. ఊహలూ ఆశలూ మాత్రమే ఉన్నాయి. తాత్కాలికంగా ఏవో పనులమీద నాలుగురోజులు కొండ దిగువ ఉండి వొచ్చేవాళ్ళమే తప్ప- అక్కడ ఓ ఏడాదో రెండేళ్లో మకాం పెట్టి మంచీచెడూ తెలుసుకున్నవాళ్ళం ఎవరమూ కాము. ఇతను భీమరాజు... నాలుగైదేళ్లయి టౌనులలో ఉంటున్నాడు. అనుభవజ్ఞుడయిన యితని జీవితం నుంచి మనం చాలా విషయాలు తెలుసుకోగలుగుతామనే చుట్టం చూపుగా వొచ్చిన యితన్ని మనకోసం మాట్లాడమన్నాను. అతని జీవితం మనకి చాలానే పనికొస్తుంది. జాగర్తగా వినుకోండి, అప్పుడు ప్రారంభించాడు భీమరాజు.

"నా పేరు భీమరాజు. ఇప్పుడయితే నేను టౌనువాడినయ్యాను కాని ఐదారేళ్ళ కిందటి వరకూ నేనూ మీలాగే గిరిజనుడినే. నేను పుట్టిందీ పెరిగిందీ కొండలలోనే. నా మనువూ కొండమీదే జరిగింది. నా కూనలూ కొండమీదే కలిగారు. నాకిద్దరు పెళ్లాలు. నాకు ముప్ఫయ్యయిదేళ్ల వొయసు. మేము కొండలలో ఉండేవాళ్ళం. మా ఆవాసాలన్నీ కొండలు, బండలు, అడవులు అరణ్యాలు. మేముండెడి గూడెం పేరు చిన్నపాకల. పాతిగ్గుడిసెలుండేవి. పెద్దదే. ఇప్పుడా చిన్న పాకల గూడెమూ లేదు. గూళ్ళూ లేవు. అక్కడ మేమూ లేము, మా వాళ్ళమూ లేము. ఎందుకు లేకుండా పోయామో ఏటో... అదంతా ఎలా జరిగిందో అదంతా... మాకదంతా... మా బతుక్కు పడ్డ కతంతా మీకు సెబుతాను. మనసు పెట్టి వినుకుని మీ మనుగడని పదిలం చేసుకోండి. మాలాగ పొరపాటుగా జారిడుచుకుని ముక్కలూ సెక్కలూ సేసుకోకుండా ఉండండి. ఇంటున్నారు గదా?

ఓనాడు... అటాత్తుగా... పొదలోంచి పులిలా... అడవి బాటమీంచి మా గూడెం లోకి ఓ జీపురికింది. ఓ మోటారు దిగింది. దిగి- అడివికీ మాకూ ఎన్నో బొమ్మల్దీశారు. బొమ్మలంటే ఫుటోలు. మమ్మల్నాళ్లకు సాయం జెయ్యమని మా అందరికీ దుడ్లిచ్చారు. అగ్గిపెట్టెలిచ్చారు, బిస్కత్తులిచ్చారు. బలే బాగుందని సంకలు గుద్దుకున్నామే కాని అదంతా మా వేళ్లతో మాకళ్లని పొడవడానికే అని ఆనాడు కానుకోలేకనూ పోయాము, కాసుకోనూలేకపోయాము. ఎన్నెన్ని ఫుటోలు దీశారో అడివికి లెక్క సెప్పలేను. ఇటోసారి క్లిక్కు... అటో సారి క్లిక్కు. పైనుంచి కిందకి క్లిక్కు... కిందనుంచి పైకి టిక్కు అటుపక్క చిటుక్కు... ఇటు పక్క చిటుక్కు... క్లిక్ మన్నప్పుడల్లా కళ్లు జిగేల్మనిపిస్తూ పట్టపగలే మెరుపు. పొద్దుటనగా వొచ్చినోళ్లు సీకటడేవరకూ అదేపని ఏలాం యెర్రిలాగ. ఆళ్లు మా అందరికి మస్తుగా దుడ్లిచ్చినారేమో ఆ రాత్తిరి సారా తాగి సేప యేపుడు తిన్నాం. బాగుందని సంబర పడ్డాం. మళ్ళీ కొన్నాళ్ళకి. మళ్ళీ జీపు వేసుకుని- మరికొందరు గొప్పమనుసులొచ్చారు మా గూడేనికి. వొస్తూనే మమ్మల్నందరినీ కూడదీసి "దుడ్లిస్తాం పన్లు జేస్తరా?" అని అడిగారు. సంకలు గుద్దేగుసుకున్నాం. పన్లు దొరకడమే గనమూ, గగనమూ కద? ఆడ, మగ, పిల్లా పీచూ, ముసిలీ ముతక... అందరమూ సై అన్నాం. ఆళ్ళు మాకు పని యిచ్చారు. మా గూడెమే కాదు. మా సుట్టు పక్కల మెరక గూడెం... ముడిదాం... అన్నిటినించీ మనుషులని దీసుకోని చకచక పన్లుజేయించీసినారాళ్లతి చాకచక్యంగా. మా కళ్ళముందే పక్కారోడ్డడి పోనాది. మేమే వేశాం. అట్టాటిట్టాటోడు కాదు. ఇనుమ్ముక్కలాటి సిమెంట్రోడ్డు. రోడ్డుపడ్డమేటి, తురుబురులు... మోటార్లు... లారీలు, నరసం

చారం పెరిగిపోనాది. ఈసారి కుసిన్ని రోజులకే జీపు కారేసుకుని పెద్దోళ్లొచ్చిన్రు. మేము మాలో మంతనాల్జరుపుతున్నాం. "కితంసారి పుటో దిగమంటే సారా పోయించాలని సరతెట్టాం. ఈ పాలేటడగాల? డబ్బా? మళ్లీ సారాయేనా? "

వాళ్ళు మమ్మల్ని పిలిచారు. "భూనులు... యిళ్లు కల యజమానులు తమ పత్రాలు పట్టుకు సావడికిరండి" అన్నారు.

"పత్రాలు మాకాడెక్కడుంటాయి? మా పూజారి దగ్గర్నే ఉంటాయి" అన్జెప్పాం మేము.

"అయితే అందరూ అక్కడికి రండి. మేమూ పూజారీ అక్కడే సిద్ధంగా ఉంటాం" అంటూ మాకు బీడీలూ అగ్గిపెట్లూ యిచ్చి కదిలారు. మేమేమో బీడీలు దమ్ము కొడుతూ రాజెవడి కొడుకన్నట్లు సావడికి బయలెల్లాం. అక్కడాళ్లు పత్రాలమీద మాసేత ఏలిముద్దర్లేయించారు. ఏలిముద్దర్ల పెట్టి- అదోరంగుతో. బచ్చలి పండురంగుతో తడిసిన గుడ్డమడత... దానిమీద మా ఎడం బొటనేలద్దడం ఆ ఏలినివాళ్ల కాగితాలమీద పెట్టి నొక్కడం. ఆ కాగితాలమీద మా ఏలి బొమ్మల్దీసుకున్నారదేంటో. ఎర్రి ఎయ్యి యిదాలంటారిందుకే కాబోలు. ఏలికి బొమ్మేటి? అదేమన్నా మనిసా? పులా? ఇలా ఏలునొక్కడం. సేతిలో దుడ్లెట్టడం. దుడ్లంటే యిన్నీ అన్నీ కావు. ఎన్నో! ఆనందపడి పోతో అందుకున్నాం. ఆ డబ్బుల్తో ఏటేటి కొనుక్కోవాల అని కలలు కంటూంటే- మా అందరి సెవుల్లోనూ పిడుగుల్లాటి మాటలు పడ్డాయి ఒక్కసారి.

"వారం రోజులలో మీరందరూ మీమీ గుడిసెలూ గూడేలు కాళీ జేసిపోవాలి"

"ఎందుకు? ఏడకి? " ఒక్కసారే అరిశాం మేకలమందలాగ.

"ఎందుకంటే- యిక్కడి మీ ఆస్తులన్నీ... స్థిరాస్తులన్నీ మాకు దఖలు పరిచేశారు. డబ్బు తీసుకుని, ప్రతి ఫలం తీసుకుని మీ భూములూ గుడిసెలూ మాకిచ్చేశారు"

"ఆ! అయితే- మేమేడకు పోవాలి? "

"ఏమో మాకేం తెలుసు? అది మీ యిష్టం. మేం మీకు డబ్బిచ్చేశాం, మీరు పోవాలి. అంతే" కరాకండిగా చెప్పాడా ఆపీసరు బాబు.

మా అందరికి ఒక్కపాలి దుక్కమొచ్చి పడిపోనాది ఉప్పెనలాగ.

"దేశాభివృద్ధికోసం యిక్కడ డామ్ కడతాం. మల్టీపర్పస్ ప్రాజక్ట్ కడతాం. ఎలక్ట్రిసిటీ జనరేట్ చేస్తాం. రోడ్లు... అభివృద్ధి..." ఆ మాటలు మా బాసకాదు. మాకర్థమయిందొకటే. కళ్లు మూసి జెల్లకొట్టి నట్టాళ్లు మా చేతిలో డబ్బులెట్టి మా కొండనీ, మా అడవినీ మమ్మల్నీ కొనీసినారని. చందమామల్లాటి నోట్ల కాగితాలు చూబిస్తూ మమ్మల్నందరినీ పాముల పుట్టలమీద పాకించేరని. మమ్మల్నీ గూడెమూ మాగూడూ వీడి వెళ్ళిపొమ్మంటున్నారని.

"మేం మాత్రం యీ దేశం మనుసులం కామా? ఈ కొండలు మాత్రం దేశం కాదా? మా అభివృద్ధి మాత్రం మీకొద్దా? బిచ్చం పెట్టకపోతే పోయావుగాని బూతుల్తిట్టకన్నట్లు మాకు మీరే మేలూ తవ్వి తలకెత్తక్కర్నేదు కాని మమ్మల్నీడనుంచి తరిమీకండదేసాలు. కావాలంటే మీ డబ్బులు మీరే తీసేస్కోండి. అంతేగాని మమ్మల్ని మా అడివమ్మ వొడిలోంచి... కొండ తండ్రి అండనుంచి అవతలికి లాగీకండి. మేం కొండోళ్లం. కోయోళ్లం. అడవిమాయమ్మ. కొండ మా తండ్రి. అవే మా అండదండలు. చెట్లతోనే మా చెలిమి గట్టూ పుట్టా మా సుట్టాలు. అడివిలో పుట్టి, అడవిలో పెరిగి అడవిలోనే అంతమయ్యే అడవి

మాలోకాలంమేం. అంచేత మమ్మల్నిగాని అడివినుంచి లాగేస్తే అల్లల్లాడిపోతాం. అగ్గగ్గలాడిపోతాం. మీ పట్నవాసపోళ్ల మల్లె పెద్ద సదువులకనిగాని... ఉజ్జోగాలకని గాని ఉన్నూరినీ కన్నోరినీ యిడిసి పైకెళ్లడం మాకలవాట్నేదండి. అది మా పద్ధతే కాదండి. ఏటి బాబూ గొణుగుతున్నారూ?"

"మీ కొండ దొరలు మాత్రం జాతకాలు చెబుతామనీ... వనమూలికలు అమ్ముతామనీ కొండదిగి టౌన్లంట తిరగడంలేదూ? వన్యజీవితమూ మన్యమూ వొదిలి మరోచోటున మకాం పెట్టడం లేదా?"

"ఎందుకు దిగరు బాబూ? దిగుతారు. సింత పిక్కలతోపా, మామిడి జీడి అంబలి కూడా కడుపుకి కరువై ఆకలి మాడిచేస్తూంటే- బతుకుబండలూ ప్రాణంమట్టీ అయిపోకుండా దిగక సత్తారా బాబూ? పులంతటిదే ఆకలికి ఆహారం దొరక్కపోతే అడివి విడిసి దగ్గరున్న ఊరిమీద పడుతుందే ఎద్దులకోసమో, మేకలు, గొర్రెలకోసమో? అయితే ఆ పులికీ, ఆ కొండోళ్లకీ కూడా ఓ ఆశా ఓ దీమా ఉంటాయి దొరలూ. మళ్ళీ కొన్నినాళ్లలోనే తన గూడూ గుండే అయిన గూడెమూ, అడివమ్మ వొడీ చేరేసుకోగలమని. ఆ ఆశమీదే కొండ దిగిన కోయదొరలు అడివవతల ఏడాది కాన్నెల్లుండగలుగుతారు. చిన్న సంగజ్జెబుతాను బాబులూ, సిత్తగించండి. ఓ లేడమ్ముంది. దానికో కూనున్నాది. ఆ బుల్లి లేడి కూనకమ్మంటే ప్రేణమూ ప్రెపంచకమూ. అయినా మేత మేసేందుకో... ఏ గరిక గడ్డో, ఆకు చివురో అగపడితేనో కుసింత సేపటూ యిటూ పోతుందమ్మని వొదిలి. అదయి పోంగానే ఆ పిచ్చి కూన మళ్ళీ వొచ్చేసి అమ్మ పక్కలోకో డొక్కలోకో ముడుచుకుంటుంది ముద్దుగా. కొండోళ్లూ అమాయకపు లేడి కూనలూ అడివికూనలే. తప్పనిసరయి మన్యం వదిలి వెళ్లవలసొచ్చినా నాల్రోజుల య్యాసరికి ఎనక్కి లగెత్తుకురావలసిందే. మనసు నిలవదు మళ్ళీ మనూరూ మనడివీ వొచ్చేస్తేతప్ప. అంచేత మమ్మల్ని అడివికి దూరం సెయ్యకండి మారాజులూ!" అని మేమందరమూ నెత్తీ నోరూ కొట్టుకున్నాం. కాని... లేడెంతేడిస్తే మాత్రం పులి యినిపించుకుంటాదా? ఆ మనిషి పులులు మా గోడు కాతర్చెయ్యనేదు. మా మనసు పట్టించుకోనేదు.

ఆళ్లు మాకు శానా సొమ్మే యిచ్చినారని సెప్పినాను కదండి. అంత సొమ్ము ఒక్కపాలిగా మేం జన్మెత్తి సూణ్నేదండి. అంత సొమ్మండి. ఒక్క పాలంత సొమ్ము కళ్ళజూసేసరికి మాకు మైకం గమ్మీసినాదండి. అసలే మనసు చెదిరున్నాం కొండదిగిపోవాలని. అలాటప్పుడింత సొమ్ము. పిచ్చోడి సేతిలో రాయయినాదండా డబ్బు. అప్పటికే రోడ్డులూ అవీ వొచ్చేసినాయని జెప్పేను కదండి. రోడ్లేకాదండి, యింకా శానా వొచ్చినాయండి. వాటిలో బ్రాంది బడ్డీలు కూడానండి.

"ఇంత డబ్బొచ్చినా ఎప్పటిలాగే జీలుక్కల్లూ యిప్పసారాయేంటి? సీసాల్లోది కంపెనీ సరుకు... విస్కీ... బ్రాందీలు తాగండి. సొమ్ములుండగానే సొర్గం చూడండి. డబ్బు- ఖర్చుపెట్టడానికే... అనుభవించడానికే..." అని ఆ దుకాణాలో ళ్లూరించేసరికి మాలో చాలామందిమి మా డబ్బుని కంపెనీ బుడ్ల కరిపించేసి గోసిపాతల్లోనే మిగిలామండి- ఎక్కడో ఒకరిద్దరు జాగర్తపరులు తప్ప. కొండోళ్లంటేనే గ్యానమూ ముందుసూపు లేనోళ్లని కదండి?

అనుకున్న రోజొచ్చేసినాదండి. మేం బెగిలిపోయిన దినం బూతంలా ఏగంగా వొచ్చి పడిపోనాదండి. లారీలొచ్చి పడ్డాయండి. ఓ లారీనిండా పోలీసులండి. అవసరమైతే

దిగొచ్చులే అని ఎర్ర బుట్టలు నారీలోనే కూకున్నాయండి సోద్యెం జూస్తూ. మాకు తెలిసిపోయిందండి. అయినా ఆపీసర్లు అన్నారండి. "మీమీద జాలితో... మిమ్మల్ని కొండ దిగువ దింపేందుకు, మీ సామాను చేరవేసేందుకు- లారీలేర్పాటు చేశాం. ఎక్కండి, మీ సామానుతోసహా" అంతవరకూ మేం సుకంగా బతికామనే చెప్పాలండి. ఎందుకంటే గూడేలోళ్లందరికీ రోడ్లెయ్యడం కాడినుంచి బిల్డింగులు కట్టడంవరకూ చాలా వాటిలో బండపనులు దొరుకుతూ నాలుగు డబ్బులు కళ్లజూసీవాళ్లం, పిల్లాపాపాతోసహా అందరమూ. అవి కట్టడానికి చెట్లు మాచేతే నరికించేవారండి కూలిచ్చి. కూలికాశపడి... డబ్బుల మాయలో మేము మా రేపునీ రేపటి బతుకునీ తగలెట్టుకుంటున్నామని తెలుసుకోలేకపోయామండి. మా అవసరం తీరిపోగానే మమ్మల్ని తగిలేస్తున్నారన్నమాట. తప్పేదేముంది? డబ్బు తీసుకున్నాం కదా అని... మాటకి... అహ... తెలియకుండా వేసిన ఏలిముద్దరకు కట్టుబడి... కిమ్మనకుండా లారీలెక్కామండి. తట్టా బుట్టా, చెంబూ ముంతా పట్టుకుని. మాలాటి పేదోళ్ళకేం సామానుండి పడిపోతుందీ?

న్యాయంగా అయితే సర్కారోళ్లు వెళ్లగొట్టబడిన మా గిరిజనులకి కొండదిగువ యిళ్ల స్తలాలివ్వాలట. కాలనీలు కట్టించాలట. ఉద్యోగాలు చూపాలట. ఉపాధి కల్పించాలట. కాని, అలాటివేమీ అనుగ్రయించే సూచన్లు మాకేమీ కనపడలేదండి. కొండ దింపి మాకర్మకి మమ్మల్నొగ్గేసిపోనాయండి నారీలు. మావోళ్లలో డబ్బు జాగర్త చేసిన కొద్దిమంది మైదానంలో... వ్యవసాయభ్భూమో, యింటి జాగాయో కొనబోయినారండి తమ డబ్బుతో. పట్నపోళ్లు యీళ్ళన్జూసి పక్కుమని పళ్లికిలించారండి. ఈళ్ళ డబ్బుకి యిల్లు కాదుకదా దాని బొమ్మకూడా రాదట. పొలం మాటదేముడెరుగు, దాని గట్టుకూడా అందదట. అప్పుడర్దమయిందండి. మాకిచ్చిన నష్టపరిహారం శానా నష్టదాయకమయిన యెవ్వారమని. అక్కడ పోయిన భూమిలో సగమైనా రాదిక్కడ. అక్కడ పోయిన యింటికి ఓ గదికూడా రాదు. నలుగురూ కలిసి ఎలాగో ఓలాగ యిరుక్కుందాములే అని నలుగురి డబ్బూ కలిపి ఓ స్తలంకొందామన్నా మా కొండోళ్లకి తమ మజ్జ చోటివ్వమనేశారండి పట్నం వాళ్లు. మాకు బాగా తెలిసిపోయింది. ఇల్లుపోయి సొమ్మొచ్చింది కాని యీ సొమ్ముకి మళ్ళీ యిల్లు రాదని. కొండదిగడమేటి, మా కస్టాలు మొదలయినాయి. ఒక తీరున కాదు, అనేక యిదాల. ఉండడానికి గది లేదు. దున్నడానికి పొలంలేదు. తిరగడానికీ కాయాకసరూ ఏరుకోడానికి అడివి నేదు. ఏదేనా పని చేద్దామని ఎవరినేనా అడిగితే- 'నీకేటి తెలుస్తుంది, కొండోడివి' అని యీసడించేసేవారండి. తెల్లార్నేస్తే గట్టెక్కా చెట్టెక్కా. గిరిజనోళ్లం. మాకీ వూరుకొత్త, తీరు కొత్త, అంతా కొత్తే. ఈ మనుసుల ముకాలే కొత్త. అదో బాద కాగా బతుకుతెరువు కాపించక అంతా అయోమయమూ అడివి పంచాంగమూ అయిపోనాది. సెరువులో సేపనొడ్డున బడేసినట్లు... అడవిలో ఆయిగా తిరిగే పులిని బోనున బందించినట్లు... విలవిలా గిలగిలా ఆడిపోయేవాళ్ళమండి.

కొండ దిగువ కట్టు వేరు, బొట్టు వేరు, తిట్టు వేరు, ఒట్టువేరు. ఈ కొత్తకి కొట్టుకుపోయేవాళ్లమండి మొదట్లో. మైదానంలో మా బతుకు కాదు కదా, మరో బతుక్కూడా! మా అడివిమీద బెంగపోయేది. పెద్దోళ్ళక్కూడా ఏడుపొచ్చీది.

కొండలంటా కోనలంటా తిరగడం... కాయలూ పళ్లూ ఏరడం, మొక్కా మోడూ సవరించడం, తేనెపట్టు తియ్యడం, ఆకూ అలమా తురమడం... యిలాటివాటితో

చేతినిండుగా పనీ ఉండేది, పొద్దూ పొయ్యేది, పొట్టా నిండేది. అమ్మ పుట్టిల్లు గురించి మేనమామకు చెప్పాలా? అడివి సంగతి మీకు నేను చెప్పాలా? అయినా ఎందుకు చెబుతున్నావూ ఈ సోదంతా అంటే... అదో తృప్తండి. ఒకనాటి ముచ్చట్లు కలబోసుకోకుండా ఉండలేనితన మండి. మనసూరుకోదుకద ఆనాటి బతుకు లోకీ మనసుల్లోకీ కొండమీదకీ అడివిలోకీ శాన్నాళ్ళకి మళ్ళీ వొస్తే? సీకటడేసరికింత కలో గెంజో అంబలో తోపో తాగేసి... కల్లో సారాయో పట్టించి... పిల్లా పాపా, ఆడామగా, చిన్నా పెద్దా... సావడిలోకో ఎక్కడో పేరుకోడమూ ఆటో పాటో చిందులో మొదలెట్టడమూ. కొమ్ము బూర ఒకడూదితే కంజిరి కొట్టేవారొకరు. డప్పువేసేదొకరయితే సివమెత్తి సిందులేసే దొక చిన్నది. పదం ఒక రందుకుంటే పాదాలు కదిపేదొకరు. అర్ధరేతిరివరకూ ఆట పాటలే... ఆనందమే. కాలచ్చేపమే. అదీ బతుకంటే. మైదానంలో ఆ మజా ఏదీ? అందుకేనండి మనసుకి దీవి. దేము డెక్కడేనా ఉంటాడు కానండి. అందులోనూ తేడా ఉంటుంది. ఒకచోట దేముడూ మరో చోట దేమూడా ఒకేలా అనిపించరు. సిత్ర మేకాని సచ్చెమేయిది. టౌనుదేముడి తీరు యేరు. విడిగా... ప్రత్యేకంగా... పెద్దపెద్ద ఆవరణలూ పాలరాతితో మరో రాతివో గోడలూ, వాటిల్లో విద్యుద్దీపాలూ టౌను దేముడి కట్టహాసమెక్కువ. అసలా యిగ్ర హాలు కూడా భయంతో సెక్కినట్లు నాగరీ కపు తీరుతెన్నులతోనే ఉంటాయి తప్ప సహజంగా ఉన్నట్లుండవు. దేముడు- ఎక్కడో దూరంగా. విడిగా... గొప్పగా... మనుషులకంటే వేరుగా. అలా అనిపిస్తాడు తప్ప మనదేముడిలా అనిపించడు. టౌన్లలో దేముళ్లు షోకుదేముళ్లూ గొప్పదేముళ్లూ.

మన సంకుదేముడు, మోదకొండమ్మల్లా... మనతోపాటున్నట్లుండరు. చెట్టుకింద... అందరికీ కనపడుతూ... మనదేముళ్లు మన మనుసుల్లాగే మామూలుగా... మనలో దేముళ్ళని పిస్తూంటారు. మనకీ మనదేము డికీ మధ్య దూరముండదు, క్యూలుండవు. ఇక్కడ మనిషీ దేముడూ ఆత్మబంధువుల్లా అతి దగ్గర. సిటీలో అయితే దేముడికీ భక్తు డికీ మజ్జ, డబ్బుదూరం అంటే టిక్కెట్లు కొనాలి. క్యూ దూరం. యిలాటి శానా దూరాలండి. మనమిక్కడ దినదినమూ సంకుదేవుడినో మోదకొండమ్మనో చూడ కుండా ఉండం. ఆ దేముళ్లూ మనలాగే చెట్టుకిందా ఊరిలోనూ ఉంటారు కనక. టౌన్లో దేముళ్లు కూడా కేటాయింపుగా ఉంటారు మరి. మన్లాటి మామూలోళ్లకి ఆ దేముళ్లని చూస్తే బయమేవేస్తుంది తప్ప బక్తి పుట్టదు. మా టౌను బతుకులో మా దేముడూ నేకుండా పోయినాడు. మనిషి జన్మకంత కంటే దౌర్భాగ్యమింకేటి కావాలి.

టౌన్లదంతా మాయబతుకు. ఎవళ్లూ స్వచ్ఛంగా ఉండరు. మనస్ఫూర్తిగా ఉండరు. ఏదో తెచ్చిపెట్టుకున్నట్లుంటారు. నాటకంలో వేషంలా నటిస్తారు. ఆ బట్టలూ ఏషమే. కాకపోతే. ఒకేపు ఎండ మండిపో తుంటాదా? సెమట్లు కారిపోతుంటాయా? అయినా గంగిరెద్దులా సూటూ బూటూ టై మానరు. ఎండలో అలాటి గుడ్డలు దిగేసు కుంటే లోపల సెర్మముడికిపోదూ? మరింత సెమట్లు పట్టవూ? సికాకెత్తి పోదూ? అయినా సరే అదే నాగరకతలు! ఏమైనా అంటే- ఫ్యాషనట! ముకం తప్ప అరిచేతుల్తప్ప మరేటీ కనిపించరాదట శరీరం. ఏమిటో మరి? దేముడిచ్చిన వొళ్లు. దీన్లో సిగ్గుపడాల్సిందేముంది? మొగాడికి మొలగోసీ... ఆడదానికి గుండెలూ నడుం కిందా ఆమేర కాస్త కప్పూ- చాలవూ? చలికీ వొర్షానికీ గుడ్డలు కప్పుకోడమయితే తప్పదు. ఆదారి యేరు. మనిషి కనిపెట్టిన

గుడ్డ ముక్కలు ఆడి సుకానికా, దుక్కానికా? మేము సుకంగా గోసితో ఉంటే ఎక్కిరింపు! ఎవరు ఎవరినెక్కిరించాలి నాయానికి? ఆలోచించరు... ఏం చదువులో ఏటో? ఎందుకూ చదువు, ఏది మంచో తెలుసుకో లేకపోయాక? మేం చెప్పలేం. కొండోళ్లం కదా? ఆళ్లది డబ్బు బలమూ స్తానబలమూ. మేం గోసిపాత తప్ప గుడ్డలేసుకోక పోడాన్ని వాళ్లు అనాగరకతంటూ అసయ్యించుకోడం! మరి... అక్కడ మన- విటికెల పండగుంటుందా? సంకు దేవుడి పండగుంటుందా? గంగదేవుడి పండగుంటుందా? నెలపండగుంటుందా? ఏమీ ఉండవు. మోదకొండమ్మ మొక్కులుండవు. ఇంకెలా బాగుంటయి మన బతుకులు? అక్కడ అంతస్తుల మేడలేతప్ప ఆకుపచ్చని అడివి లేదు. రికార్డులూ మైకులూ తప్ప మన పాటలూ లేవు అడివిపిట్టల సంగీతంలేదు. కోయిల కూతలు లేవు. ఇలకోడి, కీచురాళ్ల అరుపులినిపించవు. హాయిగా కళ్లారా చూసుకుందామంటే పచ్చాగా చెట్టే కనపడ దూరి చివరకు పోతే తప్ప. అంతెందుకు? సందమామను సూసుకుందారన్నా ఏమేడోమిద్దో అడ్డమే అంటే నమ్మండి. మన తిండి! సర్లేండి... దాని గురించి మాటాడక పోతేనే మంచిది. ఎంతసేపూ టీలు... కాపీ నీళ్లు. ఝబ్బు వాళ్లలా బన్నులు, బిస్కత్తులు... కేకులు. ఏమయినా అంటే ప్యాషను:

గూడెంలో అందరమూ ఒక చోట కల సుండే వాళ్లమా... టౌనుకొచ్చాక అలా ఒకే చోట కుదరకా... బతుకుతెరువుల కోసమూ చెట్టుకో పిట్టలా చెల్లాచెదరైపోనాము. దాంతో మనోళ్ల ముకాలే అరుదయిపోనాయి. టౌనులో మనమాటా వినపడదు, పాటా యిన పడదు, ఆటా కనపడదు. అంచేత వాటికి వాచిపోయాను. ఎలాగో కొన్నాళ్లు పళ్లబిగివిన ఆ బతుకు బరించాను. ఇక నా వల్లకాకపోయింది. ఒక్కసారి నా అడవిని, నా అమ్మని, నాకొండని చూసుకొద్దామని బయలుదేరాను. నాకు మరేచోటా బందుగుల్లేరు. ఉండుంటే వాళ్లే పండక్కో రమ్మని పిలవనూ పిలిచేవారు, నేనూ లగెత్తుకెళ్లి నాల్రోజులు వాపితీరేలా ఆ కొండమీద అడవిలో గూడెంలో నా జనం మధ్య ఆయిగా బతికొచ్చేవాడిని. అక్కడినుంచి వెళ్లగొట్టబడ్డాక మాగూడేనికి తోవ మూసుకుపోయింది. మరే గూడేనికీ వెళ్లే అవకాశం రాకపోయింది. దాంతో మరింత బెంగెట్టుకుపోయాను. నాతోపాటు నా కుటుంబమూ వస్తామని వెంటబడ్డారు. టౌనులో ఒంటిపిల్లి రాకాసిలా ఉండి ఆళ్లకి విసుగెత్తింది. మొదట్లో మోజుగానే ఉంది కాని రానురానూ దానసలు రూపం బయట పడుతూ టౌనంటే ఆళ్లకీ అసయ్యమేసేసింది మరి. నేను జూసొచ్చి ఆ పిమ్మట మిమ్మ లని దీసుకెళ్తానని నచ్చజెప్పి ఒక్కడినే బస్సెక్కాను.

అక్కడ జూసేసరికి నాకు మతిపోయింది. ఒక్కసారేమిటో జరిగిపోయిన ట్లింతో బయమేసింది. పై ప్రాణాలు పైనే పొయ్యాయి. గుండెల్లో దేవీసింది. ఏదీ మా అడివి? ఏదీ మా అమ్మ? ఏమైపోయింది మా అడివి? ఎవరెత్తుకుపోయారు? మా చెట్లని... మా చుట్టాలని... మా అన్నదాతలని, వాయుదాతలనీ నామరూపాలు కూడా మిగలకుండా ఏ కరకు చేతులు, కసాయి హస్తాలు నరికేశాయి? మావోళ్లు ఓ మూల పోడెవసాయంజేసుకుందుకు నాలుగు మొక్కల్నరికితేనే నేరమన్నాడే, బొక్కలో తోసేస్తనన్నాడే, ఫైను కట్టించుకున్నడే, చెట్టు నరకడం చాలా తప్పన్నాడే! కొంపములిగి నట్టె గగ్గోలు పెట్టాడే! మరి యిదేటి? కోడలికి బుద్ధులూ సుద్దులూ చెప్పి అత్తే రంకు కెళ్లినట్లు అదికార్లే అడివినెందుకు నాశనం చేశారు? ఒకటికాదు రెండుకాదు ఏకంగా

అడివంతటినీ అంతం జేసేసినారే! ఆళ్లకేం శిచ్చెయ్యాలి? ఎన్ని జన్మలు జైల్లోబెడితే సరి పోతది ఆళ్ల నేరానికి శిచ్చ? ఈ భవనాలూ బిల్డింగులూ! మా చెట్టూ మట్టీ తవ్వేసి మా బతుకుల్నందులో కప్పెట్టేసి మా సమాధి గోతుల్లో పునాదుల్దీసి మా బొమికెల మీద భవనాలు కట్టిందా సర్కారు! దాన్నేటి జేస్తే పాపముంది? దాన్నేటయినా సెయ్యబోతే... కోపం దెప్పిస్తే పశువంటిదే కొమ్మి సుర్తుందేకోపం దీర్చుకుందుకు. సాలీసాలని సొమ్ము మా చేత బెట్టి మాకళ్లుమూసి జెల్ల కొట్టి కుట్రపన్ని మా బతుకుల్నీ మమ్మల్నీ దగాసేసిన ఆళ్లమీద మాకొళ్లు మండకుండా ఉంటదా? గుండె రగలకూరుకుంటదా? ఈ సెంపగొడితే ఆసెంప జూపిచ్చడానికి మేమే బ్రాసి మనుసులంగాని ఏస్త్రుక్రీస్తులమేటి? మా అడవిమీద, మా కొండమీద, మాగుడి సెలమీద, మా గుండెలమీద దెబ్బకొట్టినారే సదుంకున్న ఆపీసర్లు! మాకు సర్రున ఆగ్రహమొస్తే ఆశ్చర్యమేమిటి, రాకపోతే నమ్మక పోవాలగాని.

ఆఫీసుకాడకు నడిచాను వొళ్లు తెలీని కోపంలో వెడల్పయిన అంగలేసుకుంటూ. పెద్దగేటు దాని ముంగల బందూకుతో మడిసి నేను లోనకెళ్లబోతే బందూకడ్డమెట్టి "ఎవరుబే? ఫో అవతలికి" అని కసిరాడు కుక్కనిలాగ. ఎంత దయిర్యమాడికి! ఆడెవడో ఎక్కణ్ణుంచొచ్చి నా అడివిలో నా కొండమీద నా అడివిలో ఆపీసుకట్టుకుని తిన్నింటికి వాసాల్లెక్కెట్టినట్లు నామీదే అదికారం చెలాయిస్తాడా! నాకు వొళ్లు కుతకుతలాడిపోయిందిగానీ అనువుకాని చోటుకదా అని విషేకం దెచ్చుకుని ఆడుబంట్రోతు నాకొడుకేతప్ప అసలదికారీ మూలయిగ్రహమూ కాదుగదా అనుకుని "నాకు పనికావాలి" అన్నాను. వాడొక్కసిటం ఆలోచించి బందూకు దింపి నావేపోసారి జూసి...

"అక్కడికి బోయి అడుగు" అన్నాడు వేలితో ఓ బిల్డింగు చూబించి. నేనటునడిశాను. ఆ గది పడవంతుంది. ఆ గదిలో పెద్ద బల్లుంది. దానికవతల ఓ కుర్చీపీటమీద ఎవరోబాబు దొరలా కూర్చొని సిగరెట్ కాలుస్తున్నాడు. అతన్నెత్తిమీద పట్టపగలే లైటెలుగుతోంది. అతగాడు మాలాటోళ్లతో మాట్లాడితేనే నోటి ముచ్చాలు రాలిపోతాయన్నట్లు నావేపోసారి చూసి ఎవర్నువ్వు? ఎందుకొచ్చావు? అనడుగుతున్నట్లు కళ్లెగరేశాడు. దణ్ణమెట్టి నా దౌర్భాగ్యం సెప్పుకున్నాను.

"చదువుందా? ఏం పనిచెయ్యగలవ్?" అనడిగాడు.

"బాబూ! ఒకప్పుడీ కొండా అడివీమావే. ఇక్కడి సెట్లని నరికిందీ, కొండల్నీ బండల్నీ పిండిజేసిందీ, రోడ్లేసిందీ, మిద్దెలు కట్టిందీ నేనూ నాలాటి మావాళ్లే" అన్నాను.

అంతావిని, "ఇప్పుడలాంటి బండ పనుల్లేవు. కొండపనుల్లేవు. ప్రాజెక్టు నిర్మాణమైపోయింది. మీలాంటివాళ్ల అవసరంలేదు పో" అనేశాడొక్క ముక్కతో కుక్కని కొట్టినట్టు. నా గుండె భగ్గుమనిమండింది. ఆళ్ల కుట్ర, దగా, మోసం తేటతెల్లమయిపోయాయి పూర్తిగా. రంగుల రూపాయినోట్లతో మా బతుకులు బూడిదజేశారు. సింహాసనమెక్కిస్తున్నట్లు నటించి సమాదిలోకి తోసేశారు. సందమామని జూబిస్తూ స్మశానంలోకి నడిపించారు. మమ్మల్ని నిలువునా ఎర్రెదవల్నీ పిచ్చి నాయాళ్లనీ జేసొదిలారీ చదువుకున్న బాబులు. అదే అడిగాను నిలదీసి.

"దేశసౌభాగ్యంకోసం ఇక్కడ ప్రాజెక్టు కట్టాం. ప్రాజెక్టు కట్టడంకోసం మిమ్మల్నికాళీ చేయించాం నష్టపరిహారం చెల్లించి. ఆమాత్రం త్యాగాలు చెయ్యకపోతే ఎలా?" అన్నాడు.

"ఏటిబాబూ అంటారు? దేశసౌబాగ్గెంకోసమా? త్యాగాలా! సెయ్యాలి బాబూ..

సెయ్యాలి. దేసెంకోసం ఏమయినా చెయ్యాల్సిందే. కానీ నాకు తెలవకడుగుతాను దేసెమంటే ఏటిబాబూ? దేసెమంటే మేం కామా! మడుసులంకామా? మడుసులకి మనుగడే పోయి పస్తులకీ ఆకలి సావులకీ సిక్కడిపోయే పరిస్థితి పడితే, దౌర్భాగ్యమొస్తే యిక మరి దేససౌభాగ్గెమేటి, అబివృద్దేటి? మడుసుల్ని మట్టేసి, దేసెం బాగుపడ్డమెలా జరుగుతుందసలు? ఒక్క పాలాలో సించండి. కొండోళ్లమయినా మేమూ మనుసులమే, కొండలూ అడవులే అయినా అవీ యీదేసెంలో బాగాలే. మా బాగూ బతుకులూ మాత్రం సర్కారు కక్కర్లేదా? బాబూ! మేమేమీ పెద్దాశలకీ పెద్ద కోరికలకీ పోడంనేదు. కోరరానివీ కొరగానివీ అడగడంనేదు. టౌన్లంట ఉంటామనడంనేదు. సిలుగ్గుడ్డలడగడంనేదు. వరన్నం వరమిమ్మనడంనేదు. సింతగింజల జావేచాలు. మామిడి టెంకలంబలే మహాప్రసాదం. మొలకోగోసేచాలు. బవనాలుమాకేల? గుడిసెచాలు. ఇస్కీ అక్కర్నేదు. ఇప్పసారాశాన. కొండల్లోనూ బండల్లోనూ ఉంటాం. సేతికింతపనీ, నోటికింత కూడు. ఇంత సిన్న బతుకు బాబూ మేము కోరుకునేది. సర్కారోళ్లు పిచ్చుకల్లాటి మా కొండోళ్లమీద ఎంత పెద్ద బ్రెమ్మాస్త్ర మేసీశారో చూడండి" అన్నాను.

అంతే...!

"షటప్.... ప్రభుత్వాన్నే నిందిస్తావురా రాస్కెల్!" అంటూ చెయ్యెత్తాడా ఆఫీసరు. చెంపమీద కొట్టాడు. అసలే కడుపుమంటమీదా గుండెమంటమీదా ఉన్నానేమో అవమానాన్ని మింగుకోలేకపోయాను. నేనూ కొట్టాను తిరిగి. అదేనా ఎందుక్కొట్టానని? పొట్టమీదకొట్టారుకోక మనసుమీదకూడా మాటిసిరాడని, అవమానం చేశాడని. అంతే తప్ప ఆరిమీద నాకు పగా, ద్వేసమా? ఆరేమయినా నాకు బందువా, సుట్టమా, పడుండడానికి? అదే చెప్పాను కోర్టులో అన్నట్లు... ఆర్ని నేను సంపబోయానని నామీద నేరం బనాయించి నన్ను పోలీసులకప్పగించేశారువారు ఒక్క దెబ్బ కొట్టినందుకు. కోరటులో నేనదేచెప్పాను. సెంపమీద కొట్టినోడి సెయ్యిరిచీయాలన్నంత కోపమొస్తే తప్పా? ఆరునాకు తెలవనే తెలవరే, చంపాలనుకునేంత శత్రువులేలౌతారు? నన్ను కొట్టారన్న కోపంలో సెయ్యెత్తేనే తప్ప ఆర్ని చంపాలని నా ఉద్దేశం ఎంతమాత్రం కాదండి. అయినా మేం కొండోళ్లం. సంపడానికి మాకు తెలిసిన యిదానమొక్కటే. బాణమేసి కొట్టడం. ఆటవికులం సాటి మనిషిని సిన్న కారణానికి సంపమండి. అని మనవి జేసుకున్నా నాబంనేకపోయింది. ఈదేసెం, ప్రబుత్వం, కోరుటులు, ఆపీసర్లు అన్నీ డబ్బున్నవోళ్ల పచ్చమే తప్ప మనలాటి బడుగు జీవుల ముకాలు చూసేదెవరు? న్యాయానిక్కూడా కలవోరన్నా, అదికారులన్నా వలపక్షమే. నన్ను జెయిలుకంపేశారు నేరంచేశానని. రెండేళ్లు అదిగో.. అక్కడినుంచే యిటువొచ్చేను. యిక్కడ మావాళ్లున్నారుకదా! వాళ్లనీ కొండనీ అడివినీ గూడేన్నీ అన్నీ ఓసారి చూసి తరించిపోదామని.

అయ్యలూ అమ్మలూ! మీ పరిస్థితి చెప్పాడు మావోడు. అందుకే మీరు నాలుగు డబ్బులకాశపడి కొండదిగిపోడాని కొప్పుకుంటే రేపు మీరూ నాలాటి బతుకే బతకవలసొస్తుందని ఎచ్చరించడానికనే నా సొద యింత యివరించాను. ఓరకంగా రేపు మీరెలాటి బతుకు చూస్తారో యివరంగా చెప్పాను. మీవశంలో ఉంటాదనుకోనుకాని అలాగే వీలుపడితే ఎంతమాత్రమూ మీగూడేలు కాళీ చెయ్యకండి. కొండనీ అడవినీ వదలకండి. కొండదిగి టౌన్లలోకెళ్లారో మీ బతుకు బండలే"

అని ఓ నమస్కారం పెట్టి పక్కకి తప్పు

కున్నాడతను.

మరునిముషం ప్రేక్షకులలోంచి పాతికేళ్ల యువకుడొకడు లేచి నిలుచుని "నాకు మాట్లాడాలనుంది" అన్నాడు పెద్దల వేపు చూస్తూ.

"తప్పకుండా" అంటూ వాళ్లు వెంటనే అత న్ననుమతించారు. అతను ఆవేశంగానూ ఉద్రేకంగానూ ఉన్నాడు.

"అందరికీ నమస్కారాలు. మీరందరూ బీమరాజుకథ విన్నారు. నేనూ యిన్నాను. అయితే నా ఉద్దేశాలు మరోలా ఉన్నాయి. నేను అప్పుడప్పుడూ పేపరింటాను. కొన్నిషయాలు తెలుసుకుంటూ ఉంటాను. వాటినిబట్టే నేను చెబుతున్నాను. మనదే శాన్ని యాపారంజేసుకుంటామనొచ్చిన ఇంగ్లీ షువాళ్లు మెల్లగా ఆక్రమించేసుకుని అది కారం లాగేసుకున్నారు. అక్కడనుంచీ మన్దే శాన్ని దోచీసుకోడం మొదలెట్టారు. మన వజ్రాలేమిటి, పంటలేమిటి అన్నీ వాళ్ల దేశం తరలించేస్తూ మనని బికారులని చేసేశారు వందల సంవత్సరాల అదికారంలో. అది బరించలేక మనోళ్లు వాళ్లమీద రకరకాలుగా తిరుగుబాటు చేశారు. అల్లూరి సీతారామ రాజు, గాంధీ... అలాటి తిరుగుబాటు నాయకులే. మన ప్రజలు చాలా కష్టపడ్డాక ఎందరో దేశంకోసం చచ్చిపోయాక స్వతంత్రం వొచ్చింది. తెల్లదొరల పాలన అంతమయింది. స్వతంత్రమయితే వచ్చింది కానీ దేశం చాలా బీదస్థితిలో ఉంది. ప్రపం చంలోని యితరదేశాలెన్నింటికంటో మన దేశం వెనుకబడిపోయింది. పైవాళ్లు పాలించి దోసేసుకున్న దేశంకదామరి? ఒక వేపు పరిశ్రమలను అబివృద్ధి చేసుకుంటూ ముందుకి సాగిపోతున్నాయి యితర దేశాలు. మనదేశం వ్యవసాయమ్మీదే ఆధా రపడి జనాభా పెరుగుతూ బీదగా ఉండిపో యింది. అప్పుడది చూసి మన మొట్టమొ దటి ప్రధానమంత్రి నెహ్రూగారు దేశం అబివృద్ధి సాధించాలంటే పరిశ్రమలు మొదలు పెట్టాలన్నారు. ప్రారంబించారు. కాని పరిశ్రమలకి కరంటు పవరుండాలి. అది కొండలమీద నీరున్నచోటే పుడుతుంది. అంచేత కొండలమీద జలమున్న మనలాటి గూడేలని కాళి చేయించి ప్రాజెక్టులు పెడు తున్నారు.

దానితో దేశంకొంచెం ముందుకెళ్లింది. ఇది సరిపోదు. మనదేశంలో జనం ఎక్కు వకదా? ఇంకా ఎన్నో ప్రాజెక్టులురావాలి. అంటే మనలాటి గిరిజనులు గూడేలు కాళీ చెయ్యాలి. చేద్దాం. మనదేశంకోసం మనం కాకపోతే మరెవరు త్యాగాలు చేస్తారు? అయినా యివన్నీ మనమంచికే. మనం సుకపడాలనే ప్రబుత్వం ప్రాజెక్టులు కట్టి స్తూంది. మనకోసం కాకపోతే దానికేటవ సరం? మనమందరమూ దేశంకోసం మన గూడేలని త్యాగం చేద్దాం. దేశంకోసం చావ డమయినా మంచిదే. వాళ్లూవీళ్లూ చెప్పినట్లు టౌనులు చెడ్డవేంకావు. కొండ దిగువ వూళ్లలో బతుకు మరోలా ఉంటుంది మన లాకాక. దాన్నర్థం చేసుకోలేక దాంతో రాజీ పడలేక టౌన్లని తిట్టుకుంటున్నాం అంతే. ప్రబుత్వం మన గిరిజనులకోసం ఎన్నో చేస్తుంది. పేపరువింటే తెలుస్తుందది. మనకి చదువు ఉచితం. ఉద్యోగాలు ముందు మనకేయిస్తుంది. పుస్తకాలు ఊరి కేయిస్తుంది. ఇవన్నీచాలవేటి? "

"అవన్నీ విండానికి తియ్యగా ఉండేక బుర్లు. పేపరులో బోగట్టాలంటే మబ్బుల్లో నీళ్లు. అవినమ్మి గూడెం కాళీ చెయ్యడమంటే మబ్బులో నీళ్లుజూసి ముంతొలకబోసుకో డమే. నువ్ జెప్పినట్లు... ప్రబుత్వానికి గాని మన గిరిజనులంటే ముద్దూ జాలీ అయితే అది మననేం ఉద్ధరించేస్తుంది? హరిజ నులు గాంధీకి ముద్దంటే వొప్పుకుంటాంగాని గిరిజనులంటే ఎవరికీ ముద్దుకాదు"

ఉపన్యాసంకాస్తా వాగ్వాదంలోకి దిగింది.

అయినా పెద్దలు కలుగజేసుకోలేదు. ఎలా అయితేనేం ప్రజాభిప్రాయం బయటపడు తుందికదా అని ఊరుకుండిపోయారు.

"మన గిరిజనులకోసం కొండలమీదకి రోడ్లేయించారుగా"

"వేయించారు. ఎందుకు? మనకోసం కాదు. కొండలలో కరక్కాయ పసుపు, చింత పండు, అల్లం, పనసకాయల్లాటివి పండు తాయి. పిప్పళ్ళు, ఆయుర్వేద మూలికలు లాటివి దొరుకుతాయి. ఇవన్నీ పట్నాలకి తరలించాలంటే రోడ్లుండాలి కనుక ఏశారు. అంతేకాని మనమీద అభిమానమూడి పడి పోయికాదు. కాకుల్ని కొట్టి గెద్దలకెయ్యడ మంటారే అదే"

"వాళ్ల ప్రభుత్వం... మంచిచేసినా నువ్వు సరిగా అర్థం..."

"ఏంకాదు పోనీ గిరిజనకార్పొరేషనంటూ మననుద్ధరించేస్తామని పాడేరు, మాడుగుల లాటిచోట్ల ఆపీసులు పెట్టారుకదా. ఇంకే ముంది మీ సరుకుకి సరసమయిన ధర, మీకస్టానికి కిట్టుబాటు కూలి అన్నారు. కాని జరుగుతున్నదేమిటి? మనం తీసుకెళ్లిన సరుకుకి తప్పుడు తూకాలూ... అవకతవక డబ్బులూ... ఆ గుమాస్తాలూ ఆళ్లూ మన్ని చేసే అన్నాయాలిన్నీ అన్నీనా? మనని బాగు చెయ్యడంకాదు. అవి వాళ్లు బాగుప డ్డానికి, డబ్బు జేసుకోడానికే. ఆ గుమాస్తాలే మనకీ వర్తకులకీ మధ్య దళారిలైపోతారు కద? మరింకా అవేటో ఆపీసులు గిరిజనా బివృద్ధి సంస్తలో ఏటో ఆ ఆపీసర్లాడ ఉండనే ఉండరు. వారానికో పదిరోజులకో సుట్టపుసూపొస్తారు. మామూళ్లు నొల్లుకుపో తారు. మనకిచ్చే అప్పుల్లో ఎంతలంచం... ఎన్ని తిరకాసులు! అసలా ఆపీసులు పెట్టింది మనకోసమే అంటారుకాని వాటిలో మనం ధైర్యంగా అడుగుపెట్టే వాతావరణ ముంటుందా? మననెంత అలుసుగా జూస్తారని కొండోళ్లంటూ. కడుపు సింపు కుంటే కాళ్లమీదే పడుద్ది. పేపర్లకేటి... ఎన్నేనా రాస్తాయి రాయించుకునేవోళ్లకి. అసలు సంగతి లోగుట్టు మనకెరుకేకదా? చెప్పడంలో గనమే కానీ చేతల్లోనే నాసి మన ప్రభుత్వం. కాదనగలవా?"

ఆ సవాలుకి సమాధానంలేనట్లు ఆ యువకుడు కొండదిగిపోయాడు. అప్పటికీ అతను గొణుక్కుంటూనే ఉన్నాడు. ప్రభుత్వం ఉద్దేశంమంచిదే. ఎటొచ్చీ ఆపీ సర్లూ గుమాస్తాలే లంచగొండులూ అవినీతి మనుషులూను. కంచే చేనుమేసే చందం"

ఇంకెవరూ మాట్లాడతామని ముందుకి రాలేదు. దాదాపుగా సభ ముగిసింది. అదే చిట్టచివరి సమావేశం... గిరిజనులు గూడేలు వదిలి తమ యిళ్లూ వాకిళ్లూ బూమీ పుట్రా ప్రభుత్వానికమ్మేసుకుపో వాలా మానాలా అనే విషయంమీద చర్చ లకు.

సహజంగానే ఏకాభిప్రాయానికి రాలేదు వారు. రాజుపాకలలో ప్రజాభిప్రాయం తెల్సుకుందుకనుసరించబడిన పూసల విధా నమే ప్రతిగూడెంలోనూ అవలంబించబ డింది కనుక ప్రతిగూడెంలోని పూసల బుట్ట లనూ రాజుపాకల పట్టుకు రమ్మని కోరాడు పూజారి గంటందొర. చుక్క ముహూర్త గాళ్లు ఏ రోజుబుట్టలని తేవాలో చెప్పారు. దానితో సభ నిజంగా ముగిసింది. అతిథు లకు ఆ గూడెం వాళ్లు తిళ్లుపెట్టారు. సారా పోయించారు. పడకలేర్పాటు చేశారు. గిరి జనులదెప్పుడూ నలుగురితోపాటు నారా యణా తత్వమేకనుక బుట్టలలోని పూసలు తేల్చబోతున్నాయి వారివారి మనోగతాన్ని. వారి చాలా పండగలకిలాగే బుట్టలలోని పూసల లెక్కింపుకి కూడా శుక్రవారం నాడే ముహూర్తం నిర్ణయించారు చుక్క ముహూర్తంగాళ్లు. శుక్రవారమంటే మరీ దూరంగా ఏమీలేదు. ఈ వేళకాక మధ్యలో

రెండు రోజులంతే. ఆవేళ ఉదయం తొమ్మిది గంటలకు పూసలలెక్కింపు. ఆ రాత్రి ఎవరికీ సరిగానిద్ర పట్టలేదు ఏమవుతుందో అనే దిగులుతో.



శుక్రవారం ఉదయం లేస్తూనే రాజుపాకల గూడెం గిరిజనులు సంకుదేముడికి దణ్ణాలు పెట్టుకున్నారు. ఆరోజు గూడెంలో ఎవరూ అడివికికాని పొలాలకిగానీ పనులకు వెళ్లలేదు. ఎంతటెంతట టముకు చాటింపు వినపడుతుందా సావడికి లగెత్తుదామా అని ఎదురుచూస్తూ చూస్తూనే కాలకృత్యాలు తీర్చుకుని ఉన్న కలో అంబలో తాగి తయారవుతున్నారు.

టముకు కోసం ఎదురు చూస్తుంటే దబుకు దబుకుమని డప్పు వినపడడానికి బదులు బొంయిమంటూ హారన్‌లూ జీపు శబ్దాలూ వినిపించాయి. వాళ్లు త్రుళ్లిపడ్డారు. తామేం చేస్తున్నారో తమకే తెలియని రీతిలో వాళ్లు చావడివేపు పరుగులు తీశారొక్కుమ్మడిగా. అప్పటికే అక్కడ నలుగురైదుగురు వరకూ అదికారులూ కొన్ని ఎర్రటోపీలూ కూడి ఉన్నారు. అప్పటికే అక్కడికి మిగిలిన గూడేలనుంచి పూసల బుట్టలు వచ్చేసి ఉన్నాయి. ఆగూడేల నుంచి చాలా మంది గిరిజనులూ వచ్చి ఉన్నారు. పూజారి లాంఛనంగా టముకు తిప్పించాడు. బీమన్న అధికారులతో మాట్లాడుతున్నాడు.

చుక్క ముహూర్తగాళ్లలో ఒకడు గాలిలోకి తుపాకి పేల్చాడు మూహూర్తం ఆసన్నమయిందన్న సూచనగా. అందరూ బుట్టలు తెరిచారు. రెండు రంగుల బుట్టలనూ రెండువేపులా ఉంచి ఎటువేపు వారా పూసలను లెక్కించసాగారు. ఇక్కడ కూడా నాగరికత తన మాయోపాయాలు ప్రయోగించకపోలేదు. ప్రజాభిప్రాయ సేకరణ పూసల ద్వారా జరుగుతుందని బీమన్న చెప్పగానే వారు పూసలనొక బుట్టలోంచి మరో బుట్టలోకి తారుమారు చేసే ఉపాయంతో ముందుకొచ్చారు. వారి కోసం తామే లెక్కించి పెడతామన్నారు. కాని గిరిజన పెద్దలు గౌరవ మర్యాదలతో వారి ప్రతిపాదనలనూ స్వచ్ఛంద సేవలనూ తిరస్కరించారు. లేకపోతే ఎన్నికలలో లాగ రిగ్గింగులూ తప్పుకౌంటింగులూ వంటివి అక్కడా చోటు చేసుకునేదే.

పూసల లెక్కింపయిపోయింది. ఐదింట మూడు వంతులు 'కొండవిడచివెళ్లం' అనీ, రెండు వంతులు మైదానాల్లోకి వెళ్తామనీ తమ నిర్ణయం తెలిపారని తేల్చాయి పూసలు.

"ఎక్కువమంది కొండవిడిచి పోడానికిష్టపడని వారేకనుక..."

ఏదో చెప్పబోతున్న పూజారికి అధికార్లు అడ్డంపడి "మనదేశ సంప్రదాయం మైనారిటీ హక్కులను కాపాడడం. అంచేత.. ఐదింట రెండు వంతులుకల కొండవిడిచి వెళ్తామనే వారి నిర్ణయమే శిరోధార్యం" అన్నారు.

గిరిజన పెద్దలు నివ్వెరపోయారు. "ఇదెక్కడి న్యాయం? ఎక్కువమంది మాటా మనసూ కాదని.. తక్కువమంది అభిప్రాయాన్నే అందలమెక్కించడం... ఎలాటి సబవు? "

"మన ప్రజాస్వామ్యదేశంలో..." అంటూ మరొక పెద్ద వారికేసి చూశాడు, అందరికీ ఒక చిరునవ్వు పారేసి గీతోపదేశంగావించే కృష్ణపరమాత్ముడి భంగిమననుకరిస్తూ,

"మీరు మంచి సందేహాలే వెలిబుచ్చారు. విద్యావిహీనులూ, వెనుకబడినవారూ, దేశం ఎటుపోతూందో తెలియనివారికీ రావలసిన సందేహాలే మీకూ రావడం సహజమే. సమంజసమే. అందుకే ప్రభుత్వం మీకెలాగయినా నాగరికత నేర్పాలనీ, నలుగురిలా





చేయాలనీ నడుము కట్టింది.

ప్రజాస్వామ్యమంటే ఏమిటి? నూరుమం దిలో ఏభైవొకరే అభిప్రాయం వెలిబుచ్చితే దానినే తీసుకోవడం. ఔనా? "

"ఔను"

"కాని అది పొరపాటు. ఎందుచేత నంటే... ఒక చెట్టుకి ఆకులెక్కువుంటాయా, కాయలెక్కువుంటాయా? నిస్సందేహంగా ఆకులే. కాని కాయలని బట్టే కద చెట్టుకి విలువ? అంటే అర్ధమేమిటి? ఏవి తక్కువో అవే ఎక్కువ విలువైనవని. మనుషులలో తెలివైనవాళ్లు తక్కువ మందుంటారు. తెలివి తక్కువ వాళ్లెక్కువమందుంటారు. ఎవరి మాటను బట్టి నడుచుకోవాలి? తెలివయినవారి మాటని బట్టేకదా? అంటే- సంఖ్య తక్కువున్నవారి అభిప్రాయమే శిరోధార్యమనికదా? అలాగే రాళ్లెక్కడ పడితే అక్కడే ఉంటాయి. కాని రత్నాలు? అరుదుగా ఉంటాయి. ఎక్కువ సంఖ్యలో ఉండే రాళ్లకెక్కువ విలువా, అతితక్కువ సంఖ్యలో ఉండే రత్నాలకెక్కువ విలువా? రత్నాలకే కదా? అలాగే ఇక్కడ కూడా కొండదిగి మైదానాలలోకి వెళ్దామనే వివేకుల సంఖ్య తక్కువయినా వారి మాట పాటించడమే శ్రేయోదాయకం.

అసలు మన దేశానికి ప్రపంచ దేశాలలో గౌరవముందంటే ఎందుకో తెలుసా? మన దేశంలో మాత్రమే అల్పసంఖ్యాకులకు అధిక సంఖ్యాకులకంటే గౌరవాలూ... సదుపాయాలూ... హక్కులూ... వెసులుబాట్లూ ఎక్కువ. అలాగే మీరు అల్పసంఖ్యాకులయిన కొండ దిగిపోదామనే వారి నిర్ణయాన్ని ఔదలదాల్చాలి"

నిర్ఘాంతపోయారు గిరిజనులు. వాళ్లకీ తర్కం కొరుకుడు పడడంలేదు. కొండ దిగిపోదామని భావించినవారు అధికారులకు వొత్తాసుపలుకుతూ "ఔను... అలాగే చెయ్యాలి" అంటూ గోల చేయసాగారు, అధికారుల దన్ను చూసుకుని.

అక్కడివారు రెండుగా చీలిపోయారు నిలువునా. అధికారులకు మహదానందంగా ఉంది. వారినంత సులభంగా విభజించగలిగినందుకు. వారికి తెలుసు- ఇక తమపని నల్లేరుమీద నడకంత సులభమని.

తన వాక్చాతుర్యంతో గిరిజనుల మతులు పోగొట్టిన ఆ ఆఫీసరుని మిగిలినవారు అభినందించసాగారు, ఆంగ్లంలో. "ఏం లాజిక్కేం లాజిక్కు"

"ఏం సమయస్ఫూర్తి!? "

"ప్రజాస్వామ్యానికి మీ వివరణ అమోఘం"

"మైనారిటీల గురించి బలే చెప్పారు"

"మాట చమత్కృతంటే ఇదీ! మీరు అసాధ్యులు. బ్రహ్మిని తిమ్మి తిమ్మిని బ్రహ్మి చేసేయగలరు మీ తర్కంతో"

"మీలాటివారు రాజకీయాల్లో ఉంటే కనీసం క్యాబినెట్ మినిస్టరు కావడం ఖాయం"

"మీనుంచి మాలాటివాళ్లు చాలా నేర్చుకోవాలి"

"ఎలాటి పరిస్థితినెలా తిప్పారూ! జరిగినది యధాతథంగా రాస్తే మీకు ప్రమోషన్ ఖాయం"

"పొగడ్తలాపండిక. పని చూడండి" అన్నాడాయన ముసిముసి నవ్వులు నవ్వుతూ.

"మాకేమయినా పని మిగలనిస్తేగా మీరు? "

"ఫొటోగ్రాఫర్‌ని పిలవండి"

పిలుచుకొచ్చాడొక ఆఫీసరు.

"చూడూ! మేము డబ్బిస్తున్నప్పుడూ... వారు కాగితాలమీద సంతకాలు చేస్తున్నప్పుడూ ఫొటోలు తియ్యాలి. వాళ్లు వేలిముద్ర వేస్తూంటే చిరునవ్వు నవ్వమని మరీ

ఫొటో తియ్యాలి. అర్థమయిందా? ఇంగ్లీష లోనే చెప్పు, నీకేమయినా అనుమానా లుంటే" అన్నాడు ఆంగ్లంలోనే. ఫొటోగ్రా ఫర్ ఇంగ్లీషులోనే తల ఊపాడు.

"మీరు చాలా అలసిపోయారు. ఈ బిస్కట్లు తింటూ బీడీలు కాల్చండి" అని ఒక అసిస్టెంటుకి సైగ చేశాడు. అతను అక్కడున్న అందరికీ బిస్కట్ల పాకెట్లూ, బీడి కట్టతో అగ్గిపెట్టెలూ పంచసాగాడు.

పంపకం జరుగుతున్నంతసేపూ అక్కడ గోలగోలగా మారిపోయింది.

భీమన్న, మహారాజూ, గంటందొరా బిస్కట్ల పాకెట్‌లు తీసుకోలేదు. కానీ బీడీలు మాత్రం అందుకుని అంటించారు. ఆడా మగా పెద్దవాళ్లందరూ సామూహిక ధూమపానం మొదలుపెట్టేసరికి ఆ ప్రాంత మంతా పొగమయమయింది. కొన్ని నిము షాలవరకూ అక్కడ ప్రశాంత వాతావరణం నెలకొనలేదు. అప్పుడు-

"గంటందొరా! పట్టాలు తెప్పించండి. ఇష్ట మయినవారు భూములను ప్రభుత్వానికి బదిలీ చేస్తారు" ఆజ్ఞాపిస్తున్నట్లే అన్నాడొక ఆఫీసరు.

గంటందొర అప్పటికే మతిపోయి మెదడు పనిచేయక అయోమయంలో ఉన్నాడు. కనులముందు పరిస్థితులూ, గిరి జనులూ తీసుకుంటున్న మలుపులను ఊహించలేకా జీర్ణించుకోలేకా. అతను యాంత్రికంగా తనవారిని పంపి గూడెం లోని అందరివీ, అన్ని పట్టాలూ తెప్పిం చాడు నిస్సహాయంగా.

ఆఫీసరు బ్రీఫ్‌కేసు తెరిచి నోట్లకట్టలు బయటికితీసి సరిచూస్తున్నట్లుగా ఒక కట్టను గాలిలో రెపరెపలాడించాడు. రంగు రంగుల కొత్త ఐదువందల రూపాయల నోట్లకట్టలు.



"ఐదువందల నోట్లు. ఆ మధ్యనే విడు దల చేసింది మన ప్రభుత్వం. మీకిస్తాం. ఆఁ... గూడెం వదలడానికిష్టమయిన వారందరూ ఇటుపక్కకొచ్చి వరుసగా నిలబ డండి" అన్నాడాఫీసరు. గిరిజనులలో కొంద రిటు వచ్చి వరుస కట్టారు.

"మీ పేరు? "

"కొండడు"

"గూడెం? "

"రాజుపాకల"

"నీకు భూముందా? ఇల్లుందా? "

"భూముంది. ఇల్లుంది"

"గంటందొరగారూ ఇతని పట్టా ఇవ్వండి'

చకచక కాగితాలమీద వేలిముద్రలు వేయించేస్తున్నారొకరు. మరొకరు డబ్బిచ్చే స్తున్నారు. ఫొటోగ్రాఫరు చిరునవ్వు నవ్వ మని టకటక ఫొటోలు తీసేస్తున్నాడు.

పూజారి కప్పటికర్థమయింది. మిగిలిన గూడేల భూమి, ఇళ్లపట్టాలు కూడా పరిశీ లించాలని ముందుగానే రాజుపాకల తెప్పించి తన దగ్గరెందుకుంచారో అధికా రులు.

ఎంత ప్రణాళిక వేసి చేశారూ ఈ ఘోరం.

గూడెం వదలడమిష్టంలేదని ఆ బుట్టలో పూస వేసినవారు కూడా ఆ కొత్త ఐదేసి వందల రూపాయలనోట్ల మాయాజాలం లోనూ, మోజులోనూ ఇటు వరుసలోకి వొచ్చెయ్యసాగారొకరొకరూ మెల్లగా దొంగల్లా. అది గమనిస్తున్న ఆఫీసరు ఆనందం పట్టలేకపోతూ తనవారిని త్వరపె డుతూ సిగరెట్ అంటించాడు. గిరిజనుల భూములూ, ఇళ్లూ ప్రాజక్టుకి ధారాదత్తం చేయబడుతున్నాయ్. బ్రీఫ్‌కేసులోని నోట్లక ట్టలు తొందరగా తరుగుతున్నాయ్. పోలీ సులు జీపులచుట్టూ నిలబడీ కూర్చునీ

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రవంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల నంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని వంపవలసి వుంటుంది.

★ ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు నరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో వంవడం మంచివద్ధతి.

★ అవిధంగా నవలలు 'చతుర'కు సరివడా లేకపోయినట్లయితే అయా నవలలు వరిశీలనార్హాలు కావవి గమనించగోరుతున్నాం.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి వంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతవరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియవరచడం, లేనివక్షంలో తిప్పివంవడం జరుగుతుంది.

★ ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే వంవబడుతుంది.

ఎడిటర్:

## చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

బీడీలు కాల్చుకుంటూ కబుర్లాడుకుంటు న్నారు.

★ ★ ★

గంటందొర రాముడిని తలుచుకుంటు న్నాడు.

అప్పుడెప్పుడో ఒకనాడు పదిమంది కాషా యస్వాములు రాజుపాకలకొచ్చారు. వారు ఒక పెద్ద శ్రీరాముడి ఫొటో పట్టుకు మరీ వొచ్చి.. "అయోధ్యలో రామాలయం కట్టి స్తున్నారు. దేశంలోని ప్రతి గ్రామంనుంచీ ఆ ఆలయ నిర్మాణంలో ఒక్కొక్క ఇటుక వేయాలని శిలాన్యాస కార్యక్రమం తల పెట్టాం రామభక్తులం. రూపాయిచ్చి రాముడి బొమ్మ తీసుకొండి. మీ వూరి పేర ఒక ఇటుక ఇవ్వండి. అయోధ్య తీసుకెళ్తాం దుకు" అన్నారు.

"రూపాయిస్తాను కానీ ఇటుకలు లేవే మా గూడెంలో. పోనీ రాయి పనికొ స్తుందా? కావాలంటే రాయినే ఇటుక ఆకా రంలో చెక్కించి సమర్పిస్తాం" అన్నారు.

ఆ మాటలకు పూజారి కదలిపోయాడు.

"రామా, ఓ రామా నీ చరిత్ర రాసిన రామాయణకర్త అయిన వాల్మీకి బోయ వాడు. నీ చరిత పాటలు కూర్చి గానం చేసిన రామదాసు- అరణ్యవాసి. వారిపై పక్షపాతంకొద్దీ అయినా మా గిరిజనులను చల్లని చూపు చూడవొచ్చునే. మీ రోజుల రాజులకు వాన ప్రస్థాశ్రమం సమకూర్చినది అడవులేగా? మీ సీతాదేవి లవకుశులకు జన్మనిచ్చింది అరణ్యంలోనే. మునులకూ, తపసులకూ నెలవులు అడవులే కదా? అలాటి అడవులను నాగరికులు నాశనం చేస్తామని వొచ్చారే. వారి సారించి వారిని వెళ్లగొట్టవేం? మామీద నీకు కనికరం లేదా? **ఈ అడవులను బ్రోవవా?** ఈ గిరి జనులను **కావవా?** పూజారి కనులనుండి ధారలుగా కన్నీళ్లు.

సరిగ్గా అదే క్షణంలో-

ఎక్కడినుంచో కేకలు... "అన్నలు... అన్నలు... అన్నలొస్తున్నారు"

పూజారి హృదయంలోకి ఆనందం. కళ్ల ల్లోకి ఒక్కసారి జీవం.

సరిగ్గా సమయానికి అన్నలు.

అన్నలు వారి ప్రయోజనాలకోసమైతేనేం, వారి కార్యకలాపాలు సాగించుకునే సౌలభ్యం కోసమైతేనేం. కొండలూ, అడ వులూ, గిరిజనులూ, గూడేలూ ఉండాలనే పట్టుదల చూపుతూ వొచ్చారు. ఈ కొండలూ, అడవులూ లేకపోతే నక్సలైట్లకి బహుకష్టం. అందుకని తమ కోసమయినా వారు సర్కారువారితో సమరం సాగిస్తా రేమో. పోరు సల్పుతారేమో. తానొకందుకు పోస్తే వాడొకందుకు తాగాడన్నట్లు-

★ ★ ★

వారెందు నిమిత్తం పోరాడినా... గెలిస్తే మాత్రం గిరిజన గూడేలూ అడవులూ క్షేమం. ఈ అన్నలు- తన మొర విని- దయామయుడు శ్రీరాముడు పంపిన దూతలే! ఔను. వీరు రాముని పనుపున తమ పక్షాన వొచ్చినవారే. అలనాడు రావ ణాసురుడపహరించి ఎత్తుకుపోయిన సీత మ్మని తిరిగి పొందడంలో రామునకు సాయపడింది వనవాసులేగదా! అది గుర్తు తెచ్చుకుని కృతజ్ఞతాసూచకంగా రుణం తీర్చుకుందుకు లభించిన అవకాశాన్ని విని యోగించుకునే ఉద్దేశంతో... తమను ఆపద నుండి గట్టెక్కించాలని... సాక్షాత్తూ శ్రీరా ముడే అన్నలను పంపాడేమో అత్యవసర క్షణాల్లో...

రామా! జగద్రక్షకా! శ్రీరామచంద్రా! ఆశ్రిత పారిజాతా! అనుకుంటూండగా...

తుపాకులు పేలిన చప్పుళ్ళు

పోలీసులు తుపాకులు తీసుకుని నాలుగు

వేపులకీ పరుగులు తీశారు.

కొద్ది నిముషాలలో విధి విరామాలు లేకుండా తుపాకుల పేలుళ్లు.

ఎక్కడో పోరాటం జరుగుతోంది. ఎక్కడో కంటికి కానరాకుండా... ఏదో... ఏమిటో తెలియకుండా... జరుగుతోంది.

ఆఫీసర్లు మాత్రం చెక్కు చెదరడం లేదు. చలించడంలేదు. స్థిత ప్రజ్ఞులులా తమపని తాము చేసుకుపోతున్నారు దీక్షగా. డబ్బం దుకుంటున్న గిరిజనులా కాగితాల నతిభ ద్రంగా గుండెలకదుముకుని, తమ ప్రాణాల కంటే ఆ సొమ్మే ఎక్కువన్నట్లు భద్రతకోసం వెదుక్కుంటూ పారిపోతున్నారు.

పెద్దాఫీసరు సహాయకులకు ధైర్యం చెబుతున్నాడు. "నాకు తెలుసు. నేను ముందే అనుమానించాను నక్సలైట్లు మన కడ్డుపడ వొచ్చునని. అందుకే అందరు పోలీసులను వెంటబెట్టుకొచ్చాను. స్టెన్‌గన్‌లూ... మెషీన్‌గన్‌లూ... ఎ.కె. 47లూ కూడా ఉన్నాయి మన పోలీసుల దగ్గర. వారి సంఖ్య స్వల్పం కాదు. సమర్థత తక్కువదికాదు. ఇప్పుడిక్కడ ఎన్‌కౌంటర్ ప్రారంభమయింది. దీనిలో విజయం మనదే. మన ప్రభుత్వానిదే. ఎందరు నక్సలైట్లు పిట్టల్లా రాలిపోతారో చూడాలి. కొందరు నక్సలైట్లని మట్టుపెట్టించిన ఘనత కూడా మనకే లభిస్తుంది. మీరు నిశ్చింతగా మీ పనులు సాగించండి. మీ ప్రాణాలకు నా ప్రాణం అడ్డం. భయంలేదు" క్రమక్రమంగా అటు నుంచి యిటు... డబ్బు తీసుకునే వారి వరుసలోకి ఒక్కొక్కరూ వచ్చేస్తున్నారు గిరిజనులు.

డబ్బు ఎంత శక్తివంతమయినది! మనిషిని ఎంత మాయ చేయగలదు! మనసునే ఎంతగా మార్చివేయగలదు!

అవతల- ఎడతెరిపిలేకుండా తుపాకి శబ్దాలు...

చావడివేపు రావాలని ప్రయత్నిస్తున్న నక్సలైట్లను పోలీసులు నిరోధిస్తున్నట్లున్నారు.

పోరాటం తీవ్రంగా సాగుతోందని తుపాకి శబ్దాలే చెబుతున్నాయి.

పూజారి, భీమన్నా, మహారాజూ గుండెలు గ్గబట్టుకుని నిరీక్షిస్తున్నారు. వొచ్చిన పని ఊహించనంత సులభంగా జరిగిపోతున్నందుకూ... గూడెం వొదలం అన్న వారి గుంపు పలచబడిపోతున్నందుకూ పరమానందభరితుడైపోతున్నాడు అధికారి.

"వీళ్లని నల్గొండ ప్రాంతం పంపిస్తాం"

"దేనికీ? "

"అక్కడా అడవులు నరికి కొండలు చదును చేసే పనుంది. వీళ్ళను అక్కడికి పంపి వాళ్లనిక్కడికి రప్పిస్తాం"

"అలా ఎందుకూ రవాణా ఖర్చు దండగ? "

"వీళ్లు చదువులేని వాళ్లు. సెంటిమెంట్లెక్కువ. తమ చేతులతో తమ అడవులనే నరకాలంటే వాళ్ళలో సెంటిమెంటూ, పౌరుషమూ, గతమూ, బయటపడి సమయానికి ఎదురు తిరగవొచ్చు అందుకని... యిక్కడి వాళ్ళనెక్కడి అడవులనో నరికే పనికి పంపితే అనుబంధాలుండక అడవులను నరుకుతారు. బండ పనులూ కొండపనులూ వీళ్లకి చేతనయినట్లు ప్లేన్స్ వాళ్లకి చేతకాదు'

"అబ్బా! ఎలాటి ఐడియా!" ఆఫీసరుకి కాకాపట్టాడు సహాయకుడు అవకాశం దొరికిందని.

అవతల... దూరంగా... తుపాకులు పేలుతూనే ఉన్నాయి.

ఆవేళ ఎందుకో సూర్యుడు రాలేదు చాలా వేళయినా. మబ్బు లేకపోయినా ఆ గూడెం వేపు తొంగిచూడడం లేదు సూర్యభగవా



నుడు.

"ఈ సర్కారు... మనవాళ్ళని ఉద్ధరిస్తుందో, ఉత్తరిస్తుందో" నిర్వేదంగా అన్నాడు భీమన్న ప్రత్యేకంగా ఎవరినీ ఉద్దేశించకుండా ఆకాశంలోకి చూస్తూ.

కాలం గడుస్తోంది.

పని నడుస్తోంది.

ఫొటోగ్రాఫరు చకచక ఫొటోలు తీసేస్తూ రీలు తిప్పేస్తున్నాడు.

మహారాజు... భీమన్న... పూజారి... నిర్లిప్తంగానూ నిస్సహాయంగానూ కూర్చున్నారు డబ్బు తీసుకుందుకు పోటీపడుతూ తోసుకువొస్తున్న స్వజనాన్ని చూస్తూ. వారు ముగ్గురు తప్ప- అందరూ వేలిముద్రలు వేయనూ వేశారు. డబ్బు తీసుకోనూ తీసుకున్నారు. అప్పుడే డబ్బు తీసుకున్న కొందరు తప్పతాగి తూలుకుంటూనూ వొస్తున్నారు కూడా.

అవతల తుపాకీలు ఎడతెరపిలేకుండా పేలుతూ అక్కడ పెద్ద పోరాటమే జరుగుతోందని సూచిస్తున్నాయి.

"మీరు ముగ్గురే మిగిలారు" అన్నాడు ఆఫీసరు వారి వద్దకు వొచ్చి విజేతలా. అతని కంఠంలో ఎగతాళితో కూడిన జాలీ సానుభూతీ. అంతలోనే ఒక ఎర్ర టోపీ పరుగుపరుగున వొచ్చిందక్కడికి. "గెలుపు మనదే. పన్నెండుగురు నక్సలైట్లు చచ్చారు. మటాష్. మన పోలీసులూ నలుగురు పోయారు కానీ నెవర్‌మైండ్. విచారించక్కర్లేదు. ఈ విజయంతో మా పోలీసులకి ప్రమోషనూ... కొండలకు విముక్తీ కూడా తథ్యం. బతికున్నవాళ్ళమయినా సుఖపడతాం"

"గుడ్! మరింకా ఆ తుపాకి శబ్దాలేమిటీ? "



"ఆరిపోయేముందరి దీపం వెలుగు. చెట్టు చచ్చే కాలానికి వొచ్చే కుక్కమూతి పిందెలు. పారిపోతూ పోతూ వాళ్ళు సాగిస్తున్న కాల్పులు" అంటూండగానే కాల్పులాగిపోయాయి.

గెలుపు- ముందే ప్లాను ప్రకారం వచ్చిన పోలీసులదే అయింది. సర్కారుదే అయింది.

ఆఫీసర్లతో వచ్చిన ఓ పత్రికా విలేఖరి "నేనొకసారి స్పాట్‌ని స్వయంగా చూసి వివరాలు రాసుకునీ ఫొటోలు తీసుకునీ వొస్తాను. మీరింకా ఉంటారు కదా! నన్ను మరచిపోయి పోకండేం, అడివిలో ఒంటరిగా చస్తాను" అని నవ్వేసి ఎన్‌కౌంటర్ జరిగిన స్థలానికి బయలుదేరాడు కెమెరా, సంచీ భుజానికి వేసుకుని. గంటందొర ఒక్కసారి తన చేతిలోని పట్టాలను చూసి... మహారాజుకీ భీమన్నకీ వారివి వారికందించాడు.

"పూజారీ!" రుద్ధకంఠంతో పిలిచారిద్దరూ ఒక్కసారే.

"వొద్దు... ఆ జీవితమూ... అధ్యాయమూ ముగిసిపోయాయి. గూడెమే లేనిదే పూజారెక్కడ? నేను యిక గంటందొరని మాత్రమే" అభావంగా ఉందతని కంఠం.

సింహాసనంనుంచి తొలగించబడిన వృద్ధ మహారాజులాగే ఉన్నాడతను అనిపించింది భీమన్నకు. మహారాజుకయితే ఆపుకోలేని దుఃఖమొచ్చేసింది.

మెల్లగా అన్నాడు భీమన్న. "పూజారీ! మన గిరిజన గూడేలకిన్నిళ్ళుండాలని నియమమేమీ లేదు కదా! రెండు మూడిళ్ళున్నా... గుడిసెలున్నా... పాకలున్నా గూడెమే... నీ అవస్థ నేనర్థంచేసుకోగలను. తన కనులముందే సామ్రాజ్యం కూలిపోతూంటే మహారాజులో కలిగే నిర్వేదమే నీకూ అనుభవాని కొస్తోంది. కాని...

పూజారీ! నీ సామ్రాజ్యం పూర్తిగా పరహస్త మైపోలేదు" అంటూ తన పట్టాని తిరిగి అతని చేతిలో ఉంచాడు. మరుక్షణం మహా రాజు కూడా అలాగే చేశాడు.

ఒక్కసారిగా పూజారి ఏడ్చేశాడు. "మీ అభిమానానికి... విశ్వాసానికి... కృతజ్ఞ తలు. కాని... నేను యిక మీకేం చేయగ లను? ఒకప్పుడు వైభవంగా అరవై పైచిలు కిళ్లతో విలసిల్లిన గూడేన్ని చూసుకుందుకల వాటు పడిన కళ్లతోనూ మనసుతోనూ... మూడు గుడిసెల రాజుపాకలను చూడడం నాతరం కాదు. జీవితపు చివరి అంచువ రకూ వొచ్చాక నాకీ విషాదమెందుకు? ఇంకా నాకీ జీవితంలో ఏముందని? మన మరాలు తిరిగివొస్తుందన్న ఆశ లేదు. అలాగే యీ గూడెమూ జారిపోయింది. ఇప్పుడు నేను చేయగలిగినదీ, చేద్దామను కుంటున్నదీ వేరు..." అంటూ లేచి నిలుచు న్నాడతను మెల్లగా... వాళ్ళిద్దరూ కూడా లేచి నిలుచున్నారు.

అధికారి కళ్ళు ఆనందంతోనూ గర్వం తోనూ మెరుస్తున్నాయి. సంపూర్ణ విజయం అని తనని తానే అభినందించుకున్నాడు మనసులో.

కాని-

పూజారి అడుగులు అతనివేపు పడలేదు. అడవివేపు నడవసాగాడతను.

అతన్నే అనుసరించసాగారు భీమన్నా, మహారాజు.

"మీరెక్కడికి? "

"మీరెక్కడికో మేమూ అక్కడికే"

"అసాధ్యం. నేను వెళ్లేది తోడుగా వెళ్లే చోటు కాదు. మీరు వెనక్కి వెళ్లండి. నన్ను ముందుకి పోనివ్వండి... నేను వెళ్లేది వెనక్కి రాలేని ముందుకి"

"పూజారీ! మనం ముగ్గురమూ జీవిత మంతా కలిసే ఉన్నాం. ఇక ముందూ కలిసే ఉందాం. నువ్వేకాదు, మేమూ కాలం చెల్లినవాళ్లమే. మాకూ యిక యిక్కడ గూడెంలో ఏమీ మిగలలేదు. ఊరకుక్క లను మునిసిపల్ బండీలోలాగ మనవాళ్లని లారీల్లో వేసి తోలుకుపోతూంటే చూడ లేము. పద, మనకీ గూడేనికీ... మనకీ బతుక్కీ రుణం తీరిపోయింది. మరేమీ చెప్పకు పద"

ముగ్గురూ చాలాదూరం నడిచి ఒక్క సారిగా వెనుదిరిగారు.

చేతిలో పట్టాలను జరిగిన దానికి తమ నిరసన తెలుపుతున్నట్లుగా- పరపర చింపేసి ఆ ముక్కలను దూరంగా కనపడు తున్న గూడెంవేపూ చావడివేపూ విసిరేసి అడుగులు వడివడిగా అడవివేపు వేయసా గారు.

ఇంత జరిగినా ఇంత వేళయినా సూర్యు డింకా ఉదయించనే లేదు.

"పూజారీ!" అన్నాడు మహారాజు బాధగా.

ఇక ఆ గూడెం మీద, రాజు పాకలమీద సూర్యుడు ఎన్నటికీ ఉదయించలేడేమో.

సాయంత్రమే లారీలు వొచ్చి... రాత్రికే గూడెంలోని మనుషులనీ గుడిసెలలోని సామానులనీ ఎక్కించేసుకుంటాయి గుడి సెలు నేల మట్టమౌతాయి ఆ వెళ్ళిన లారీ లలో తిరిగి వొచ్చే కూలీల చేతుల్లో. రాజు పాకల గూడెం ఇహ ఉండదు. నిన్న టిలో... చరిత్రలో... కాలగర్భంలో కలసి పోతుంది క్రమంగా. కొన్నాళ్లకక్కడ నాగర కతా చిహ్నాలుగా కాంక్రీట్ అరణ్యాలు వెలు స్తాయి.

ఇప్పటికే ఎన్నో కొండలు పిండయ్యాయి, బోడయ్యాయి.

ఎందరో కొండవాళ్ళ బతుకులు బూడిద య్యాయి.

అడవులు అంతరించిపోయాయి.

అయినా ఇంకా కొన్ని కొండలూ అడ

వులూ మిగిలి ఉన్నాయి యిప్పటికీ. వీటిన యినా మిగుల్చుకోగలడా మానవుడు, బోడీ, బూడిదా చేసుకోకుండా?

'మానవుడా! నేను నీ అవసరాలను తీర్చ గలను.

నీ ఆశపోతు తనాల్ని మాత్రం తీర్చలేను'

అన్న ప్రకృతిని అర్థంచేసుకోగలడా మనిషి?

"భగవంతుడు భూమినెందుకు సృష్టిం చాడో తెలుసా? నిజానికి ప్రపంచమొక పెద్ద పూల మొక్కల గోలెం. ఆ మొక్కలను సాకుతూ సంరక్షించమని మనిషిని సృష్టిం చాడు. కాని... మనిషి తన సంతతిని విప రీతంగా పెంచేసుకుని చివరికి మొక్కలకే స్థానం లేకుండా చేయసాగాడు స్వార్థంతో. ఇందుకు ప్రతిఫలమూ శిక్షా అనుభవించక పోడు మానవుడు. మనిషి- అమాయకమ యిన చెట్లనెన్నివిధాలుగా బాధిస్తూవొస్తున్నా డని! వృక్షమంటే ప్రకృతికి సౌందర్యమూ అలంకారమూ. వాటి అందాన్ని చూసి సంతోషించి ఊరుకోడు మనిషి. దాని పూలను కోసి మొక్కకి గాయంచేస్తాడు. పక్షులకోసమనీ... తన సంతతినభివృద్ధి చేసుకుందుకనీ అది కాయలు కాస్తే... పళ్లు పండితే వాటిని తస్కరిస్తాడు. వాతావ రణ సమతుల్యాన్ని కాపాడేందుకు-ఎన్నోవి ధాల ఉపకరించే వృక్ష సంతతిని... అడవు లను... చేతులారా నరకడమంటే తననీ తన భవిష్యత్తునీ నాశనం చేసుకోడమే చేతులారా. వృక్షాలే లేనినాడు ప్రకృతీ ఉండదు మానవుడూ ఉండడు.

"ప్రభుత్వ విధానాలూ కిరికిరిగానే ఉంటు న్నాయి. ఒకవేపు వనమహోత్సవాలకనీ... సామాజిక వన సంరక్షణకనీ కోట్లాది డబ్బు ఖర్చుచేస్తారే తప్ప... ఉన్న అడవులను కాపాడరు. గిరిజనులను కొండదింపుతామం టారు తప్ప... అడవి గురించి అంతా తెలి సిన వారమూ... అడవులను భక్తిశ్రద్ధలతో పెంచగలవారమూ కదా మనకే అడవులని చూసుకోమని ఎందుకప్పగించరు?

లాభంలేదు. ఈ పరిస్థితి మారదు.

"పూలమ్మిన చోట కట్టెలమ్మడమే కాదు, కలకలలాడే అడవిని చూసుకుంటూ వొచ్చిన కళ్లతో చెట్లులేని బోడి నేలని చూడవలసి రావడమూ మనసున్న మనిషికి పెద్ద శిక్షే. కొండలను చదునుచేసేస్తున్నామన్న సంబ రమే కాని- ఆ కొండలవల్లే, అడవులవల్లే వాతావరణం స్థిరంగా ఉంటూందని గ్రహిం చడంలేదు. ఇలాగ కొండలను కొట్టుకుంటూ పోతే- భూకంపాలొస్తాయి. జనం అధిక సంఖ్యలో మరణిస్తారు.

"సరేలే... ఇప్పుడివన్నీ అనుకుని ఏంలాభం. ముందు గురించే ఆలోచిం చాలి. నువ్వడిగావు కనుక నా వేదనంతా చెప్పుకున్నాను, గుండె తేలిక చేసుకుందా మని. మన కొండా, అడవీ స్మశానం కావడం నేను సహించలేను. అందుకనే నేనూ నిన్ననుసరించడం..."

"పూజారీ! నేను భీమన్నలా సదువుకున్నో డినికాను. కనుక నా గుండెల్లోని గుబులునీ దిగులునీ సరిగా చెప్పుకోలేను. ఐనా. ఒకటి మాత్తరం చెప్పగలను. మన ముగ్గురమూ ఒకటిగా బతికాం ఎన్నో ఏళ్లుగా. సంసారా లకంటే మన స్నేహమే ముంగల మొదల యింది. నువ్వూ భీమన్నా ఏంచేస్తే నేనూ అదే"

వాళ్ళ ముగ్గురి గుండెలూ బరువెక్కిపో యాయి, తేలికా అయ్యాయి. గొంతులు మాత్రం మూగపోయాయి.

అప్పటికే వాళ్ళు దట్టమయిన అడవిలో ఉన్నారు.

పట్టపగలే చిట్టచీకటిగా ఉందక్కడ. చీక ట్లోనూ వెలుగు కనిపిస్తోంది వారికి.



# ఆణిముత్యాలు

★ ఇతరులకు కష్టమైన పని సులభంగా చేయడం సామర్థ్యం, సమర్థులకు కూడా కష్టమైన పనిని సులభంగా చేయడం 'ప్రతిభ'కు నిదర్శనం.

-అమీయల్

★ ప్రతిభ అనేది ఒకశాతం ప్రేరణైతే, తొంభైతొమ్మిది శాతం చెమటోడ్చడం.

-థామస్ అల్వా ఎడిసన్

★ మనం చేసే పనులయొక్క ఫలితాలను ఎలాగూ తప్పించుకోలేం కాబట్టి, మనం మంచి పనులనే చేయడానికి కృషిచేద్దాం.

-గౌతమబుద్ధ

★ కఠినమయినదనేది మన చుట్టూ లేదు. అది మనలోనే ఉంది.

-శ్రీ అరబిందో

★ చపలచిత్తంతో దేవుణ్ణి గంటలకొద్దీ ప్రార్థించేకన్నా, భక్తిశ్రద్ధలతో రెండు నిమిషాలు ప్రార్థిస్తే చాలు.

-శారదాదేవి

★ విద్య అనేది యువతరానికి కట్టుబాటులాంటిది. బీదవానికి ధనంలాంటిది, ధనవంతునికి ఆభరణంలాంటిది, వృద్ధులకు ఉపశమనం ఇచ్చేది.

-డయాజీన్స్

★ జ్ఞానం అందరినీ ఏకంచేస్తే, అజ్ఞానం విబేధాలను సృష్టిస్తుంది.

-శ్రీ రామకృష్ణ పరమహంస

★ ప్రేమ ప్రేరణ అయినప్పుడు మరియు జ్ఞానం సరియైన తోవ చూపించినప్పుడే ఆహ్లాదకరమైన జీవితం సాధ్యమవుతుంది.

-బెర్ట్రాండ్ రస్సెల్

★ సంతోషం అనేది దుర్మార్గమునకు ప్రేరకమువంటిది.

-ప్లాటో

★ నీవు జీవించేది ఒక్కసారే. దాన్ని సార్థకత చేసుకుంటే ఈ ఒక్కసారి జీవించడమే చాలు.

-ఫ్రెడ్ అలెన్

★ నీలోని భయాన్ని నీలోనే ఉంచుకో. కాని నీలోని ధైర్యాన్నిమాత్రం నలుగురికి పంచు.

-రాబర్ట్ లుమీస్ స్టివెన్‌సన్

★ నేను మాట్లాడిన విషయాలపై అప్పుడప్పుడూ చింతించేవాడిని. కాని నా మౌనం విషయంలోమాత్రం ఆ బాధలేదు.

సేకరణ: బొమ్మన శ్రీనివాసరావు

# చేతిరాత కతలు

## కల్యాణయోగం

"నా పేరు సుదర్శనం. ఇతను నా బావమరిది సోమేశ్వరం. మాకు చాలా వ్యాపారాలు ఉన్నాయి. మాకు ఒకే ఒక్క అమ్మాయి సునీతి. మీది చాలా మంచి కుటుంబమని రిటైర్డు జడ్జి హరిశ్చంద్రగారు చెబితే వచ్చాము" అంటూ సేల్సు టాక్సు ఆఫీసరు చక్రపాణితో పరిచయం చేసుకొన్నారు వాళ్లిద్దరూ.

"మా అబ్బాయి సుగుణాకర్ గురించేనా? " అడిగాడు చక్రపాణి.

"అవునండీ! పెండ్లి కొడుకు గురించేగదా మేం వచ్చింది" సమాధానమిచ్చాడు సుదర్శనం.

"ఎంత ఇవ్వగలరు" సూటిగా అడిగాడు చక్రపాణి.

"వరుడి ఆదాయాన్ని బట్టే గదా మేము ఇచ్చేదీనూ" నవ్వుతూ అన్నాడు సుదర్శనం.

"జీతానికి రెట్టింపు పై ఆదాయం వచ్చే గవర్నమెంటు ఉద్యోగి మా అబ్బాయి" గర్వంగా చెప్పాడు చక్రపాణి.

"మీకు ఆస్తిపాస్తులు పెద్దగా లేవుగదండీ! ఉన్న మీ ఇద్దరు అబ్బాయిలూ పంచుకుంటే వచ్చేది ఎంత ఉంటుంది? " అన్నాడు సుదర్శనం

ఆ మాటలకు కోపం వచ్చి చక్రపాణి "ఈ మేడలాంటిది ఇంకోమేడ ఈ ఊళ్లోనే ఉంది. మా ఊళ్లో పదెకరాల మాగాణి పొలం, ఒక కొబ్బరి తోట ఉన్నాయి. మా ఆవిడకు ఎనభై తులాల బంగారముంది. క్యాష్ పదిహేను లక్షలపైన ఉంది. ఇవన్నీ పంచుకుంటే ఒక్కొక్కడికి ఎంత వస్తుందో లెక్కవేసుకోండి. మా అంతస్తు ఎటువంటిదో తెలుసుకోకుండా వచ్చి మమ్మల్ని అవమాని



స్తారా? అసలు మీ అమ్మాయికి కల్యాణ యోగం ఉన్నట్టులేదు. మీలాంటి అహంకారులు, అనుమానస్థులు మాకు అక్కర్లేదు. మీ సంబంధం మాకు వద్దు. వెళ్లిరండి" కోపంగానూ చిరాకుగానూ అన్నాడు చక్రపాణి.

"అన్ని వివరాలు స్వయంగా మీరే చెప్పాక వట్టి చేతులతో ఎలా వెళతాం? నేను ఇన్‌కంటాక్సు డిపార్టుమెంటులో పని చేస్తున్నానులెండి" అన్నాడు సుదర్శనం.

"నేను అవినీతి నిరోధకశాఖలో పనిచేస్తున్నాను" అన్నాడు అంతవరకు ఆయన పక్కనే మౌనంగా కూర్చున్న సోమేశ్వరం.

చక్రపాణి నోట్లోనుండి 'ఆc? ' అన్న శబ్దం కూడా రాలేదు.

— బి.అనూరాధా ప్రసాద్

---

## అమ్మో! ఆపరేషనే!?

కుబేరుడైన జిల్లా పరిషత్తు ఛైర్మన్ కుచేలావు ఒక శుభముహూర్తాన పట్నంలోని సూపర్‌స్పెషాలిటీ ఆస్పత్రిలో చేరి ఆపరేషన్ చేయించుకున్నాడు. ఈ విషయం ఆనోటా ఆనోటా పాకి ఊరూ వాడా వ్యాపించింది.

ఇంకేముంది ఎక్కడలేని జనం తండోపతండాలుగా వచ్చి బంధుత్వాల్ని కలుపుకుంటూ ఛైర్మన్‌గార్ని కలిసి వెళ్తున్నారు. ఎలక్షన్లలో 'తమకులం వాడుకదా!' అని ఛైర్మన్‌గారికి వాళ్లేకదా మరిసాయం చేసింది? అంతేకాదు. రేపు తమకేదైనా అవసరమొస్తే ఛైర్మన్‌గారి సాయం కోరాలంటే ఇప్పుడే కదా మరి కలవాల్సింది? అదీ వాళ్ల అభిప్రాయం.

పనిలో పనిగా మండలాధ్యక్షులూ, సర్పంచ్‌లూ, ఉప సర్పంచ్‌లూ చివరికి పంచాయితీ బోర్డు మెంబర్లదాకా ఎవరూ తమకొచ్చిన ఈ అవకాశాన్ని జారవిడుచుకోలేదు. కాంట్రాక్టర్ల సంగతి వేరే చెప్పక్కర్లేదు. రాబోయే జిల్లా పరిషత్తు కాంట్రాక్టులని గూర్చి కలలు కంటూ ఒకటికి పదిసార్లెళ్లి కలిసొస్తున్నారు. పెద్ద మనుషుల్ని ఉట్టిచేతులతో కలవకూడదు కాబట్టి, వెళ్లిన వాళ్లందరూ ఛైర్మన్‌కేదో ఘనంగా ముట్టజెప్పే వస్తున్నారు. తమకు తాము ఛైర్మన్ హృదయంలో స్థానం సంపాదించుకున్నామని



మురిసిపోతున్నారు. ఛైర్మన్ కూడా ఎవరెన్ని సార్లొచ్చిందీ, ఏమేం తెచ్చిందీ ఓ పొడుగాటి లిస్టు తయారు చేసి అట్టే పెట్టుకుంటున్నారు.

ఛైర్మన్ తయారు చేస్తున్న లిస్టును గూర్చి ప్రభుత్వోద్యోగులకి తెలిసింది. దాంతో ఉద్యోగుల్లో సంచలనం మొదలైంది.

ముందుగా గొడవల్లో చిక్కుకున్న ఓ మండలాభివృద్ధి అధికారెల్లి ఛైర్మన్‌ని కలిశాడు. దాంతో ఉద్యోగులెవరికివాళ్లే ఉరుకులు పరుగులమీదెల్లి ఛైర్మన్‌ని స్వీట్సూ ఫ్రూట్స్‌తో కలిసొచ్చేస్తున్నారు. కొందరుద్యోగినులైతే స్వయంగా చక్కని మాంసాహారాల నొండి పట్టికెళ్లి ఛైర్మన్‌కి స్వహస్తాలతో తినిపించేస్తున్నారు. జిల్లా పరిషత్తు గ్రాంట్లతో నడిచే చిన్నా చితకా ఆస్పత్రుల డాక్టర్లైతే బలానికి టానిక్కులు పట్టికెళ్లి ఇస్తున్నారు. మ॥ కొందరేమో యవ్వనగుళికలూ, సిద్ధమకరధ్వజం, స్వంతంగా తయారుచేసిన కాయకల్ప చూర్ణాలూ ఇచ్చొస్తున్నారు. ఎవరికివాళ్లే కుట్టిప్పినా కదలొద్దనీ, ఎక్కువ రెస్టు తీసుకోమనీ, డైలీ నాటుకోడి మాంసం తినమనీ సలహాలిచ్చేస్తున్నారు. ఈ భస్మాసురుడి వంటి మూర్ఖపు ఛైర్మన్‌వల్ల తమకి మంచి జరక్కపోయినా ఫర్లేదుగానీ, చెడు జరక్కుంటే అదే పదివేలనుకునే ముక్కుకు సూటిగా పోయే నిజాయితీ పరులైన ఉద్యోగులు కూడా భయంతో వెళ్లి కలిసొచ్చారు.

"యింతకీ... ఛైర్మన్‌గారికి ఏమిటి జబ్బు! ఎందుకీ ఆపరేషన్?" డాక్టర్ని అడిగాడో ఆశ్రితుడు.

మెల్లగా చెబుతాను వినండి. ఛైర్మన్‌వల్ల కీడు నాకూ కలగొచ్చు విషయం తెలిసి మీరు నవ్వొద్దు. గప్‌చుప్‌గా వుండండి. ఇద్దరు భార్యలద్వారా డజనుమందికి పైగా పిల్లల్ని కన్నారు గదా, ఛైర్మన్‌గారు. పెద్ద సూపర్ స్పెషాలిటీ ఆస్పత్రిలోనైతే దర్జాగా ఉంటుందని చేయించుకున్నారలెండి! ఆ ఆపరేషన్ పేరు వే... సె.క్ట..మీ..!!" అన్నాడా డాక్టర్!

—రాంరఖీ

---

## గోల్డెన్ 'సర్జరీ'

ముకుందరావు ప్రజల అమాయకత్వంతో 'మినిస్టర' యి, గవర్నమెంటువారి 'డబ్బు'తో బతుకుతూ, తన తెలివితేటలతో లంచాలు మెక్కుతూ 'సుఖా'లకు, విలాసాలకు, అలవాటుపడ్డాడు.

ఒకనాడు శాసనసభలో ఆవేశంగా ప్రసంగిస్తూండగా, పౌరుషంగా లేచిన ప్రతిపక్ష నాయకుడ్ని కొట్టబోయి, ముందుకు తూలిపడ్డాడు. అప్పటికే విరిగిపోయిన 'మైకు' అతని ముక్కును ముద్దుగా ముద్దుపెట్టుకొంది. రక్తంతో తడసిన అతని ముఖం చూడగానే ఒక ఎర్రజెండా వాళ్ళు తప్ప అందరూ చాలా బాధపడ్డారు.

ముక్కు'కు సర్జరీ చేసి పూర్వపు ముక్కులా చేస్తామన్నారు డాక్టర్లు. ప్రస్తుతం ముక్కు మన ఆర్థిక వ్యవస్థలా అస్తవ్యస్తంగా వుంది. 'సర్కారు' మీద పడి తినటం అలవాటయ్యాక జేబులో డబ్బులు తీయడానికి ఎలా మనసొప్పుతుంది? ఆపరేషన్ ఖర్చుకోసమై గవర్నమెంటుకి 'అర్జీ' పెట్టుకున్నాడు. అమెరికాలో ఆపరేషన్ చేయించుకుంటాను అని రాశాడా పత్రంలో.

ప్రభుత్వం అప్పుడప్పుడు ముకుందరావు ముక్కులా కాకుండా, ఒక్కోటప్పుడు తిన్నగానే పోతుంది. "అమెరికా వెళ్ళటానికి వీల్లేదు. ఇండియాలోనే 'బొచ్చెడు' డాక్టర్లున్నారు. వారితో చేయించుకోండి. ఫీజు మేము చెల్లిస్తాం" అని బదులిచ్చారు.

ప్రఖ్యాత ప్లాస్టిక్ సర్జన్‌ని కలిశాడు ముకుందం. తన ముక్కుకు మళ్ళీ 'ఫేస్ వా



ల్యూ' తెప్పించాలన్నాడు. 'ఫీజు' విషయం మీరు బెంగపెట్టుకోకండి. ప్రభుత్వ ఖజానా నా ఖద్దరు లాల్చీ జేబులో వుందని సెలవిచ్చాడు. వాల్‌పోస్టర్ నెమరువేసే 'గేదె'లా ఆయన తలూపాడు.

"మనం ఎంత డబ్బు ఖర్చయ్యిందో రాస్తే 'మెడికల్‌లోన్' కింద వాళ్ళే శాంక్షన్ చేస్తారు. కాబట్టి..." అంటూ నసిగాడు ముకుందం.

"చెప్పండి... వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ..." అన్నాడా డాక్టరు కళ్ళముందు ఖజానా కదలాడటంతో.

"పనిలో పని ఆ చేసేదేదో 'ప్లాస్టిక్ సర్జరీ' బదులు ఏ 'బంగారపు సర్జరీ'యో, వెండి సర్జరీయో చేస్తే పోలా!?" అన్నాడు ది గ్రేట్ పీపుల్స్ లీడర్ 'ముకుందం'!

ఆ సర్జెన్‌కి నోటమాట రాలేదు.

-డా. కె. శివసుబ్బారావు

---

# రోమియో

లాకప్‌లో 'ఖైదీ'ని కుళ్లబొడిచి రిలాక్సేషన్ కోసం బయటికి వచ్చాడు యస్.ఐ. ముత్తు. అరువుగా కిళ్లీకొట్టు దగ్గర కొట్టుకొచ్చిన సిగిరెట్‌ని విలాసంగా కాలుస్తున్నాడు.

"సార్... మీకోసం ఎవరో వచ్చారు!" అని చెప్పాడు వన్‌నాట్ త్రీ.

"కొంపదీసి యస్.పి.గాని వేంచేయలేదుగా?"

"లేదు సార్... ఎవడో బడిపంతుల్లా వున్నాడు''

"సరే పంపించు''

బిడియంగా లోపలికి వచ్చాడొకాయన. ధవళవస్త్రాలు ధరించాడు. సంస్కారవంతమైన ముఖం. వయస్సు యాభైపైనే వుంటుంది.

"ఏం కావాలి నీకు?" ఎగాదిగా చూస్తూ అన్నాడు ముత్తు. కనీసం ఆయన వయస్సు కన్నా గౌరవం యివ్వకుండా మాట్లాడాడు.

"నమస్తే... నా పేరు సోమశేఖరం. నేనొక హైస్కూల్లో తెలుగు టీచర్‌గా పనిచేస్తున్నాను. మీరు నాకు..." అంటూ ఆగారాయన.



"చెప్పు... ఏం కావాలి?" గద్దిస్తూ అన్నాడు ముత్తు.

లోపల ఖైదీ మూలుగులు వినిపిస్తున్నాయ్. "మీరు మా యింటికోసారి లంచ్‌కి రావాలి!"

"భోజనానికా? ఎందుకు? ఏమిటి విశేషం? మనిద్దరం ఒకరికొకరు అపరిచితులం. నువ్వు నన్ను ఎందుకు భోజనానికి పిలుస్తున్నావ్"

"కొంచెం పనుంది. మీరు నాకు ఏమీ సాయం చేయనవసరంలేదు. ఒకసారి వచ్చి వెళ్ళండి" అన్నారు సోమశేఖరంగారు.

కొద్దిసేపు బతిమాలాక 'ముత్తు' ఒప్పుకొన్నాడు. "ఓ.కే. రేపు మధ్యాహ్నం వస్తాను. నీ అడ్రస్ యిచ్చి వెళ్ళు. కొంపదీసి నామీద విషప్రయోగం ఏమీ చెయ్యవు కదా!" బుర్ర మీసాలు వూపుతూ అన్నాడు ముత్తు.

"లేదండీ... మీ రాకే మాకు పదివేలు అన్నట్లు డ్యూటీ డ్రస్ వేసుకురండి" అన్నాడు.

మరుసటిరోజు మధ్యాహ్నం సోమశేఖరంగారింటికి వెళ్ళాడు ముత్తు. సుష్టుగా తిన్నాక, తాంబూలం వేసుకొని, సిగిరెట్ తాగుతూ "భోజనం బలే బావుందయ్యా... యింతకీ నీ పనేమిటో చెప్పు చేసిపెడతా!" అన్నాడు.

"పదండి చెప్తాను..." అంటూ వీధి చివర దాకా ముత్తుతో తోడు వెళ్ళారాయన. వరండాలలో, లైట్ల స్తంభాలదగ్గర మూగిన కుర్రవాళ్ళు డ్యూటీ డ్రస్‌లో వున్న ముత్తును చూసి చల్లగా జారుకున్నారు.

మలుపు తిరిగాక "ఇంతకీ నీ బాధ చెప్పావు కాదు" అన్నాడు యస్.ఐ.

"బాబూ! నాకో అందమైన కూతురుంది. రోజూ ఆమె కాలేజీకి వెళ్తున్నప్పుడు ఈ రోమియోలందరు తనని సూటిపోటి మాటలని ఏడిపిస్తున్నారట. మొన్న నా దగ్గర చెప్పుకొని ఏడ్చింది. నేను అర్భక బడిపంతుల్ని. వాళ్ళని ఏమీ చేయలేను. ఒకవేళ వాళ్ళమీద ఫిర్యాదుయిస్తే కోపంవచ్చి వాళ్ళేమైనా చెయ్యవచ్చు. అందుకని మనం కల్సి వెళ్ళటం ప్రతి ఒక్కరు చూశారు ఈ వీధిలో. ఇక నా కూతురికి ఏ భయమూ లేదు. లాకప్ డెత్‌లు చేయటంలో మీ ప్రతిభ జగద్విదితం కదండీ..."

యస్.ఐ. ముత్తుకు కళ్ళు తిరిగినట్లనిపించింది.

**-కె.యస్.ఆర్**

Edited, printed and published by Ramoji Rao for Vasundhara publications, printed at Colorama printers pvt.Ltd., Hyderabad, Tel: 290328. office Address:CHATURA Telugu Monthly Eenadu compound, somajiguda, Hyderabad. Tel: Hyderabad 3318181, 3399444, Madras 470434, Vijayawada 476685, Visakhpatnam 52211, Tirupati 5291, Anantapur 22997, Rajahmundry 71390, Karimnagar 83216; Suryapet: 21146; Guntur: 353942

